asianpaints

SMARTCARE

# ఇప్పుడు లభిస్తుంది చెమ్మ నుండి విముక్తి మరియు వేడి నుండి ఉపశమనం.








డాంప్ ప్రూఫ్ యొక్క విశిష్టమైన ఫార్ములా
మీ ఇంటికి ఇస్తుంది సాటిలేని వాటర్‌ప్రూఫింగ్,
ఇంకా ఇంటి టెంపరేచర్‌ని ఉంచుతుంది
బయటికంటే-5 డిగ్రీలు తక్కువగా.


వాటర్‌ప్రూఫ్ కోటింగ్


టెరెస్ కోటింగ్

నిపుణుల వాటర్‌ప్రూఫింగ్ సమాధానాలకు, మిస్డ్ కాల్ ఇవ్వండి 92425 92425కి



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక

స్వాతి

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM




పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్


ESTABLISHED 1984 | సంపుటి 34 | 9.2.2018 | సంచిక 32

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


Faith keeps the man who has faith in him



ముఖచిత్రం : పిలుస్తోంది
Courtesy : VANITHA

► సీరియల్స్



► కథలు



► స్పెషల్ ఫీచర్స్



► శీర్షికలు



# వేయి మాటలేల?!

అసత్యపుమాటలు అనర్థాన్ని తెచ్చిపెడతాయి. అనంతదుఃఖానికి ఆలవాలమై బ్రతుకును అగ్నిగుండానికి ఆహుతిచేస్తాయి.

బ్రతుకుబాటను తీర్చిదిద్దలేని మాటలెందుకు? అటువంటి మాటలు మూగబోనీ.

అధికప్రసంగం చేసేవాడు అసత్యవాది కాకతప్పదని ఆర్యోక్తి. అనవసర విషయాల్ని ప్రస్తావించడం మానాలి. మాటలకన్నా గంభీరంగా, శ్రావ్యంగా మాట్లాడుతుంది మౌనం.

ఆ మౌనం ఎంతందంగా వుంటుందీ!

ఉరకలేస్తూ పరుగులిడే నదీప్రవాహంలో వినిపించే సంగీత ప్రభావమేమిటి? సూర్యోదయంతో వికసించే రంగురంగుల పుష్పపంక్తిలో తెలియబడే సాహిత్య సౌరభమెలాంటిది.

వినీలాకాశంలో తీర్చిదిద్దినట్లు కనిపించే ఇంద్రధనుస్సును సౌందర్యంతో పరవశింపచేసే దృశ్యమేమిటి? ఉవ్వెత్తునలేచే సముద్రకెరటాలు అందించే సందేశమేమిటి?

హృదయాన్ని కరిగించి, మనస్సును మైమరపించే ఈ ప్రకృతిదృశ్యాలు నిస్వార్థత్యాగమయ కిరణాలు. మానవుని బ్రతుకులోని ఔన్నత్యాన్ని ఎత్తిచూపే ఆదర్శతోరణాలు. అందుకే అవి మానవుల మాటల కన్నా శక్తివంతమైవుంటాయి.

మహాపురుషులనబడేవారంతా సంఘాన్ని సంస్కరించారు. మనుషుల్ని మార్చారు. అయితే వారు మార్చింది మాటలతో కాదు, చేష్టలతో, పవిత్రమైన ఆచరణతో. కనుక మనమూ అలాగే జీవిద్దాం.

మన ఆదర్శజీవితంద్వారా ఇతరులలో జీవన జ్యోతుల్ని వెలిగిద్దాం. అనుష్ఠానవేదాంతాన్ని మన బ్రతుకుల్లో ఆవిష్కరించుకోవాలి. మరి మాటలు? మాట్లాడిందిచాలు. ఇక వాటి అవసరం లేదు.

మాటలు మూగబోనీ-చేష్టలు మాటలాడనీ.

సనాతన స్రవంతి


E-mail: advtswati@gmail.com swativja@eth.net

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



వచ్చేవారం స్పెషల్ శివమయం

**26.1.2018**

సంపాదకీయంలోని 'మాటల విలువ' ఎంతో విలువైంది.

'మతిమరుపు మొగుడు' కథ హాస్యాన్ని కుమ్మరించింది.

'సామ్రాట్ సముద్రగుప్త' సీరియల్ అద్భుతంగా నడుస్తోంది.

'ప్రత్యక్ష నారాయణుడి పుట్టినరోజు' వ్యాసం రథసప్తమి సూర్యభగవానునికి అంజలి ఘటింపచేసింది.

'ఆన్‌లైన్ కొనుగోలుపై అదుపు ఎలా!' ఫీచర్ డబ్బుని వృధాచేసేవారికి కనువిప్పుగా వుంది.

సి.వి.ఎస్.రావు సికింద్రాబాద్

గురుపుద్వారా నేర్చుకున్న విద్య విలువ బీర్బల్ చెప్పిన తీరు నచ్చింది.

ఆన్‌లైన్ కొనుగోలు కొత్త మార్కెటింగ్ పద్ధతికి ఉదాహరణ. తస్మాత్ జాగ్రత్త అనే సూచన బాగుంది.

'జై భారత్' సీరియల్ బాగుంది.

చేంతాడంత సరుకుల పట్టిక ఇచ్చి, భర్త జ్ఞాపకశక్తికి పరీక్షపెట్టి, నా భర్తకు మతిమరుపు అంటే ఎలాగ అండి? 'మతిమరుపు మొగుడు' కథలో నవ్వు న్నది, ఆలోచన వున్నది. అటువంటి స్థితికి గురికానివారు తక్కువేమో!

పి.నరసయ్య హైదరాబాద్

'మాటల విలువ' గురించి సంపాదకీయంలో సద్గురు జగ్గీ వాసుదేవ్ గారు చక్కగా తెలియజేశారు.

'హీలింగ్ టచ్' స్పెషల్ ఫీచర్‌లో మసాజ్, అందులోని రకాలు, అవి మన శరీరానికి ఏ విధంగా ఉపయోగపడతాయి మొదలైన విశేషాలు రచయిత చక్కగా తెలిపారు.

లక్ష్మీ గిరిజాకుమార్ రాజమహేంద్రవరం

'హీలింగ్ టచ్' ఫీచర్‌లో మసాజ్ ప్రత్యేకత తెలుస్తుంది.

'మనిషిలో మనిషి', 'అఆఇఈ', 'జై భారత్' సీరియల్స్ బాగున్నాయి.

పిల్లలకు పేరుపెట్టాలంటే తల్లిదండ్రులు తగిన విధంగా ఆలోచించాలని 'పేరుమహత్యం' వ్యాసంలో చెప్పారు.

అలాగే బొప్పాయి ఔషధంలా ఆరోగ్యాన్ని ఇస్తుందని 'బహుగుణాలు' ఫీచర్ ద్వారా తెలుసుకున్నాం.

ఆర్.రఘునందన అనంతపురం

'ఆన్‌లైన్ కొనుగోలుపై అదుపు ఎలా!' ఫీచర్ ద్వారా మెయిల్స్ చూసి మోసపోవద్దు అనే విషయాన్ని విపులంగా తెలిపారు.

పేరుపట్ల ఇతరులు ప్రదర్శించే ఆసక్తి పిల్లలకు సంబంధించి పేరు ప్రభావం ఎంతో ఉంటుంది అని 'పేరు మహత్యం' ఫీచర్‌లో ఆసక్తికరమైన విషయాలను అందించారు.

'మతిమరుపు మొగుడు', 'పునర్జన్మ' కథలు బాగున్నాయి.

'మనిషిలో మనిషి', 'అఆఇఈ', 'జై భారత్' సీరియల్స్ బాగున్నాయి.

తేనేటి రమ్యదీప్తి సత్తెనపల్లి



# ఇది మంచి సమయం

**1.2.2018 నుండి 7.2.2018 వరకు శ్రీ హేవళంబి నామ సంవత్సరం, ఉత్తరాయణం, శిశిర ఋతువు, మాఘమాసం, కృష్ణపక్షం.**



**1.2.2018 గురువారం**
తిథి: బహుళ పాడ్యమి మ. 3.44 వరకు
నక్షత్రం: ఆశ్లేష మ. 3.06 వరకు
వర్జ్యం: రా. 2.02-3.30 వరకు
దుర్ముహూర్తం : ప. 10.23-11.08 వరకు. మ. 2.55-3.40 వరకు
రాహుకాలం: మ.1.41-3.06 వరకు
మంచి సమయం: ప. 8.40 నుండి 9.30 వరకు
సూర్యోదయం: 6.36కి
సూర్యాస్తమయం: 5.56కి

**2.2.2018 శుక్రవారం**
తిథి: విదియ మ. 12.54 వరకు
నక్షత్రం: మఖ మ. 12.59 వరకు
వర్జ్యం: రా. 8.28-9.58 వరకు
దుర్ముహూర్తం:ప.8.52 నుండి 9.37 వరకు. మ. 12.39-1.24 వరకు
రాహుకాలం: ప.10.52-12.17 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.36కి
సూర్యాస్తమయం: 5.57కి

**3.2.2018 శనివారం**
తిథి: తదియ ప. 10.36 వరకు
నక్షత్రం: పూర్వఫల్గుని ప.11.24 వరకు
వర్జ్యం: సా. 6.20-7.52 వరకు
దుర్ముహూర్తం: ఉ. 6.36-8.07 వరకు
రాహుకాలం: ప. 9.27-10.52 వరకు
మంచి సమయం: ప. 9.00 నుండి 10.30 వరకు
సూర్యోదయం: 6.36కి
సూర్యాస్తమయం: 5.58కి

**4.2.2018 ఆదివారం**
తిథి: చవితి ప. 8.58 వరకు
నక్షత్రం: ఉత్తరఫల్గుని ప.10.28 వరకు
వర్జ్యం: సా. 6.48-8.24 వరకు
దుర్ముహూర్తం: సా.4.26-5.12 వరకు
రాహుకాలం: సా.4.34-5.58 వరకు
మంచి సమయం: ప.8.50-10.25 వరకు
సూర్యోదయం: 6.35కి
సూర్యాస్తమయం: 5.58కి

**5.2.2018 సోమవారం**
తిథి: పంచమి ప. 8.05 వరకు
నక్షత్రం: హస్త ప. 10.17 వరకు
వర్జ్యం: సా. 6.29-8.07 వరకు
దుర్ముహూర్తం : మ. 12.40 నుండి 1.26 వరకు.మ. 2.56-3.42 వరకు
రాహుకాలం: ఉ. 8.02-9.27 వరకు
మంచి సమయం: ప. 8.45 నుండి 10.20 వరకు
సూర్యోదయం: 6.35కి
సూర్యాస్తమయం: 5.59కి

**6.2.2018 మంగళవారం**
తిథి: షష్ఠి ప. 8.01 వరకు
నక్షత్రం: చిత్త ప. 10.53 వరకు
వర్జ్యం : సా. 4.49-6.31 వరకు
దుర్ముహూర్తం:ప. 8.52 నుండి 9.38 వరకు. రా. 11.01-11.47 వరకు
రాహుకాలం: మ. 3.07-4.32 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.35కి
సూర్యాస్తమయం: 5.59కి

**7.2.2018 బుధవారం**
తిథి : సప్తమి ప. 8.45 వరకు
నక్షత్రం: స్వాతి ప. 12.16 వరకు
వర్జ్యం : సా. 6.21-8.05 వరకు
దుర్ముహూర్తం : ప. 11.54 నుండి 12.40 వరకు
రాహుకాలం: మ. 12.17 నుండి 1.42 వరకు
మంచి సమయం: ఉ. 7.35 నుండి 8.35 వరకు
సూర్యోదయం: 6.34కి
సూర్యాస్తమయం: 5.59కి

* మీరు ఓర్పును అలవరుచుకున్నారు.

# రాకుండా చూసుకోవాలి



క్యాన్సర్ ఒక చిత్రమయిన వ్యాధి. ఎందుకు వస్తుందో తెలియదు. ఏ వయసువారికి వస్తుందో తెలియదు. ఫలానా శరీర భాగానికి వచ్చే జబ్బు అని చెప్పలేం. ఏ అంశం దాని నిర్దిష్ట గతిని మారుస్తుందో తెల్సుకోగల్గితే క్యాన్సర్‌ని నివారించవచ్చు. ఇంకా ఆ దిశకు పరిశోధన పూర్తిస్థాయిలో చేరలేదు. అందుకే క్యాన్సర్ గురించి ముందునుండి జాగ్రత్తగా ఉండండన్న హెచ్చరిక చేస్తుంటారు.

సూర్యుడితోసహా సూర్యకిరణం సోకే ప్రతి అంశం క్యాన్సర్ కారకమే. ఆహారపు అలవాట్లు, జీవనవిధానం, కాలుష్యంవంటివన్నీ క్యాన్సర్‌ని తెస్తుంటాయి.

క్యాన్సర్‌ని ప్రారంభదశలో గుర్తించగల్గితే చికిత్స సులభం. అందుకే క్యాన్సర్‌మీద అవగాహన అవసరం. ఆ అవగాహన పెంచేందుకు అంతర్జాతీయ క్యాన్సర్ నియంత్రణ మండలి 2008లో క్యాన్సర్ డిక్లరేషన్‌ని ప్రకటించింది.

ఆ డిక్లరేషన్ ఆధారంగా ఫిబ్రవరి 4ని ప్రతి ఏటా ప్రపంచ క్యాన్సర్ దినోత్సవంగా జరుపుకుంటున్నారు. ప్రపంచ ప్రజల ఆరోగ్యం దృష్ట్యా క్యాన్సర్ గుర్తింపు, నివారణ, చికిత్స మార్గాల అవగాహన ప్రజలందరిలో పెరగాలి.

క్యాన్సర్ సమాచారం అందరికీ చేరాలి. తద్వారా 2020 నాటికి క్యాన్సర్ మరణాలను గణనీయంగా తగ్గించాల్సినది లక్ష్యం. క్యాన్సర్‌పై వున్న అపోహలు, జరుగుతున్న అసంబద్ధ ప్రచారాలను తొలగించటం కూడా లక్ష్యాలలో భాగమే.

క్యాన్సర్ వ్యాధికి గురైనవారిలో ధైర్యం నింపటం కోసం, క్యాన్సర్ వ్యాధి బారినపడి తగిన చికిత్సద్వారా బయటపడినవారిని ప్రచారంలో వాడుకుని ప్రజలలో వున్న భయాల్ని తొలగించే ప్రయత్నం చేస్తున్నారు.

ప్రపంచంలోని అన్ని ప్రాంతాల్లో క్యాన్సర్ పెరుగుతున్నప్పటికీ అన్ని దేశాలలో క్యాన్సర్ బాధిత భాగాలు శరీరంలో ఒకేలా లేవు. మనదేశంలో అధికంగా కనిపిస్తున్న క్యాన్సర్స్‌లో స్త్రీలలో గర్భాశయ ముఖద్వారం, పిత్తాశయం, నోరు, స్వరపేటిక సామాన్యమౌతున్నాయి. ఇటీవలి కాలంలో రొమ్ము క్యాన్సర్ స్త్రీలలో, ప్రోస్టేట్ గ్రంథి క్యాన్సర్ పురుషులలో కనిపిస్తోంది.

క్యాన్సర్ వ్యాధికి గురికాని శరీరభాగమంటూ ఏదీ లేదు. మెదడు, రక్తం, కాలేయం, మూత్రపిండం ఇలా కీలక భాగాలన్నింటిలో క్యాన్సర్ కనిపిస్తున్నది. విదేశాలతో పోల్చినపుడు భారతదేశం క్యాన్సర్ మరణాలు చిన్నవయసులో సంభవిస్తున్నాయి.

క్యాన్సర్‌వల్ల మరణించే భారతీయుల్లో 70 శాతం మంది 30-69 ఏళ్ళ మధ్యవయసువారుకాగా, అమెరికాలో సంభవించే క్యాన్సర్ కారక మరణాలలో 50 శాతంమంది 70 ఏళ్ళు పైబడినవారుకావటం గుర్తించాలి. 30 ఏళ్ళనుండి 60 ఏళ్ళ మధ్యకాలం మనిషి శరీరసామర్థ్యం అత్యున్నతస్థాయిలో వుంటుంది.

దేశ ఆర్థికాభివృద్ధిలో వారు కీలకపాత్ర వహిస్తుంటారు. అటువంటివారు క్యాన్సర్‌కి గురికావటంవల్ల వారి ఉత్పాదకశక్తి దాని ప్రభావం సమాజంమీద, తద్వారా దేశప్రగతిమీద పడుతున్నది.

మనదేశంలో పిల్లలలో పెరుగుతున్న క్యాన్సర్ ఆందోళన కలిగిస్తున్న అంశం. భారతదేశ క్యాన్సర్




రోగులలో 15 శాతంమంది పిల్లలు. ప్రపంచంలోని ఇతర దేశాలన్నింటిలో కలుపుకుంటే ఆ వయసు క్యాన్సర్ రోగులు అరశాతంమాత్రమే.

అవగాహనలేమివల్ల మనదేశంలో క్యాన్సర్ రోగులు ప్రాథమిక స్థాయిలో వైద్యుడిదగ్గరికి వెళ్ళడంలేదు. పూర్తిగా చేయిదాటిపోయి చికిత్సకు లొంగని దశలో ఎనభైశాతంమంది క్యాన్సర్ రోగులు ఆసుపత్రికి వస్తున్నారు. అందుకే ఆసుపత్రిలో చికిత్స మొదలు పెట్టిన సంవత్సరంలోపే డెబ్బైశాతంమంది మరణిస్తున్నారు. భారతీయుల అలవాట్లు చాలారకాల క్యాన్సర్‌లకు కారణమవుతోంది.

పొగాకు వాడకం అతిపెద్ద కారణం. పొగ త్రాగే అలవాటు వల్ల ఊపిరితిత్తుల క్యాన్సర్ వస్తోంది.

పొగాకు నమలటంవల్ల నోటి క్యాన్సర్ తెచ్చుకుంటున్నారు. నాలుక, స్వరపేటికలను తొలిగించాల్సిన పరిస్థితి వస్తోంది. అటువంటి రోగులను, వారి కష్టాలను విరివిగా వివిధ మీడియాల ద్వారా ప్రచారం చేస్తున్నది మన ప్రభుత్వం. అయినా పొగాకు వాడకం దేశంలో తగ్గటంలేదు. అది విచారకరం. ఆరోగ్యమే మహాభాగ్యం. ఆరోగ్యంగా జీవించటం ఒక అదృష్టం.

తీవ్ర బాధను తెచ్చే క్యాన్సర్‌బారినపడి ఆ తర్వాత ఆసుపత్రిపాలవటంకన్నా ముందుగానే గుర్తించి, ప్రారంభదశలోనే చికిత్సచేయించుకోవటం మంచిది. శరీరంలో వస్తున్న మార్పులను గుర్తించండి

విడవని తలనొప్పులు, ఊపిరి సరిగా అందక ఇబ్బందిపడటం, ఎడతెగని దగ్గు, ఆకలి మందగింపు, మింగటంలో ఇబ్బందివంటివి క్యాన్సర్‌కి ముందస్తు లక్షణాలు అవవచ్చు. శరీరంమీద నల్లని కాయలవంటివి పెరగటం, మూత్రంలో, కళ్ళెంలో రక్తం, హఠాత్తుగా బరువు తగ్గటం, అలసట, మలవిసర్జనలో మార్పులువంటి లక్షణాలు కనిపిస్తే ఒకసారి వైద్యపరీక్షకు వెళ్ళటం మంచిది.

ఒకదశ తర్వాత క్యాన్సర్‌ని ఆపలేమన్నది వైద్యుల మాట. శరీరంలోని కణజాలాలు ఏ కారణంచేతనో అదుపుతప్పి అది వేగంగా విభజనచెందటం క్యాన్సర్ లక్షణం. ఆ కణాల పెరుగుదల కణితుల రూపంలోకి మారి, ఆ కణితుల నాడులు, రక్తనాళాల మీద ప్రభావం చూపి, చివరికి శరీరంలోని ప్రతి భాగానికి పాకేలా చేస్తాయి.

ఒక ప్రాంతానికి పరిమితమైనపుడు చికిత్సను చెయ్యటం సులభం. ఇక ఆపైన చేసే చికిత్స దైవాధీనమే. స్త్రీలలో స్తనాలను పరిశీలించుకోవటం నలభై ఏళ్ళు పైబడినతరువాత తప్పనిసరి. స్తనాల క్యాన్సర్ వంశపారంపర్యమన్న సందేహం ఉంది.

కుటుంబపెద్దలకు ఆ క్యాన్సర్ ఉండివుంటే వారి వారసులు మరింత జాగ్రత్తగా వుండాలి. ఆహారపు అలవాట్లు కొంతమేర క్యాన్సర్ తెస్తున్నాయి.

భారీకాయంవల్ల దాదాపు పదిహేనుశాతంమంది క్యాన్సర్‌బారిన పడుతున్నారు. వీరిలో స్త్రీలు అధికం. పాన్‌మసాలా, సిగరెట్, లైంగిక రోగాలు పురుషులలో క్యాన్సర్ తెస్తున్నది.

లోపించిన వ్యక్తిగత పరిశుభ్రత ఒక కారణమే. అయితే ప్రతి నాలుగు కేసుల్లో ఒక కేసులో క్యాన్సర్‌కి అసలు కారణం ఏమిటో తెలియదు.

మిగిలిన మూడు కేసులలో క్యాన్సర్‌కి కారణం తెలుసు, అది నివారించదగినది కూడా.

భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో వున్నక్యాన్సర్ కేసుల గురించిన వివరాలను ప్రభుత్వం ప్రకటించింది. మన ప్రాంతాలలో క్యాన్సర్‌కి అధికంగా వాడే ఉప్పు, మసాలా దినుసులు ఉదర క్యాన్సర్ తెస్తున్నాయి.

ప్రతి ప్రాంతంలోని క్యాన్సర్ కారక అంశాలు అర్థమయ్యాయికాబట్టి ఇక క్యాన్సర్‌బారిన పడకుండా చూసుకోవటం, ప్రాథమిక దశలోనే చికిత్సకి వెళ్ళటం ప్రజల బాధ్యత.

# అసమానతలే అసలు సవాలు

ప్రధానమంత్రి నరేంద్రమోడీ దావోస్ ప్రపంచ ఆర్థిక వేదికకు వెళ్ళేముందు ఒక జాతీయ ఛానల్‌కి ప్రత్యేక ఇంటర్వ్యూ ఇచ్చాడు.

గడచిన రెండు దశాబ్దాల కాలంలో ఒక భారతీయ ప్రధాని దావోస్ వెళ్ళి ప్రపంచంలోని అత్యంత కీలక వేదిక అయిన వరల్డ్ ఎకనామిక్ ఫోరమ్‌లో మాట్లాడటం జరగలేదు. అటువంటి ఆహ్వానం కూడా భారత ప్రధానులకు అందలేదు. కాబట్టి నరేంద్రమోడీ ఒకింత గర్వంతో తన ఘనవిజయాలను వివరించేందుకు ఆ ఇంటర్వ్యూలో ప్రయత్నించాడు.

తాను ప్రధానిగా సాధించిన ఘనవిజయాలుగా మోడీ ఆర్థిక విజయాలనే ప్రస్తావించాడు. 2013-14 ఆర్థిక సంవత్సర సమయంలో ప్రపంచ సంస్థలు భారత్‌ని 'ఫ్రెజైల్ ఫైవ్' జాబితాలో చేర్చిన విషయం గుర్తుచేశాడు. ఎప్పుడు కుప్పకూలుతుందో తెలియని ఆర్థికవ్యవస్థను 'ఫ్రెజైల్' వ్యవస్థ అంటారు.

ఆ స్థితినుండి భారత్ కోలుకునే అవకాశం లేదని ప్రపంచ ఆర్థిక సంస్థలు అంచనా వేస్తున్న సమయంలో తాను అధికారంచేపట్టిన విషయం మోడీ గుర్తుచేశాడు. తన ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాలు, అమలుపరిచిన విధానాలవలన భారతదేశానికి ప్రత్యేక గుర్తింపు వచ్చిందని మోడీ గర్వంగా చెప్పుకుంటున్నాడు.

బలహీన ఆర్థిక వ్యవస్థ అనే ముద్ర చెరిపివేశాడు. ప్రపంచ దేశాలలో అతివేగంగా అభివృద్ధిచెందుతున్న ఆర్థికవ్యవస్థగా గుర్తింపు తీసుకువచ్చారు. ప్రజలలో ఆశాభావం, ఆత్మవిశ్వాసం పెంచగలిగారు. విదేశాలలో ప్రత్యేక గుర్తింపు తీసుకురాగలిగారు.

ప్రధానిగా తాను సాధించిన విజయాలలో విదేశీ మారకపు నిల్వలను పెంచటం, ద్రవ్యోల్బణం తగ్గించటం, విదేశీ పెట్టుబడులను ఆకర్షించటం వంటి వాటిని చెపుతున్నారు. అదేవిధంగా సులభతర వ్యాపార అంశంలో భారత్ ర్యాంకింగ్‌ని మెరుగుపరిచిన విషయం మరచిపోవద్దన్నారు.

వృద్ధిరేటును గత మూడేళ్ళలో పరుగులుపెట్టించామని చెప్పారు. పెద్దనోట్ల రద్దు, జిఎస్‌టి అమలువంటి నిర్ణయాలవలన తగిలిన ఎదురుదెబ్బలు, మందగించిన ప్రగతి, కుంటుపడిన వృద్ధిరేటువంటివన్నీ తాత్కాలిక ఇబ్బందులేనని గణాంకాలతో సహా వివరించాడు. తాను అధికారంలోకి వచ్చే సమయానికి ఉన్న 10 శాతం ద్రవ్యోల్బణాన్ని 3 శాతానికి తగ్గించారు.

30 బిలియన్ డాలర్ల విదేశీ పెట్టుబడులను 62 బిలియన్లకు పెంచారు.

ఫిస్కల్ లోటును, కరెంట్ ఎకౌంట్ లోటును కూడా అదుపులో ఉంచగలిగారు. కొత్తగా తెరవబడిన 70 లక్షల ప్రావిడెంట్ ఫండ్ ఎకౌంట్స్ ఖాతాలనుబట్టే ఉద్యోగాలు వచ్చాయని స్పష్టమవుతుందని వాదించారు.

125 కోట్ల భారతీయులు కోరుకుంటున్న ఒక కొత్త వాతావరణాన్ని సృష్టించేందుకు తన ప్రభుత్వం కృషి చేస్తున్నదని తన ఇంటర్వ్యూలో అన్నాడు.

అందరికీ అన్ని అవకాశాలు అనే నినాదాన్ని అమలు చేసిన తీరును, భారతదేశపు విజయగాథను ప్రపంచ దేశాలకు వివరించేందుకు దావోస్ వెళుతున్నానని ప్రధాని నరేంద్రమోడీ గర్వంగా చెప్పుకున్నాడు.

భారత్ ఆర్థిక ప్రగతిని ప్రపంచ దేశాలు దావోస్ సాక్షిగా అర్థంచేసుకుని, ఇక్కడ లభించే అవకాశాల్ని అందిపుచ్చుకునేందుకు రావాలన్నది మోడీ ఆకాంక్ష. దానికి జోడుగా ఇటీవలి కాలంలో భారతదేశపు ఆర్థిక ప్రగతిగురించి వరల్డ్ బ్యాంక్, ఐ.ఎమ్.ఎఫ్. వంటి అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు అందించిన నివేదికలను నరేంద్రమోడీ వెంటతీసుకువెళ్ళాడు.

భారతదేశం ఎదుగుదలకు ఢోకా లేదని ఆ సంస్థలు చెప్పాయి. స్వదేశంలో వేసుకుంటున్న అంచనాలకన్నా భారతదేశపు వృద్ధిరేటు మెరుగ్గా ఉందని ఆ సంస్థలు అన్నాయి.

ఇదే పద్ధతిలో భారతదేశ ఆర్థిక ప్రగతి కొనసాగితే మరో మూడేళ్ళలో ప్రపంచ దేశాలలో భారత్ ఐదవ ఆర్థికశక్తిగా నిలబడుతుందని, ఆపైన మరో అయిదేళ్ళలో 3వ స్థానంలో నిలబడుతుందని ఆ సంస్థలు పేర్కొన్నాయి. పెట్టుబడులకు చైనాకన్నా భారత్ మెరుగ్గా ఉన్నదని విదేశీ నాయకులు ప్రశంసలు అందించారు.

మన దేశానికి వస్తున్న విదేశీ నాయకులు కూడా మోడీ నాయకత్వాన్ని తెగ పొగుడుతున్నారు. కొత్త ఆలోచనలు కలిగిన నాయకత్వం, చిత్తశుద్ధి కలిగిన నేత, అవినీతికి అతీతమయిన పాలన అందిస్తున్నారంటూ ఆ నేతలు అందిస్తున్న ప్రశంసలతో నరేంద్రమోడీ ఉబ్బిపోవటం సహజమే.

జి.ఎస్.టి. అమలును అన్ని వర్గాలు, అన్ని దేశాలు మెచ్చుకోవటం భారత్‌ని ఒక కొత్త శక్తిగా విదేశీయులు చూడటం జరుగుతున్న సమయంలో నరేంద్రమోడీ దావోస్‌లో విమానం దిగాడు.

కాని నరేంద్రమోడీ ఉత్సాహంమీద నీళ్ళుచల్లే నివేదికలు సరిగా అదేరోజున వరల్డ్ ఎకనామిక్ ఫోరం వేదికమీదిగా విడుదలయ్యాయి. నరేంద్రమోడీ అమలుచేస్తున్న అభివృద్ధి నమూనాలో ఉన్న లోసుగులను ఎత్తిచూపుతున్న నివేదికలు అవి.

నాటివరకు అత్యంత ఉత్సాహంగా సాగిన భారత దేశ ప్రచారం ఒక్కసారిగా మారిపోయింది. భారతదేశం ఎదుర్కొంటున్న అసమానతలమీద చర్చమొదలైంది. దీనిని తట్టుకుని భారతదేశ ప్రగతిని ప్రపంచ దేశాలకు వివరించాల్సిన పరిస్థితి నరేంద్రమోడీది.

అసాధారణంగా లభించిన అవకాశం దావోస్‌లోని పెట్టుబడిదారులందరిముందు ప్రసంగించటం. ప్రభుత్వాధినేత చెప్పే అంశాలకన్నా అంతర్జాతీయ సంస్థల నివేదికలమీదే ఆ పెట్టుబడిదారులు విశ్వాసం ఉంచుతారు.

భారతదేశం వేగంగా అభివృద్ధిచెందుతున్న దేశమనేదానిలో భిన్నాభిప్రాయాలు ఎవరికీ లేవు.

అతి వేగంగా ఎదుగుతున్న, మరింత వేగంగా ఎదిగే అవకాశం వున్న ఆర్థికవ్యవస్థ భారత్‌ది అని వారు అంగీకరిస్తున్నారు. ఆ ఎదుగుదల 10 శాతం వరకు చేరినా ఆశ్చర్యపోనక్కరలేదని అంటున్నాయి అంతర్జాతీయ సంస్థలు.

అదే సమయంలో ఆ అభివృద్ధి ఫలాలు దేశంలోని అన్ని వర్గాలకు సరిగా అందటంలేదన్న వాస్తవం ఆ నివేదికలు బయటపెట్టాయి. సమ్మిళిత అభివృద్ధి అంశంలో భారత్ బాగా వెనకపడింది. అభివృద్ధిచెందుతున్న ఆర్థిక వ్యవస్థ దేశాల జాబితాలో భారత్ 62వ స్థానంలో ఉంది.

గత సంవత్సరం 60వ స్థానంలో ఉండగా ఈ సంవత్సరం రెండు ర్యాంక్‌లు



ఇప్పటిదాకా క్రికెట్ బోర్డ్‌లో అవినీతి, బంధుప్రీతి వుండగా వారికిప్పుడు సూపర్‌స్టార్ సిండ్రోమ్ వ్యాపించింది.

-రామచంద్ర గుహ, చరిత్రకారుడు

కిందికి దిగజారింది. సమ్మిళిత అభివృద్ధిసూచికలో మన ఇరుగుపొరుగు దేశాలన్నీ మెరుగయిన ర్యాంకులను సంపాదించుకున్నాయి.

చైనా 26వ ర్యాంక్‌తో ఎంతో ఎత్తున ఉంది. మన చుట్టూ ఉన్న దేశాలను, మనకన్నా తక్కువ దేశాలుగా భావించే దేశాలన్నీ సమ్మిళిత అభివృద్ధి సూచికలో భారత్‌కన్నా బాగున్నాయి.

హిమాలయ పర్వతాలలో ఉన్న చిన్న దేశమైన నేపాల్ 22వ ర్యాంక్‌లో ఉండగా బంగ్లాదేశ్ 34, శ్రీలంక 40,పాకిస్తాన్ 47వ ర్యాంకుల్లో ఉన్నాయి.

అభివృద్ధి రేటులో ఆ యా దేశాలు మనకన్నా వెనకపడివుండవచ్చుగాని, అభివృద్ధి ఫలాలు సమాజంలోని అన్ని వర్గాలవారికీ అందించటంలో భారత్ కన్నా మెరుగ్గా ఉన్నాయి.

వివిధ దేశాలలో ఉన్న జీవన ప్రమాణాలు, పర్యావరణ సుస్థిరత, భవిష్యత్తరాలపై రుణభారం మోపుదలవంటి అంశాలను పరిగణనలోకి తీసుకుని సమ్మిళిత అభివృద్ధి సూచికను తయారుచేశారు. ఆర్థికపరమైన ఎదుగుదల, అభివృద్ధి, సామాజిక వర్గాలకు పంపిణీవంటి అంశాలను కూడా పరిగణించి దేశాలన్నింటికీ ర్యాంక్‌లిచ్చారు.

అభివృద్ధి చెందిన దేశాలలో నార్వే నెంబర్ ఒన్ స్థానంలో ఉండగా, అభివృద్ధి చెందుతున్న దేశాలలో లిథుయేనియా నంబర్ ఒన్ స్థానంలో ఉంది.

ఇదివరలో దేశ అభివృద్ధికి జి.డి.పి.ని మాత్రమే పరిగణనలోకి తీసుకుని లెక్కలు కట్టటంవల్ల పొరపాట్లు జరిగాయని వరల్డ్ ఎకనామిక్ ఫోరమ్‌అభిప్రాయపడింది. కాబట్టి ఆ నమూనా ప్రకారం దేశం అభివృద్ధిచెందుతున్నట్టు కనిపించినా ఆయా దేశాల ప్రజలు ఆర్థికంగా వెనకబడేవుండటాన్ని గుర్తించారు.

కాబట్టి అభివృద్ధి, సమ్మిళిత ఎదుగుదల అంశాల్ని కలగలిపి దేశాలను అంచనావేయాల్సిన అవసరం ఉందనే నిర్ణయానికొచ్చారు. అయితే అసమానతలు లేని దేశాలు ప్రపంచంలో బహుతక్కువ.

అన్ని దేశాలలో ఏదో ఒక రకమైన అసమానతలు ఉన్నాయి. వరల్డ్ ఎకనామిక్ ఫోరమ్ 2016లోనే ఆదాయ వ్యత్యాసాలు తీవ్రంగా ఉన్న విషయం గుర్తించింది. ప్రపంచవ్యాప్తంగా అన్ని దేశాలలో కనిపిస్తున్న ఈ అసమానతలు వచ్చే దశాబ్దంలో మరిన్ని ప్రమాదాలకు దారితీస్తుందని హెచ్చరించారు.

ఆర్థిక అసమానతలకు, ఆరోగ్య, సామాజిక అంశాలకు, ప్రపంచంలో పెరుగుతున్న నేరాలకు సంబంధముందని 2016 నివేదికలో పేర్కొన్నారు. ఆర్థిక అసమానతలు కొనసాగితే దాని ప్రభావం ప్రపంచం మొత్తంమీద పడుతుందని, ప్రతి ఒక్కరూ దానికి బలికాక తప్పదని నాడు హెచ్చరించారు.

అసమానతల తొలగింపుకు తగిన చర్యలు తీసుకోవాలని అన్ని దేశాలను కోరారు. ఆ హెచ్చరిక చేసి సంవత్సరమైంది. ఈ సంవత్సర కాలంలో భారతదేశంలో ఆర్థిక అసమానతలు తగ్గకపోగా మరింత పెరిగాయని తాజా నివేదిక తెలియచేస్తున్నది.

ఆర్థిక అసమానతలు భారతదేశంలో హఠాత్తుగా రాలేదు. ఆర్థిక సంస్కరణల అమలుజోరు అందుకున్నప్పటినుండి ఇదే తంతు.ఎవరైతే అవకాశాలను అందిపుచ్చుకోగల్గుతున్నారో వారు ఎదుగుతున్నారు. 2000 సంవత్సరంలో క్రెడిట్ సూయిస్‌వారు ప్రచురించిన నివేదిక ప్రకారం భారతదేశ సంపదలో 36.8 శాతం. ఒక శాతం కుబేరుల చేతిలో ఉంది.

ఆ కుబేరులలో టాప్ 10మందికలిసి 65.9 శాతం సంపదను తమ గుప్పిట్లో పెట్టుకున్నారు. నాటినుండి అది క్రమంగా పెరుగుతూవచ్చింది.

అంతర్జాతీయ హక్కుల సంస్థ 'ఆక్స్‌ఫామ్' 2017 వివరాలతో విడుదల చేసిన నివేదికలో పేదా, గొప్ప అంతరం భారత్‌లో భారీగా పెరిగిందని పేర్కొన్నది. భారతీయులలో సంపన్నులు మరింత సంపన్నులు అవుతున్నారు. పేదలు నిరుపేదలు అవుతున్నారని ఆ నివేదిక పేర్కొన్నది.

- అభివృద్ధిఫలాలు అందని ప్రజలు
- ఆర్థిక, సామాజిక, లింగ అసమానతలున్నాయి
- అభివృద్ధికి ఆటంకంగా అవినీతి
- కోటీశ్వరులు, నిరుపేదలు పెరుగుతున్నారు

భారతదేశంలో 2017లో సృష్టించిన సంపదలో ఏకంగా 73 శాతం కేవలం ఒక శాతమున్న కుబేరులకు దక్కింది. ఒక సంవత్సరం క్రితం దేశసంపదలో వారు 58 శాతం సొంతం చేసుకున్నారు.

ప్రభుత్వం ఎటువంటి చర్యలూ తీసుకోకపోగా వాటి విధానాలద్వారా సంపన్నులను మరింత సంపన్నులుగా చేసిందని అర్థమవుతుంది.

దేశంలోని కుబేరులందరి సంపద 20.9 లక్షల కోట్లరూపాయలమేర పెరిగింది. అది దేశ బడ్జెట్ సమానం కావటం గమనార్హం. ఒక ఏడాదిలో 17 మంది కుబేరులు కొత్తగా భారతదేశ కుబేరుల జాబితాలో చేరారు. అయితే ఈ కుబేరులలో 37 శాతంమంది వంశపారంపర్య కుబేరులు.

మనదేశంలోని వ్యాపార సంస్థలకు వారసులు. అదే సంవత్సరంలో భారతదేశంలోని 67 కోట్లజనాభా సంపద కేవలం ఒక్క శాతమే పెరిగింది.

పై స్థాయి వ్యక్తుల ఆదాయాలు, లాభాలు భారీగా పెరుగుతుండగా కిందిస్థాయివారికి అవకాశాలు, ఆదాయం రెండూ కుంచించుకపోతున్నాయి.

'రివార్డ్ వర్క్ అండ్ నాట్ వెల్త్' అనే పేరుతో ఆక్స్‌ఫామ్ తయారుచేసిన ఈ నివేదికలో అసమానతలు ప్రపంచవ్యాప్తంగా ఉన్న వైనం వెల్లడించింది.

గత సంవత్సరం ప్రపంచవ్యాప్తంగా జరిగిన సంపద సృష్టిలో 82 శాతం సంపద కేవలం 1 శాతం జనాభా చేతుల్లోకి వెళ్ళింది. ప్రపంచంలోని మరో 370 కోట్లమంది జనాభా సంపదలో ఎటువంటి మార్పూ రాలేదు. అంటే సంపదను సృష్టించటంలో దేశప్రజలందరి భాగస్వామ్యం ఉన్నప్పటికీ, ఆ సృష్టించిన సంపదను పెద్దలు తన్నుకుపోతున్నారు.

భిన్న అసమానతలవల్ల భారతదేశ సమస్య మరింత జటిలంగా మారుతున్నది. భారతదేశంలో తలెత్తుతున్న పలురకాల ఘర్షణలకు మూలం ఈ అసమానతలు. పౌరులందరూ ఒక్కటేనని, అందరికీ అన్ని అవకాశాలు సమానంగా అందించాలన్న ప్రాథమిక సూత్రాన్ని ప్రభుత్వాలు మరిచాయి.

అసమానతల తొలగింపుకు విధానపరమయిన చర్యలు చేపట్టాలి. ఉన్నత వర్గాలకు మేలు చేస్తున్న విధానాలను సమీక్షించి మార్పులు తీసుకురావాలి. చట్టం ముందు అన్ని వర్గాలవారూ సమానమన్న విశ్వాసం సమాజంలో కలిగించగలగాలి.

అసమానతల తొలగింపులో భాగంగా సంపన్నులపై పన్నుభారం మోపాల్సివుంటుంది. సంపన్న వర్గాలకు రాయితీలు మినహాయించాలి. ఆ యా వర్గాల నుండి పన్నువసూళ్ళు సక్రమంగా జరగాలి. ఆ వర్గాల ఆర్థిక నేరాలపై ఉక్కుపాదం మోపాలి. మరోవైపు సంక్షేమ పథకాలకు నిధుల కేటాయింపులు పెంచాలి.

ప్రజా, సంక్షేమ రంగాలలో పెట్టుబడులు భారీగా పెట్టిన దేశాలలో అసమానతలు తొలగిపోయాయి. ప్రాథమికంగా విద్య, ఆరోగ్య, సామాజిక రక్షణ రంగాలలో పెట్టుబడులు పెరగాలి. కాని భారతదేశంలో విద్యారంగంమీద జి.డి.పి.లో 3 శాతంమాత్రమే ఖర్చుచేస్తున్నారు.

ఆరోగ్య రంగానికి 1.1 శాతంమాత్రమే కేటాయిస్తున్నారు. దక్షిణాఫ్రికా విద్యమీద జిడిపిలో 6.1 శాతం, ఆరోగ్యంమీద 3.7 శాతం ఖర్చుచేస్తున్నది.

అసమానతల విషయంలో నేటికీ దక్షిణాఫ్రికా భారత్‌కన్నా వెనకపడేవుండవచ్చు. కాని ఆ అసమానతలను తొలగించాలన్న చిత్తశుద్ధి దక్షిణాఫ్రికా ప్రభుత్వ కేటాయింపులవల్ల స్పష్టమవుతోంది.

భారతదేశంలో నేటికి 9 కోట్లమంది నిరుపేదలున్నారంటే కారణం ప్రభుత్వ నిర్లక్ష్య విధానాలే. 2030 నాటికి శతాబ్ది సుస్థిరాభివృద్ధి లక్ష్యాలను అందుకోవాలి. అందుకు తగిన నిధుల కేటాయింపులు, ఇతర చర్యలు చేపట్టాలి.

మిగిలిన దేశాలకు లేని అధికార యంత్రాంగ అవినీతి మనదేశంలో ఉంది. అభివృద్ధిని అడ్డుకోవటంలో, అసమానతలను పెంచటంలో అధికార యంత్రాంగ అవినీతి పాత్ర తిరుగులేనిది.

ఆర్థిక సంస్కరణలు, పాలనాపరమైన సంస్కరణలు, విధాన రూపకల్పనలో భాగంగా అధికార యంత్రాంగ అవినీతి నిర్మూలనమీద దృష్టిపెట్టటం అవసరం. అది లేనప్పుడు మనదేశం ప్రకటించుకునే అభివృద్ధి మేడిపండులామాత్రమే ఉంటుంది.

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

# అంతా రాజకీయమే



## ఉత్తుత్తి ఆసుపత్రి

ఒక సినిమాలో డబ్బున్న వ్యక్తిని మోసంచేసేందుకు హీరో అతని మిత్రబృందం ఉత్తుత్తి బ్యాంక్, అని ఒకటి అప్పటికప్పుడు సెట్టింగ్‌వేసి సిబ్బందిని పెడతారు.చూసేందుకు అది వినోదంగానే వుంటుంది.

మరి అదే వినోదం స్వయంగా రాష్ట్ర సి.ఎమ్‌గారు కలిగిస్తే ప్రజలు ఏమనుకోవాలి!

తెలంగాణ సి.ఎమ్. కె.సి.ఆర్.నగరం పొలిమేరల్లోని తుప్రాన్‌లో 50 పడకల ఆసుపత్రికి ఘనంగా ప్రారంభోత్సవం చేశారు. అప్పటికే అక్కడి ఇద్దరు వైద్యులు పనిచేస్తున్నారు.

కాని సి.ఎమ్‌గారి ఘనతకోసం మరో నలుగురు వైద్యులను ఆ ఆసుపత్రికి డెప్యుటేషన్ మీద పంపించారు. మంత్రులు, ఎమ్.ఎల్.ఎలు పోటీపడి సి.ఎమ్‌ని పొగిడి ఆసుపత్రి అందుబాటులో వచ్చినందుకు అక్కడి ప్రజలంతా కృతజ్ఞతలు చూపాలని ప్రసంగాలు చేశారు. ఆ రోజుకు అంతా బ్రహ్మాండమే.

కాని మరుసటి రోజు ఆసుపత్రికి వచ్చిన రోగులకు ఒక్క వైద్యుడు అక్కడ కనిపిస్తే ఒట్టు.

అసలు వైద్యులు రెండుగంటలుండి వెళ్ళిపోతే, డెప్యుటేషన్ వైద్యులు సెలవుపెట్టారు. ఫలితం ప్రజలకు మిగిలింది ఘనమైన ఉత్తుత్తి ఆసుపత్రి. ◆

## గుర్తుకొస్తున్నాయి

కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షుడు రాహుల్‌గాంధీకి నాలుగేళ్ళ తర్వాత ఆంధ్రప్రదేశ్ అంటూ ఒకటి వుందని, గుర్తుకురావటం ఒక విశేషం. ఆయన దానిని బహిరంగంగా చెప్పలేదు.తన అనుయాయులకు ఒకలేఖ రాశాడట. దానిని పట్టుకుని స్థానికంగా వున్న కాంగ్రెస్ నేతలు 'మా నేత రాశాడు చూడండి'అంటున్నారు.

పోలవరంమీద కాంగ్రెస్ చేస్తున్న ఉద్యమాన్ని మెచ్చుకుంటూ రాజకీయంగా రాసిన ఉత్తరమే కాని వాస్తవంలో ఆంధ్రుల ప్రయోజనాలమీద ఆలోచన వుండి రాసినది కాదు ఆ ఉత్తరం.

ఆంధ్రులమీద అంత ప్రేమ వుంటే కాంగ్రెస్‌పార్టీ అడ్డగోలు విభజన చట్టం తెచ్చేది కాదు.

ఆంధ్రులు ఏమైపోతేనేం మా పార్టీకి తెలంగాణలో ఎమ్.పి. సీట్లు వస్తే చాలు అనుకుని తయారుచేసినది విభజన చట్టం. అందుకే ఏనాడూ కాంగ్రెస్ నేతలు విభజనవల్ల ఆంధ్ర దెబ్బతిన్నదన్నమాట అనలేదు.

ఆ ఒరవడే ఇప్పుడూ రాహుల్ ఉత్తరంలో కనిపిస్తుంది. తాము చేసిన అన్యాయపు చట్టం గురించి అడగవద్దు. విభజన తర్వాత అన్యాయంగురించే మాట్లాడతాం అని కాంగ్రెస్‌వారు అంటే వినటానికి ఆంధ్రులు అమాయకులా! ◆

## ఆప్‌కి షాక్

'నీతి నిజాయితీకి కేరాఫ్ అడ్రస్ మేమే... అవినీతి రాజకీయాన్ని సమూలంగా నిర్మూలిస్తాం' అంటూ రాజకీయ రంగంలోకి వచ్చింది ఆమ్ ఆద్మీ పార్టీ. నమ్మి భారీ మెజారిటీ కట్టబెట్టారు ఢిల్లీ ఓటర్లు.

70 సీట్లలో 67 సీట్లు గెలవటం అంటే ఆషామాషీ కాదు. కాని అధికారం చేపట్టినప్పటినుండి ఆమ్ ఆద్మీ పార్టీ పద్ధతే మారిపోయింది. మిగిలిన రాజకీయ పార్టీలలాగానే తయారైంది.అంతర్గత విభేదాలలో చీలికలు, అసమ్మతివర్గం బహిష్కరణలు సాగాయి.

ఇక లాభం లేదని అసమ్మతి స్వరం నిలిపేందుకు ఒక్క ఉత్తర్వుతో 20మంది ఎమ్.ఎల్.ఎలను పార్లమెంటరీ సెక్రటరీలుగా నియమించారు. దీనిని రాజకీయ ప్రత్యర్థులు సవాలు చేశారు.

జోడు పదవులు అనర్హతకు దారితీస్తాయంటుంది చట్టం. ఆ విషయం గుర్తుచేస్తే హడావుడిగా ఢిల్లీ అసెంబ్లీలో సదరు ఎమ్మెల్యేలను రక్షించే చట్టం తెచ్చాడు కేజ్రీవాల్. ఆ చట్టాన్ని కోర్టు కొట్టేసింది.

ఇప్పుడు ఆ 20 మంది ఎమ్మెల్యేలు అనర్హులు అన్నది ఎన్నికల సంఘం. అవును నిజమే అని వారి పదవులు రద్దుచేశాడు రాష్ట్రపతి.

ఇంకా న్యాయపోరాటం చేస్తానని ఆప్ అంటున్నా ఈ షాక్‌కి దిమ్మతిరిగింది కేజ్రీవాల్‌కి. మళ్ళీ ఎన్నికలంటే కష్టాలు మొదలవుతాయి ఆమ్ ఆద్మీకి. ◆

## ఈశాన్య పాగా

దేశమంతా మాదే అనిపించుకోవాలన్నది బి.జె.పి. తపన.అయితే ఇటు దక్షిణాది, అటు ఈశాన్య భారతాలు బి.జె.పికి కొరుకుడుపడని ప్రాంతాలు. వాటిలో కూడా గెలిస్తే తప్పించి కాంగ్రెస్ ముక్త్‌భారత్ నినాదం సాకారం కాదు.ఐతే ఆ రెండు ప్రాంతాలలోకీ ప్రవేశం అనుకున్నంత సులభం కాదు.ఈశాన్య భారత ముఖద్వారం అస్సాం గెలిచాం కాబట్టి ఇక పరుగులు పెట్టటమే లోపలికి అనే భ్రమ బి.జె.పిలో వుంది.

కర్ణాటక గెలిచినప్పుడు దక్షిణాది గురించి అలానే మాట్లాడారు. కాని చివరికి ఐదేళ్ళ పాలనతో కర్ణాటకలో ఓడిపోయారు. కార్యకర్తల బలమున్న కర్ణాటకలోనే పరిస్థితి అలా వుంటే ఎటువంటి బలంలేని ఈశాన్యంలో పాగా వేయటం అంత సులభం కాదు.

అందుకే అక్కడ ప్రాంతీయ పార్టీలను మిత్రపక్షాలుగా దగ్గరకు తీసుకుని ఆ యా రాష్ట్రాలలో పాగా వెయ్యాలనుకుంటున్నాయి. వాటిలో మేఘాలయ, మిజోరామ్ వంటివి లొంగవచ్చేమోగాని త్రిపురను మింగటం కొంచెం కష్టమే. ఈశాన్యరాష్ట్రాల ప్రాంతీయ పార్టీలు కేంద్రంలో అధికారంలో ఎవరు వుంటే వారి వెంట నడుస్తాయి. కాబట్టి అక్కడి గెలుపు తాత్కాలికమే అవుతుంది బి.జె.పికి. ◆

## మధ్య సయోధ్య

త్వరలో రాబోయే ఎన్నికలున్న రాష్ట్రాల జాబితాలో మధ్యప్రదేశ్ వుంది. గత 5 సంవత్సరాలుగా అక్కడ అధికారం బి.జె.పిదే. అయితేనేం అక్కడ కాంగ్రెస్ బలంగానే వుంది.కాని ఆ రాష్ట్రంలో కాంగ్రెస్ అసలు సమస్య నాయకుల మధ్య అనైక్యత. నలుగురు నాయకులు కాంగ్రెస్ అధిష్ఠానంతో నాలుగు స్తంభాల ఆట ఆడుతూ పార్టీని ఓడిస్తున్నారు.

ఇక నాలుగోసారి కూడా ఓడిపోతే మీరు వుండరు, మీ స్తంభాలు వుండవు జాగ్రత్త అని అధిష్ఠానం తీవ్రంగా హెచ్చరించింది.దీనితో నలుగురు నాయకులు ఇంకా చేతులు కలపకపోయినా కనీసం ఇద్దరు నాయకులు సయోధ్య చర్చలు జరిపారు.

వారిలో ఒకరు జోతిరాదిత్య సింధియా, రెండవవారు కమలనాథ్. కమలనాథ్ రాజీవ్‌గాంధీకి అప్పుడు. మారిన పరిస్థితుల్లో పార్టీలో విలువ తగ్గినవాడు.

కాబట్టి ఏదో ఒక రకంగా గ్రూప్ సర్దుబాటు మంచిదనుకున్నాడు. తమ సర్దుబాటు వ్యవహారం బహిరంగం చెయ్యటానికి హైకమాండ్ అనుమతి అడిగారట. బహుశా బడ్జెట్ తర్వాత ఆ ప్రకటన వుంటుంది. మిగిలిన రెండు వర్గాలని వీరితో కలిపే యత్నం చేస్తున్నారు. ఆ నాలుగు వర్గాలు కలిస్తే బి.జె.పి. గెలుపు అంత ఈజీ కాదు మధ్యప్రదేశ్‌లో. ◆

## తెగతెంపులు

ఎట్టకేలకు సి.పి.ఎమ్. తన రాజకీయాలకు ఒక స్పష్టతనిచ్చింది. కాంగ్రెస్‌పార్టీతో కలిసివెళ్ళటంలేదని తీర్మానం చెయ్యటంద్వారా మరో చారిత్రక నిర్ణయం తీసుకుంది. ఆ తీర్మానం ఏకగ్రీవం కాదు కాబట్టి మరో చారిత్రక తప్పిదం అనేవారు సి.పి.ఎమ్‌లో లేకపోలేదు. గత రెండేళ్ళుగా సి.పి.ఎమ్‌లో సాగుతున్న అంతర్యుద్ధంలో సీతారాం ఏచూరి ఓడిపోయి ప్రకాష్ కారత్ గెలిచాడు.

ఇది కేరళ సి.పి.ఎమ్‌కి, బెంగాల్ సి.పి.ఎమ్‌కి మధ్య జరిగిన పోటీ. ఆ రెండు రాష్ట్రాలలో కాంగ్రెస్‌వారికి ప్రత్యర్థి.ఆ రెండు రాష్ట్రాలకు ఆవల వారికి బలంలేదు. కాబట్టి కాంగ్రెస్‌తో కలిసి పోటీ అంటే ఆ రెండు రాష్ట్రాలలోకూడా మాయమవుతామన్న భయంతో ఆ బెట్టు ప్రదర్శించారు. చేసిన తీర్మానాలకు కట్టుబడి వుండటం సి.పి.ఎమ్‌కి అలవాటు కాదు.

కాబట్టి 2019 ఎన్నికల తర్వాత ఫలితాలు ఏ ఒక్క పార్టీకీ అనుకూలంగా రానప్పుడు తిరిగి కాంగ్రెస్‌వైపు మొగ్గుచూపటం ఖాయం. అయితే 2019 ఎన్నికలకు ముందు ప్రతిపక్ష పార్టీల మధ్య ఐక్యత లేకపోవటం బి.జె.పికి కలిసివచ్చే అంశం. పరోక్షంగా సి.పి.ఎమ్. తీర్మానం బి.జె.పికి లబ్ధి చేకూర్చేదే.

కొత్త శీర్షిక ప్రారంభం

సక్సెస్ స్టోరీ

# స్విస్ ఎమ్.పిగా భారతీయుడు

ప్రవాస భారతీయుల దినోత్సవం ప్రతిఏటా జనవరిలో జరుగుతుంది. గాంధీజీ భారత దేశానికి తిరిగివచ్చి దేశ స్వాతంత్ర్య పోరాటంలోకి దిగిన రోజుకు గుర్తుగా ఆ దినోత్సవం జరుపుతారు. ఈ సంవత్సరం జరిగిన ప్రవాస భారతీయ ఉత్సవంలో ఒక ప్రత్యేకత వుంది.

గడచిన రెండువందలసంవత్సరంలో భారతీయ సంతతివారు పలుదేశాలకువెళ్ళారు. అక్కడి ప్రజలతో కలిసిపోయారు. ఆ యా దేశాలలోని రాజకీయాలను ప్రభావితం చెయ్యగలిగారు.

పలు దేశాలలో మంత్రులు, ప్రధానులు కూడా అయ్యారు. అవన్నీ బ్రిటీష్‌వారి పాలనకు సంబంధమున్న దేశాలు. అటువంటి భారతీయ సంతతి పార్లమెంటేరియన్స్‌ని ప్రవాసి భారతీయ దివస్ నాడు ఢిల్లీకి ఆహ్వానించారు.

అలా తమ పాతగడ్డమీదికి కాలుపెట్టిన విదేశీ పార్లమెంట్ సభ్యులలో అందరి దృష్టినీ ఆకర్షించిన వాడు నిక్లాజ్ శామ్యూల్ గుగెర్.

సరిగ్గా మూడు నెలల క్రితం స్విస్ పార్లమెంట్‌కి జరిగిన ఎన్నికల్లో అతన్ని తమ ప్రతినిధిగా ఎన్నుకున్నారు. స్విట్జర్లాండ్‌వంటి దేశంలో ఒక భారతీయ సంతతి వ్యక్తిమీద స్థానికులు అంత విశ్వాసం ఉంచటం వెనక అతని కృషి వుంది.

ప్రాంతం, భాష పేరుతో విభేదించుకుని, నాయకులను వ్యతిరేకించే భారతీయులు స్విస్ ప్రజలు శామ్యూల్ సేవకు ఇచ్చిన గుర్తింపును గమనించాలి. నిక్లాజ్ శామ్యూల్ పుట్టింది నిరుపేద కుటుంబంలో. సరిగ్గా ఊహకూడా తెలియని వయసులో విదేశాలకు వెళ్ళాడు. తాను వెళ్ళటం కాదు, తీసుకుని పోబడ్డాడు.

నిక్లాజ్ శామ్యూల్ మే 1, 1970న కర్ణాటకలోని ఉడిపి పట్టణంలో వున్న సి.ఎస్.ఐ. లొంబార్డ్ మెమోరియల్ ఆసుపత్రిలో జన్మించాడు.

తల్లి అనసూయ హిందువు. అయితే తాను బిడ్డను సాకే పరిస్థితిలో లేదని, తాను ఆర్థికంగా ఇబ్బందుల్లో వున్నానని చెప్పి ఆమె తన బిడ్డను ఎవరికైనా దత్తతకు ఇమ్మని ఆ ఆసుపత్రి సూపరింటెండెంట్‌కి చెప్పిందట.

ఆయన అలా కొన్ని రోజులు తనదగ్గర ఆ బిడ్డను ఉంచుకున్నతర్వాత ఉడిపిలో వున్న స్విస్ దంపతులు ఫ్రిట్జ్, ఎలిజిబెత్‌లకు అందించాడు.

ఆ విధంగా స్విస్ జంటకు అధికారికంగా దత్తపుత్రుడు అయ్యాడు. అప్పటికి అతని వయసు 15 రోజులే. వారు పెట్టిన పేరే నిక్లాజ్ శామ్యూల్.



నిక్లాజ్ శామ్యూల్

ఉడిపి నుండి ఆ స్విస్ జంట కేరళకు మకాం మార్చింది. కేరళలోని తెలసెర్రీలో దత్తత తల్లి జర్మన్ భాష, ఇంగ్లీషు భాష బోధించే టీచర్‌గా పనిచేయగా, తండ్రి నట్బూరు టెక్నికల్ ట్రైనింగ్ ఫౌండేషన్‌లో టూల్ తయారీదారుడిగా పనిచేశాడు. వారి ఆర్థిక పరిస్థితి అంతంతమాత్రమే. అయినా నిక్లాజ్‌ని మరెవరికో అప్పగిద్దామన్న ఆలోచన వారికి రాలేదు.

అక్కడ నాలుగేళ్ళు పెరిగాడు నిక్లాజ్. ఆ తర్వాత స్విస్ జాతీయులైనవారు తమ స్వదేశానికి వెళ్ళేందుకు నిశ్చయించుకుని శామ్యూల్‌ని వెంటతీసుకువెళ్ళారు. నిక్లాజ్‌ని పెంచుకున్న స్విస్ దంపతులది ఆర్థికంగా మెరుగైన కుటుంబం కాదు.

ఆర్థిక పరిస్థితి సహకరించక కన్నతల్లి నిక్లాజ్‌ని వదులుకుంది. అతడు మెరుగైన సంపన్న కుటుంబానికి చేరాలని తల్లి అనసూయ కోరుకుంది. కాని నిక్లాజ్ తిరిగి మరో సాదాసీదా స్విస్ కుటుంబంలోకే చేరాడు. నిక్లాజ్‌ని సరిగా చదివించలేదు.

వారి ఆర్థికపరిస్థితిని, తన సొంత విషయాన్ని అర్థంచేసుకున్న నిక్లాజ్ తాను కష్టపడితే తప్పించి పైకి రాగలిగిన మార్గంలేదని అర్థంచేసుకున్నాడు.

నిక్లాజ్ తోటపనుల్లో కుదిరాడు.ఆ తర్వాత ఒక వయసులో ట్రక్కుడ్రైవర్ అయ్యాడు. సరుకులు రవాణా చేసే పనులు చేశాడు. అలా పనిచేస్తూనే చదువుకున్నాడు. తన చదువుకు అవసరమైన డబ్బును తానే సమకూర్చుకున్నాడు.

"తన పెంపుడు తల్లిదండ్రులు తనకు ఆర్థికంగా మద్దతు ఇవ్వలేకపోయివుండవచ్చు... కాని ప్రేమ సంపూర్ణంగా ఇచ్చారు. పలు ఇతర అంశాలలో తగినంత శిక్షణ ఇచ్చారు" అని నిక్లాజ్ గర్వంగా చెప్పుకున్నాడు. చదువు అయిపోయిన తర్వాత ఉపాధికోసం పలురకాల పనులుచేస్తున్నా, సామాజిక సేవలో నిమగ్నమయ్యాడు నిక్లాజ్.

నిక్లాజ్ నివాసముండేది స్విస్.జర్మన్‌దేశాల సరిహద్దు ప్రాంతంలోని వింటరాతుర్‌నగరం. స్విస్ రాజధాని జ్యూరిచ్‌కి ఈశాన్యంగా వుంటుంది.

ఆ నగరపాలక కౌన్సిలర్‌గా 2002లో ఎన్నికయ్యాడు. అలా ప్రజాజీవితంలోకి ప్రవేశించానంటాడు నిక్లాజ్.గత 15 సంవత్సరాలుగా స్థానికసంఘాలలో పనిచేస్తూ, తన సేవలతో ఒక గుర్తింపు తెచ్చుకున్న నిక్లాజ్ 2017 నవంబర్‌లో జరిగిన స్విస్ ఎన్నికల్లో 'ఇవాంజిలికల్ పీపుల్స్ పార్టీ' తరపున స్విస్ పార్లమెంట్‌కి ఎన్నికయ్యాడు.

ఆ విధంగా భారతీయ సంతతికి చెందిన తొలి ఎమ్.పిగా స్విస్‌లో చరిత్ర సృష్టించాడు. ఇటువంటి అవకాశం ఆ దేశంలో మరెవరికైనా దక్కే అవకాశం లేదంటాడు నిక్లాజ్. స్విస్‌కి వచ్చిన భారతీయులలో అక్కడ పౌరసత్వం తీసుకున్నవారు తక్కువ. ప్రజాజీవితంలో ఎవరూ చురుకుగా లేరక్కడ. కాబట్టి తన ప్రవాసభారత ప్రతినిధి రికార్డు శాశ్వతంగా వుండిపోయినా ఆశ్చర్యంలేదన్నాడు నిక్లాజ్.

నిక్లాజ్ వయసు 48 సంవత్సరాలు. వివాహమైంది. తన కూతురికి అనసూయ అని పేరు పెట్టాడు. తండ్రి, తల్లి పేరు కూతురుకు రావటం సాంప్రదాయమే కదా అంటాడు నవ్వుతూ. తనకు జన్మనిచ్చిన తల్లి ఎక్కడుందో తెలియదు. ఆమె కోసం వెతుకుతున్నాడు నిక్లాజ్.

భారతదేశంతో తన అనుబంధం తెంచుకునేంత బలహీనమైనది కాదంటాడు. ఐదేళ్ళలోపు వయసులో వెళ్ళిపోయినా ఇప్పటికీ భారతదేశ జ్ఞాపకాలు పదిలంగా వున్నాయి నిక్లాజ్‌లో.

కేరళలోని టెక్నికల్ ఫౌండేషన్‌కి సహాయపడుతున్నాడు. సాంకేతిక విద్యను అభ్యసించే భారతీయ విద్యార్థులకు సహాయం అందిస్తానంటున్నాడు.

భారత-స్విస్ సంస్కృతులు రెండూ తనలో ఇముడ్చుకున్న నిక్లాజ్ రెండు దేశాల మధ్య 'రాయబారి'గా పనిచేస్తానంటున్నాడు.

స్విస్ ఎమ్.పిగా భారత, స్విస్‌దేశాలమధ్య సాంకేతిక సహకారం పెంపుదలకు, భారతదేశంలో స్టార్టప్‌ల ప్రోత్సాహానికి ఒక నిర్దిష్ట ప్రణాళికతో మరోసారి భారత్ వస్తానన్నాడు నిక్లాజ్.

తన మూలాలను, తల్లిని వెతుక్కునే కార్యక్రమం ఇంకా మిగిలివుందన్న విషయం గుర్తుచేసుకున్నాడు నిక్లాజ్ శామ్యూల్.



# నచ్చితేనే చేస్తా

"ఈ యేడాది నన్ను మరిన్నిసార్లుచూస్తారు" అంటూ నవ్వులతో చెప్తున్న రాధికా ఆప్టే స్టీరియో టైప్ తార కాదు. చెట్ల చుట్టూ తిరిగే పాత్రలకు పరిమితమయ్యే సాదాసీదా తార అసలే కాదు. పాత్రలతోపాటు, కొన్ని అంశాలపై నిర్భీతిగా మాట్లాడే ఆమె తీరు కూడా అడపాదడపా సంచలనాలు సృష్టిస్తుంటాయి.

'అంటహీన్'లో జర్నలిస్టుగా, 'బద్లాపూర్'లో భర్త తప్పిదాల నడుమ చిక్కిన భార్యగా, 'ఫోబియా'లో అగోరాఫోబిక్ ఆర్టిస్ట్‌గా రాధికా ఆప్టే ఛాయిస్‌లు ఆమె వైవిధ్య దృక్పథాన్ని ప్రతిబింబిస్తుంటాయి.

'మంఝి ది మౌంటెన్ మ్యాన్' వంటి ఆఫ్ బీట్ సినిమాలూ, 'కబాలి' లాంటి కమర్షియల్ వెంచర్లు కూడా చేస్తుంది రాధికా ఆప్టే.

## వెరీ బిజీ

ఈ యేడాది 'పద్మన్'తో మొదలైంది. అక్షయ్ కుమార్ భార్యగా నటించింది. సైఫ్ అలీఖాన్‌తో 'సెక్రెడ్‌గేమ్స్ ఆఫ్ నెట్‌ఫ్లిక్స్', నిఖిల్ అద్వానీ 'బజార్', ఆయుష్మాన్ ఖురానాతో 'షూట్ ది పియానో ప్లేయర్', అనురాగ్ కాశ్యప్ 'బాంబే టాకీస్ 2' సినిమాలతో చాలా బిజీగా వుంది.

మరాఠీ చిత్రపరిశ్రమలోనూ గుర్తింపు పొందింది. ఇటువంటి విభిన్న ఛాయిస్‌ల వెనుక కారణాల గురించి రాధికా ఆప్టే అడిగితే, "ఎన్నో కారణాలుంటాయి. కొన్నిసార్లు దర్శకులు, కొన్నిసార్లు స్క్రిప్టు, పాత్ర, నిర్మాణసంస్థ, నటులు, ఇంకొన్నిసార్లు డబ్బు, కమర్షియల్ దృక్పథం ఇలా.

అవకాశం వచ్చిన సమయంలో నాకు ఏది నచ్చితే దాన్నిబట్టి సినిమా ఎంపికచేసుకుంటాను. ప్రతిభాగం దేనికదే అసాధారణంగా వుంటుంది. ప్రతిదాన్నుంచీ ఎంతో కొంత అభ్యసిస్తుంటాను. అవన్నీ ఏదోక విషయంలోనో, మరోదానిలోనో నా హృదయాన్ని తాకినవే" అంటూ వివరించింది.

## మూడుపదులు దాటేశాయ్!

**పూ**నెకు చెందిన ముప్పయ్ రెండేళ్ళ రాధికా ఆప్టే నాన్న న్యూరోసర్జన్ డాక్టర్ చారుదత్ ఆప్టే. ఈమెకు చిన్నతనం నుంచి నటనంటే ఇష్టం.

పూనెలోని ఫర్గుసన్ కాలేజీలో ఎకనామిక్స్, మ్యాథమేటిక్స్‌లో డిగ్రీ చదివింది. కాలేజీ డ్రామాక్లబ్‌లో చేరి నటించాలన్న తన కోరిక తీర్చుకునేది. పూనెలోని థియేటర్ ట్రూప్ ఆసక్తలో చేరింది. 2005లో వాహ్! లైఫ్‌హోతో ఐసి'లో చిన్న పాత్ర చేసింది.

హిందీ, ఇంగ్లీష్, బెంగాలీ, మరాఠీ, తెలుగు, తమిళం- మొత్తం ఆరుభాషల్లో నటించిన అనుభవం ఉంది. ఏనాడూ కెమెరా ముందు భయపడకపోవడమే క్రెడిట్ అంటుంది. "వాస్తవికంగా ఉండేందుకు ప్రయత్నిస్తాను. ఎగ్జయిట్ అవుతాను.



Courtesy : GQ





ప్రస్తుతం ప్రమోషన్లు, షూటింగ్‌లతో బిజీగా ఉన్నాను. లేస్తూనే పనికివెళ్ళిపోతా. పనవుతూనే ఇంటికి వచ్చేస్తా" అని తెలిపింది.

## లేబుల్స్ నచ్చవు

ఏవిధంగానైనా తనకు లేబులింగ్స్ వేయడం ఆమెకు అస్సలు నచ్చదు. బాలీవుడ్ కాని, స్టార్‌డమ్ కాని తననుఏవిధంగానూ మార్చవన్నది ఆమె నిశ్చితాభిప్రాయం. పని నుంచి రెగ్యులర్‌గా బ్రేక్స్ తీసుకుంటుంది. పుస్తకాలు చదువుతుంది.

సినిమాలు చూస్తుంది. స్విమ్మింగ్ చేస్తుంది. వంట చేయడమూ ఇష్టం. వ్యక్తిగత విషయాల్ని గోప్యంగా ఉంచడం ఆమె అలవాటు.

ఐదేళ్ళక్రితం ప్రఖ్యాత బ్రిటీష్ అవంత్ గార్డె కంపోజర్, వయోలిస్ట్ బెనెడిక్ట్ టేలర్‌ను పెళ్ళాడిందని, లండన్-ఇండియాల నడుమ షటిల్ కొడుతుంటుందని ఇప్పటికీ చాలామందికి తెలియదు.

## కొత్త ఇల్లు

ఈమధ్యే ముంబయ్‌లో కొత్త ఇల్లు కొనుక్కున్నది. తన డెకార్ స్టయిల్ గురించి అడిగితే నవ్వేసింది."విషయాలను నేను నిర్వచించలేను.నాపూర్తి ఉద్దేశ్యం నా ఇంటిని నాకు అనుగుణంగా ఏర్పాటు చేసుకోవడం. నాకేది నచ్చితే అది చేశాను.

ఇప్పటికీ నాకు సంప్రదాయరూపం నచ్చుతుంది. దానిలో కొద్దిగా ఆధునికతను మిళితం చెయ్యాలి. నాకు రస్టిక్, ఓపెన్ లుక్ బాగా నచ్చుతాయి.

లివింగ్, డైనింగ్, కిచెన్ కలగలసిన నా ఇల్లు విశాలంగా ఉంటుంది. ఫర్నీచర్ కనీసమాత్రంగా ఉంచుకుంటాను. ప్రతి మూలలోనూ వీలయినన్ని మొక్కలు, రంగులు కనపడతాయి. నా ఇంట్లో ప్రతి తలుపుకూ విభిన్న కలర్‌లో పెయింట్ చేశాం.

నిజానికి నాకున్న ఇళ్ళన్నింటిలో ఇలాగే తలుపులకు భిన్న రంగులు వేశాం.

నా లండన్ ఇంటిని తలపించే బాత్‌టబ్ ఏర్పాటు ఉంది" అని తెలిపింది.

## ఎన్నో వస్తువులు

రాధికా ఆప్టే ఇంట్లోని చాలా వస్తువులు అంటే వంట పాత్రలు, ఇతర ప్రత్యేక పాత్రలను ఇంగ్లండ్ నుంచి తెచ్చుకున్నవే.

టవల్స్, బెడ్ లైనిన్ వంటి వాటిని టస్కనీ నుంచి తీసుకు వచ్చారు. ఈ జంటది తీరికలేని జీవితం అయినప్పటికీ స్నేహితులను, కుటుంబసభ్యులను ఆహ్వానిస్తుంటారు. వారితో కలసి గడుపుతుంటారు.

'బెనెడిక్ట్‌కు, నాకు వంటచేయడం ఇష్టం.మా పార్టీలలో మేమే డిష్‌లు తయారుచేస్తుంటాం.

కొంచెం కష్టంగా వున్న పదార్థాలు చేయడానికి ఇష్టపడతాను. డిజర్టులు కూడా చేస్తా.

స్వీట్ ట్రీట్స్, భారీ ఒన్-పాట్ మీల్, చాట్, బిర్యానీ ఎక్కువగా ఉంటుంటాయి" అని వివరించింది.

## తెలియని విషయాలు

"నా గురించి తెలియని విషయాలు కొన్ని ఉన్నాయి. నేను చాలా ప్రైవేట్. పూర్తిగా ప్రొఫెషనల్. నేను ప్రేమించేవారు లేకుండా వుండలేను. నాకున్న పెద్ద బలహీనత కేక్స్, ఐస్-క్రీమ్స్, చాక్లెట్స్. నా తల్లిదండ్రులు ఎప్పుడూ నీపట్ల నీవు ఎల్లవేళలా విశ్వాసంగా ఉండాలని సలహా ఇస్తుంటారు. నేనదే అనుసరిస్తా" అని చెప్పింది రాధికా ఆప్టే.

**టి.అనుపమ**

# కృత్తికా మనో'గతం'



**కిలకిల నవ్వుతున్న ఆమె నోటిని తన పెదాలతో మూసేసి ఇన్నాళ్ళూ విలువలు కాపాడిన ఆమె వలువల్ని ఇంక మీతో పనిలేదంటూ ఉల్లిపొరల్లా వలిచి దూరంగా విసిరేశాడు. ఆ సమయంలో...**

వాళ్ళు నలుగురూ ఆ గదిలోకి నడిచారు. ఆస్టార్ హోటల్ కారిడార్... రాత్రి పది కొండు గంటలవేళ... నిర్మానుష్యంగా... నిశ్శబ్దంగా వుంది. గదిలోకి అడుగుపెడుతూనే ఓ పరిమళ వీచిక వాళ్ళని పలకరించింది.అది మల్లెలదా... సన్న జాజులదా... గులాబీలదా చెప్పటం కష్టం. అన్నీ కలగలిసిన తావి ఆ విరితావి!

విశాలమైన ఆ గది మధ్య క్షీరార్ణవ ఫేనపుంజ ధావళ్యంతో మెరిసిపోతున్న పానుపు 'రారమ్మని' ఆహ్వానిస్తున్నట్టుగా పరిచి వుంది.

ఆ పక్కనే చేతి కందే దూరంలో వున్న బల్లమీద వివిధ తినుబండారాలు... ఆకర్షణీయంగా అమర్చ బడి ఊరిస్తున్నాయి. పక్కనున్న ఫ్రిజ్‌లో, గ్లాస్ డోర్‌లోంచి కనబడుతూ ఫ్రూట్‌జ్యూస్ బాటిల్స్.

ఏర్పాట్లన్నీ గమనించాక, "ఇక మేం బయలు దేరతాం. గుడ్‌నైట్..." అన్నాడు విష్ణు.

"రేపుదయం ఎనిమిదింటికల్లా కారూ, డ్రయివరూ వస్తారు. కిందే వెయిట్ చేస్తూవుంటాడు. మీరు ఎప్పుడు రాదల్చుకుంటే, అప్పుడు బయల్దేరి రావొచ్చు" 'ఎప్పుడు రాదల్చుకుంటే' అన్నపదం విరిచి పలుకుతూ కొంటెగా నవ్వాడు.

అన్నయ్యభుజమ్మీద చిన్నగా చరిచాడు భరణి.

"వెళ్తాంలే, నువ్వేం తోసెయ్యనక్కర్లేదు" ఈసారి వనజ అందుకుంది, నవ్వుతూ భర్త చెయ్యి పట్టుకుని లాగింది.

"అవునవును.మా వంకతో బుక్ చేసుకున్న మీ గదిని ఉద్ధరించండి" తనుకూడా నవ్వాడు భరణి. నవ్వులమధ్య బయటకు నడిచారు వనజ, విష్ణు.

కారిడార్‌లోకివచ్చి, తలుపు దగ్గరగా లాగింది వనజ. 'డు నాట్ డిస్టర్బ్' డిస్‌ప్లే కార్డ్ హాండిల్‌కి తగిలించాడు విష్ణు. ఆ వెనక, వనజవైపుకి తిరిగి భుజమ్మీద చేయివేసి దగ్గరగా తీసుకుని మెట్ల మీదుగా క్రిందికి నడిచాడు. ఆ కింది ఫ్లోర్‌లోనే ఒక గది తీసుకున్నారు వాళ్ళు కూడా.

తలుపు ఆటో లాక్‌అయినట్లు రూఢి చేసుకుని,

పి.వి.ఆర్.శివకుమార్



కృత్తికవైపు రెండడుగులు వేశాడు భరణి.

అతను దగ్గరగా వస్తుంటే వెచ్చగా ఆవిర్లు పొంగాయి ఆమె బుగ్గల్లో. ఎన్ని విన్నా, ఎన్ని చదివినా మొదటి రాత్రి మొదటిరాత్రే.

సిగ్గుతెరలుకమ్మాయి ఆమెని. "అమ్మో!సిగ్గే...." చిలిపిగా ఆమె చుబుకం పట్టి ఎత్తాడు. చురుగ్గా చూసింది కృత్తిక. చటుక్కున ఆ పెద్ద పెద్ద కళ్ళమీద పెదవులు ఆన్చాడు. మైకం కమ్మింది ఆమెను.

నెమ్మదిగా నడిపించుకుంటూ మంచం వరకూ తీసుకువెళ్ళాడు. మంచం చేరేవరకే ఆ నెమ్మదితనం. మంచం మీద కూర్చోపెడుతూనే ఒక్క ఉదుటున ఆమెని వెనక్కి వాల్చి, మీదికి వంగాడు.

చటుక్కున తెలివి వచ్చిందామెకి. అతడి పట్టు విడిపించుకునే ప్రయత్నంచేస్తూ అంది.

"మొన్నమనం అనుకున్న దేమిటీ... ఇప్పుడుమీరు చేస్తున్న దేమిటి?"విడిపించుకునే ప్రయత్నంలో జారిపోయినపైటని పైకి తీసుకోబోయింది. ఆ ప్రయత్నాన్ని అడ్డుకున్నాడు భరణి.



యువతలోని పోటీతత్వాన్ని, ఆవిష్కరణలుచేసే శక్తిని ప్రోత్సహించటమే ఏ ప్రభుత్వమైనా చేయాల్సింది. -బెంజిమన్ నెతన్యాహు, ఇజ్రాయిల్ ప్రధాని

"అనుకున్నది నిజమే గానీ,అవన్నీఅరగంట తరువాత అన్నావుకదా" అమాయకంగా అన్నాడు, ఆచ్ఛాదనలేని ఎదలోతుల్ని కళ్ళతోనే కొలుస్తూ.

"మాయమాటలొద్దు 'ఇవన్నీ'అరగంట తరవాత" అతణ్ణి బలవంతంగా తప్పించుకుని, నిటారుగా కూర్చుంది. నిరాశగా వెనక్కి జరిగాడతను.

ఆమె మంచంమీదనుంచి లేచింది. ఫ్రిజ్‌లో బాటిల్ తీసి రెండు గ్లాసుల్లో ఆరెంజ్ జ్యూస్ నింపింది. అతనికొకటి అందిస్తూ అంది "కాసేపు అల్లరి మానేసి కబుర్లు చెప్పుకుంటే..."

"...కుంటే.... ఆ తర్వాత అల్లరి చెయ్యనిస్తావా? సిగ్గుతో మొహం ఎఱ్రబడింది కృత్తికకి.

"ముందు జ్యూస్ తాగండి"

ఇద్దరూ పక్కపక్కనే ఆనుకుని కూర్చున్నారు, ఒకరి చేతిలో జ్యూస్ మరొకరు త్రాగుతూ.

"ఇప్పుడు చెప్పండి కబుర్లు"

"అన్నట్టు నీకెవరైనా అబ్బాయిలున్నారా స్నేహితులు...?" అడిగాడతను.

"ఆ... వున్నారు, బుజ్జిపండు, రాంబాబు, ఆనందరావు" నవ్వింది కృత్తిక. భరణి కూడా నవ్వాడు.

"నిజంగా చెప్పు. నీకెవరయినా మగస్నేహితులున్నారా?" నవ్వు ఆపాక అడిగాడు.

నిర్భావంగా చూసింది కృత్తిక "స్నేహితులంటే... పరిచయస్తులుంటారంతే... ఇన్నేళ్ళుగా కాలేజీలో చదివీ, రెండేళ్ళనుంచీ ఉద్యోగం చేస్తూ మగాళ్ళతో మాట్లాడకుండానే అవుతుందా? అదేమన్నాతప్పా?"

"తప్పు అని కాదు, ఊరికే అడిగానంతే"

"సరే చెప్పానుగా... వున్నారు. ఐనా మీకు మాత్రం ఉండరా... స్నేహితురాళ్ళు" నిష్ఠూరంలాగా అంది.

"కానీ... నేను ప్రేమించినవాళ్ళు మాత్రం ఎవరూ లేరు. అందులో..."

"గుమ్మడి కాయలదొంగ... ప్రేమ ప్రస్తావన ఎందుకొచ్చిందీ మధ్యలో..."

"సరే! నా సంగతి అలా వుంచు. భార్యాభర్తల మధ్య దాపరికాలు అనుమానాలకీ, అపోహలకీ దారితీస్తాయిట.

అందుకే మనం రహస్యాలన్నీ పంచేసుకుందాం. ఈ పూటేగుట్టులన్నీ విప్పి గుట్టపడేద్దాం" ఆమె చీరె కుచ్చిళ్ళ మీదికి చెయ్యిపోనిస్తూ అన్నాడు. దూరంగా జరిగింది తప్పించుకుంటూ కృత్తిక. "చదువుసంధ్యల కన్నా, ఆటపాటల్లో చురుగ్గా ఉండేదాన్ని నేను. కో ఎడ్యుకేషన్ కావటంతో, మగపిల్లలు నాతో చనువుగా ఉండటానికి ప్రయత్నించేవాళ్ళు" అంది.

"చనువుగా అంటే..?"

"ఏముందీ, వీలు చేసుకుని మాటకలపటం... అదనుదొరికితే చేయి కలపటం...ఇలాగా..."

"చేయి కూడా కలిపేవాళ్ళా?..." భరణి గొంతులో కొంటెదనం లేదు!

"షేక్‌హాండ్‌వరకూ తప్పేదికాదు, ఓసారి మా కాలేజీలో ఒకబ్బాయి ఇంకొంచెం ముందుకి వెళ్ళబోయాడు. నే కొట్టిన చెంపదెబ్బకి వెనక్కి పడిపోయాడు. అప్పట్నించీ వాడి అనుభవం మిగతా వాళ్ళని కూడా దూరం పెట్టింది నానుంచి..."

స్థిమితంగా వెనక్కి వాలాడు భరణి. నెమ్మదిగా తన తల ఆమె ఒడిలోకి చేర్చాడు.

"ఊ... చెప్పు... ఇంకా..." ఎవడూ ప్రేమా గీమా అంటూ వెంటబడలేదు కదా..."

"చెప్పానుగా...చెంపదెబ్బతోనే ఆటంబాంబ్ అన్న పేరొచ్చేసింది. ఆటంబాంబుని ఎవరు ప్రేమిస్తారూ?" నవ్వింది కృత్తిక.

"ఆ తర్వాత కాలేజీలో ఎవ్వరూ నాకేసి చూడనైనా లేదు" అంది కప్కృత్తిక.

"అంటే కాలేజీ బైట ఎవరన్నా అల్లరిపెట్టారా?"

"అల్లరేం పెట్టలేదు..." అని ఆగిపోయిందామె.

"మరి...?"

"ఏం లేదు..."

"చెప్పు కృతీ, ఏ చిన్న విషయమైనా ఈ పూటే పంచుకుందామనుకున్నాం కదా, ఇహ ఆ తర్వాత మనమనసులు నిష్కల్మషంగా మిగిలిపోతాయి"ఆమె నడుం మడతల్ని సవరిస్తూ అన్నాడు. అతని చేతుల మీద తన చేతులుంచి కొనసాగించింది కృత్తిక.

"తప్పేమీ జరగలేదండీ, అతనిది వెర్రి ఆరాధన... అంతే" నెమ్మదిగా గొణుగుతున్నట్టుగా అంది.

చటుక్కున లేచి కూర్చున్నాడు భరణి. భయంగా చూసిందామె. "ఎవరతను? ఏం జరిగింది?"

ఆమె కళ్ళలో బెరుకును చూసి, గొంతు మృదువుగా మార్చాడు. లాలనగా అడిగాడు "తప్పు జరగనప్పుడు, చెప్పటానికేం జంకు అక్కర్లేదు కృతీ, చెప్పు పర్లేదు" ఓ నిమిషం ఆగి అందామె.

"అతను... మా పక్కింటి అబ్బాయి"

"ఎప్పటినుంచి?"

"చిన్నప్పటినుంచే, బహుశా నాకు అయిదారేళ్ళు ఉంటాయేమో. వాళ్ళు మా ఇంటిప్రక్క స్థలం కొనుక్కున్నారు.ఇల్లు కట్టుకుని వచ్చారు. వాళ్ళ నాన్నగారిది మందులషాపు. ఊళ్ళోకల్లా అదే పెద్దషాపు.

వాడికి ఒక అన్నయ్య. ఇద్దరు చెల్లెళ్ళు. నా ఈడుది ఒకమ్మాయి, రెండో చెల్లెలు మూడేళ్ళు చిన్నది.

వాళ్ళు ఆ ఇంట్లోకి వచ్చినప్పటినుంచీ మా ఇంటికి సందడి వచ్చింది. మా ఇంట్లో నేను ఒక్కర్తినే.

ఇప్పుడు వాడి చెల్లెళ్ళతో కలిపి మేం ముగ్గురమయిపోయాం. వాళ్ళ అన్నయ్య వాడికన్నా అయిదేళ్ళు పెద్ద. అందుకే మాకు అతనితో జత కుదిరేదికాదు. వాడు నాకన్నా రెండేళ్ళే పెద్ద. అందుకే మాతోపాటుగా ఆటలకి వస్తుండేవాడు"

"ఓహో... వాడేనా నీ హీరో? వాడు... వాడు... అంటున్నావ్ బా...గా... చనువా?"

ఎర్రగా చూసింది కృత్తిక "అయిదేళ్ళ పిల్ల లప్పటి స్నేహంలో 'వాడు' అనక ఏమంటాం?"

"సర్లే నీ స్నేహితుడు, నీ ఇష్టం చెప్పు"

"నేను ఇంటర్లోకివచ్చేసరికి అతను డిగ్రీకి వెళ్ళాడు. నాకు కాలేజీ కొత్త. పాఠాలు కొత్త. ఇంగ్లీషు కొత్త. నా గాభరాచూసి అతను సహాయంచేయటం ప్రారంభించాడు.

రోజూ రాత్రిపూట గంటా గంటన్నరసేపు సబ్జెక్ట్ పరిచయం చేసేవాడు. ఆ వయసుకే అతనిలో మంచి ఉపాధ్యాయుడున్నాడు! నాకూ, వాళ్ళ చెల్లెలికీ కలిపి చెప్పేవాడు. ఎప్పుడైనా అతని చెల్లెలు రానిరోజు నన్నుచూపులతో ఇబ్బందిపెట్టేవాడు..."

"ఒట్టిచూపులతోనేనా? అతను ఇబ్బందిపెట్టేవాడా, నువ్వే ఇబ్బందిపడేదానివా?"

"నాకై నేనెందుకు ఇబ్బందిపడతాను? అతనే పెట్టేవాడు" రోషంగా అంది కృత్తిక.

"ఇబ్బంది అంటే... ఏం ఇబ్బందిపెట్టేవాడు?" భరణి గొంతులో ఆసక్తి!

"ఇబ్బంది అంటే... అంటే అనవసరంగా దగ్గరకు జరగటం, చేయిమీద చేయివేయటం... ఇలాంటి పనులు" చెప్పింది కృత్తిక. "మరి నువ్వు ఊరుకునేదానివా?" అతని గొంతులో అసహనం.

"మరి అతను పాఠాలు చెప్తూ, సహాయం చేస్తున్నప్పుడు, విదిలించుకుంటే మర్యాద కాదు కదా, దూరంగా జరిగి కూర్చునేదాన్ని!" అంది.

"ఓ.. చాలా మర్యాదలు తెలుసన్నమాట నీకు"

"వదిలెయ్యండి... అలా ఇంటర్ రెండేళ్ళూ గడిచిపోయాయి. ఆరోజు రిజల్ట్స్‌వచ్చాయి. నాకు ఫస్ట్‌క్లాస్ వచ్చింది. ఏడాదిక్రితందాకా ఇది ఊహించని ఫలితం. అతని కృషికి ఫలితం నాకుదక్కింది!

గబగబ వాళ్ళింటికి పరిగెత్తాను. అతను చెల్లెళ్ళతో గదిలోనే కూర్చుని కబుర్లు చెబుతున్నాడు.

"నీకోసమే ఎదురుచూస్తున్నాం. కంగ్రాచ్యులేషన్స్. మేమే మీ ఇంటికి వద్దామనుకుంటున్నాం" అన్నాడు నన్ను చూడగానే.

"చాలా థ్యాంక్స్. నీమూలంగానే నాకు ఫస్ట్ క్లాస్‌వచ్చింది" అన్నాను మెరుస్తున్న కళ్ళతో ఉద్వేగంగా.

"నా మూలంగా అయితే, దీనికీ రావల్సిందే. మరి ఇది సెకండ్ క్లాస్‌లోనే సెటిలయిందిగా" అన్నాడతను నవ్వుతూ.

"మనం ఇప్పుడు సెలెబ్రేట్ చేసుకోవాలి" అంటూ పర్సుతీసి చెల్లెలిచేతికి డబ్బుఇచ్చాడు. "త్వరగా వెళ్ళి స్వీట్స్ తీసుకురా" అంటూ. చెల్లెళ్ళిద్దరూ బయటికి పరుగెత్తారు.

"ఆంటీని కలిసి చెప్తాస్తా"అంటూ లోపలికి నడవబోయాను నేను.

"అమ్మ ఇంట్లో లేదు. గుడికి వెళ్ళింది"

"ఓ!" అంటూ అక్కడే కూర్చుండిపోయాను. నా మనసంతా సంతోషంతో తబ్బిబ్బవుతోంది. మళ్ళీ అతన్తో చెప్పాను "చాలా థ్యాంక్స్"

"ఒట్టిథ్యాంక్సేనా?"అదోలా నవ్వాడతను.

"మరి గురుదక్షిణ కావాలా?"

"నో... నో... గురుదక్షిణ అంటే మనమధ్య దూరం పెరుగుతుంది. నేను చేసింది స్నేహితుడిగా ఒక సాయం.. అంతే"

"సరే. సంతోషం స్నేహితుడా! ఏం కావాలో కోరుకో" చిలిపిగా అన్నాను. అతను చటుక్కున లేచి నా దగ్గరకు వచ్చాడు.

ఒక్కక్షణం ఆగి బరువుగా ఊపిరి పీల్చుకుంది కృత్తిక. తర్వాత కొనసాగించింది-

"నా భుజాలు రెండూ పట్టుకుని దగ్గరకు తీసుకున్నాడు. అతనేం చేయబోతున్నాడో అర్థమై తల ప్రక్కకుతిప్పేశాను. అతను పెట్టిన ముద్దు నా బుగ్గమీద బలంగా అచ్చుపడింది.

> వివేకానంద, నేతాజీలు జాతీయంగానే కాదు అంతర్జాతీయంగా ప్రముఖులు, వారి జయంతులను సెలవు దినాలుగా ప్రకటించాలి.
>
> *-మమతాబెనర్జీ, బెంగాల్ సి.ఎమ్.*



**ఫిదా పిల్ల**

'ఫిదా'పిల్ల సాయిపల్లవి సినిమాల ఎంపికలో నిక్కచ్చిగా వ్యవహరిస్తున్నది. పెద్ద నిర్మాత, పెద్ద దర్శకులు, పెద్ద నటులు అయినా సరే కథ నచ్చకపోతే నై అంటోంది.

ఆదిలోనే ఇలా చేయడం సబబా అని అడిగితే సమాధానంకూడా అంతే ఖచ్చితంగా చెప్పింది. "నాకు నా కెరీర్ ముఖ్యం. నచ్చితేనే నటిస్తా. దిల్‌రాజుగారి సినిమా కథ నచ్చలేదు కాబట్టి నటించనని చెప్పాను.

మణిరత్నంగారు గొప్ప దర్శకులు. నావంటి వారికి ఆయన దర్శకత్వంలో నటించాలన్న కోరిక తప్పకుండా వుంటుంది. కాని, కథ నచ్చకుండా చెయ్యలేను. అలాగే విక్రమ్ సరసన నటించాలంటే నా పాత్రకు పస వుండాలి.

అందుకే వద్దన్నాను. నన్ను ఈ విషయాల్లో చాలామంది తప్పుపడుతున్నారు. ఎవరేమనుకున్నా నా దారి నాదే" అంటూ జంకు లేకుండా చెప్పింది. ఎంతైనా ధైర్యవంతురాలే.



క్షణంలో సగంపాటు నా మనసు వశంతప్పింది.కానీ, వెంటనే తేరుకుని అతణ్ణి దూరంగా తోసేశాను. "ఇలాంటి పనులు చేశావంటే, ఇహ జన్మలో నీతో మాట్లాడను" అంటూ అరిచాను.

అతని ముఖం అవమానంతో వడిలిపోయింది. దూరంగా వెళ్ళికూర్చున్నాడు. ఇంతలో అతనిచెల్లెళ్ళు రావటంతోదృశ్యం మారిపోయింది...." ఆపింది.

"ఆ తర్వాత..." భరణి అడిగాడు.

"ఆ తర్వాత అతను మళ్ళీ ఏ చొరవా చెయ్య లేదు" అంది కృత్తిక.

"అయ్యో పాపం, చెయ్యనివ్వాల్సింది నీకంతగా సాయం చేశాడు కదా...!" వ్యంగ్యంగా అన్నాడు.

కోపంగా చూసింది కృత్తిక.

"ఒ...కె... ఒ...కె... చెప్పు"

"మరుసటేడు డిగ్రీలో ఓ కుర్రాడి చెంప ఛెళ్ళుమనిపించిన సంఘటన జరిగిన రోజున, అతను నన్ను అభినందించాడు!

"నా జోలికి ఎవరొచ్చినా అంతే" అంటూ నవ్వాను. అతను భయం నటిస్తూ చెంప తడుముకున్నాడు. ఆ క్షణంలో అలా ఎందుకనాలి అనిపించిందో తెలియదు "నువ్వు మంచి బాలుడివేలే" అని అతని చెంప మృదువుగా నిమిరాను! అతని ముఖంలో వేయి సూర్యుల తేజస్సు!

అప్పట్నుంచి అతని కళ్ళలో నా పట్ల ఆరాధన! నన్ను పొగడటం ప్రారంభమైంది. 'నీ మాటల్లో గీతం ఉంది. వింటూ అలా ఉండిపోవాలనిపిస్తుంది' అనే వాడు. నేను కోపంగాచూస్తే దీనంగా చూసేవాడు.

ఇలాగే రెండేళ్ళు గడిచిపోయాయి. అతను చూపులతోనే నన్ను వెంటాడుతున్నాడు. ఎవరైనా ఏదైనా మాట్లాడితే తిరుగు జవాబుఇవ్వవచ్చు. ఏదైనా చేయబోతే తిరుగులేని శిక్షవెయ్యవచ్చు. కేవలం చూపులతో సభ్యత మీరకుండావేధిస్తుంటే ఏంచెయ్యగలను?"

"అబ్బో... అంత వేదనే అనిపిస్తే ఊరుకునే దానివా?" అన్నాడు భరణి. కృత్తిక కళ్ళలో నీళ్ళు తిప్పుకుంది" మీరు అలా అపార్థం చేసుకుని మాట్లాడితే, ఇంక నేను చెప్పేదేమీ వుండదు" అంది.

"ఆల్‌రైట్. ఇక సాంతం విన్నాకే మాట్లాడతాను" గంభీరంగా అన్నాడు భరణి.

ఎటో చూస్తూ కంటిన్యూ చేసింది కృత్తిక.

"ఆ రోజు అతనికి ఉద్యోగం ఆఫర్ వచ్చింది. వారంరోజులలోగా వెళ్ళి చేరిపోవాలి. ఆ రోజు మొదటి సారిగా నన్ను పార్క్‌కి రమ్మని పిలిచాడు. నాకు తిరస్కరించే అవకాశమే ఇవ్వకుండా మళ్ళీ అన్నాడు.

"ఈ ఒక్కసారే నిన్ను పిలిచేది. ఇవాళ నువ్వురాకపోతే ఇక ఎప్పటికీ ఈ స్నేహితుడు నీకు దూరమైపోతాడు" నాకంతా అయోమయంగా అనిపించింది. నేను పెరిగిన వాతావరణం, కట్టుబాట్లు ఒకవైపు. నేనే కావాలని తపిస్తున్న అతను మరోవైపు, నాకుఆలోచించే అవకాశమేలేనట్లుగా.

## అయ్యో! వదిలేశా!

మలయాళ తార పార్వతినాయర్ తాను వద్దని వదిలేసుకున్న సినిమాలు హిట్‌కావడంతో నిరుత్సాహపడిపోయింది.

'అర్జున్‌రెడ్డి' సినీ అవకాశం నిజానికి పార్వతి నాయర్‌కే ముందుగా వచ్చింది.

కానీ, కథ విన్నప్పుడు బోల్డ్ సన్నివేశాలు, ముద్దుల జోరు, పైగా కొత్త దర్శకుడులాంటి కారణాలతో వద్దని నోరు జారేసింది.

తీరా అర్జున్‌రెడ్డి సినిమాను తెరపై చూశాక, ఆ సినిమా తీసిన తీరు, ఆడిన జోరు చూసి వదిలేసుకున్నందుకు బాధపడ్డానని ఫ్రాంక్‌గా చెప్పింది. అలాగే తమిళంలో హిట్‌కొట్టిన 'అరువి' సినిమాకుకూడా ఆమె నో చెప్పింది.

'అరువి'లో టైటిల్ రోల్ చేసిన అదితీ బాలన్‌కు ప్రశంసలు, అవార్డులు దక్కడంతో పార్వతి బాధ మరీ ఎక్కువైనట్లుంది. 'ఇకపై కథల్ని, దర్శకుల్ని తక్కువ అంచనా వెయ్యను' అంటూ గట్టిగా చెప్పేసుకున్నది.



వడివడిగా సాయంత్రం అయిపోయింది. మొదటి సారిగా ఇంట్లో అబద్ధంచెప్పి పార్కుకి నడిచాను.

నన్ను చూస్తూనే అతను లేచి వచ్చాడు కూర్చున్న బెంచి మీది నుంచి. నా రెండు చేతులూ పట్టుకుని ఆత్రంగా అన్నాడు, "నిన్నువిడిచి నేనుండలేను కృతీ, నేను నీకు అక్కర్లేదా?"

నోటివెంట మాటరాలేదు నాకు. కళ్ళ వెంట నీళ్ళు వచ్చాయి. నా మౌనం, నా కన్నీరు అతనికి జవాబు అందించింది. "రేపే వచ్చి మీ నాన్నగారితో మాట్లాడమని మా నాన్నగారిని పంపుతాను" అన్నాడు. ఆపేసింది కృత్తిక.

"ఊ... చెప్పు... ఆపేశావేమిటి?"

"తర్వాత తర్వాత జరిగిన గతం మర్చిపొండి"

"మరచిపోయేటంతతేలికా నువ్వుచెప్పినగతం?"

"సరే, నాగతం మరచిపోలేదు, మరి మీ గతం చెప్పరేం?" రోషంగా అంది కృత్తిక.

భరణి మంచంమీదినుంచి లేచాడు. ఒక్కక్షణం ఊపిరి పీల్చుకున్నాడు. ఆ వెంటనే సుడిగాలి వేగంతో ఆమెని రెక్కపట్టుకుని లేపాడు. "నా గతం కాదు, నీ గతమే చెప్తాను, విను. మీ నాన్నగారు తేలిగ్గానే ఒప్పుకున్నా నువ్వు నన్ను ఆ తర్వాత కూడా ఎన్ని తిప్పలు పెట్టావో నేను మర్చిపోగలనా?

పెళ్ళి కుదిరినతరువాత అయినా ఓ సినిమా లేదు, ఓ షికారు లేదు, ఓ పార్కు లేదు, ఓ ముద్దుముచ్చట లేదు, ప్రేమికులందరూ అనుభవించే ఏ అచ్చటా ముచ్చటా తీర్చలేదు.

అన్నిటికీ హద్దులు, హద్దులు మీరిన హద్దులు... ఓ సివంగీ.. ఎంత ఏడిపించావే ఈ మూణ్ణెల్లుగా! చివరికి ఇవాళ కూడా ఈ శుభరాత్రి కూడా ఇంతసేపు నా కథనే నాకు వినిపిస్తూ...

ఇక నిన్ను వదలను, నీ పనిచెప్తా చూసుకో!

కిలకిల నవ్వుతున్న ఆమె నోటిని తన పెదాలతో మూసేసి ఇన్నాళ్ళూ విలువలు కాపాడిన ఆమె వలువల్ని 'ఇంక మీతో పనిలేదంటూ' ఉల్లిపొరల్లా వలిచి దూరంగా విసిరేశాడు.

విలువకట్టలేని ఆమె అనాచ్ఛాదిత దేహాన్ని మోహావేశంతో కళ్ళింత చేసుకుని చూస్తూ అణువణువూ కమ్ముకుపోయాడతను.

హద్దులు చెరిగిపోయిన ఆనందంతో అణువణువూ పులకించిపోయింది కృత్తిక.

ఒక్క క్షణంకూడా మనసును నిగ్రహించలేం. ఒక్క విషయంపైనా మనస్సును నిలుపలేం. అటువంటి మనం ఎలా స్వతంత్రులం?! ఐనా మనం స్వతంత్రులమని చాటుకుంటాం. నిగ్రహంలేని మనస్సు మనల్ని క్రిందకు లాగితే, నిగ్రహం వున్న మనస్సు మనల్ని రక్షిస్తుంది.

# ఒక చిన్నమాట



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

'నేషనల్ హగ్గింగ్ డే' ఒకటి ఉందని, దానిని చాలా దేశాలు జరుపుకుంటాయనే వార్తలు మన దేశంలో తక్కువగానే ప్రచురితమవుతాయి.

ఒకప్పుడు వాలెంటైన్స్ డే ఉండేది కాదు. ఇప్పుడు దేశవ్యాప్తంగా 'ప్రేమికుల దినం'గా జరుపుకుంటారు. దానిని వ్యతిరేకిస్తూ హంగామా చేస్తూ, అలజడులు చేసేవారూ ఉన్నారు.

ఇక 'అలింగన దినం' అంటే దానికి పెడర్థాలే తీస్తారు. 1986 నుండి 21 జనవరిని నేషనల్ హగ్గింగ్ డేగా అమెరికాలో, ఇతర దేశాలలో జరుపుకుంటారు.

కొన్ని దేశాలలో ఇది సెలవుదినంకూడా. కుటుంబంలోని సభ్యులను, స్నేహితులను తరచూదగ్గరగా తీసుకోటాన్ని ప్రోత్సహించటానికి ఈ పర్వం జరుపుకుంటారు. ఎవరో చెప్పినట్టు మీరు ప్రేమించేవారిని దగ్గరకు తీసుకుని మీరెంతప్రేమిస్తారో వారికి తెలియజెప్పకపోతే వారు పోయినప్పుడు మీరెంత బిగ్గరగా అరచి చెప్పినా వారు వినరు.

దుఃఖపడినంతమాత్రాన నిన్నటి బాధ తొలగిపోదు కాని అది ఈనాడు మిమ్మల్ని శక్తిహీనులను చేస్తుంది. అందుకే చింతకు దూరంగా ఆనందాన్ని పొందుతూ చిరునవ్వుతో జీవితాన్ని కౌగిలించుకోవాలి. కౌగిలించుకోటం, దగ్గరకు తీసుకోటం, ప్రేమను వ్యక్తీకరించటం అనేది కేవలం మనుషులకే కాదు ప్రాణులు అన్నిటికీ వర్తిస్తుంది.

'ఎలుగుబంటి కౌగిలి' అనే మాట ఒకటి ఉంది. ముందరి కాళ్ళు పైకెత్తి మనల్ని గట్టిగా పట్టేస్తుంది.

ఈ మాట స్టాక్ మార్కెట్ ముందుకు సాగనప్పుడూ అంటారు. స్పీడుగా ముందుకుపోతే అది 'బుల్', వృషభం.

కౌగిలింతలు అవగాహనను, ఓదార్పును, స్నేహాన్ని సూచిస్తాయి. మాటలు దొరకని స్థితిలో అది మన భావాలు వ్యక్తపరుస్తుంది. మన ఆహ్లాదాన్ని తెలియజెపుతుంది. కౌగిలింతవలన ఆరోగ్య ప్రయోజనాలు ఉన్నాయని విజ్ఞానశాస్త్రం చెపుతుంది.

ఆరోగ్యానికి, భావోద్రేకాలకు, బంధాలకు చిరుకానుకగా ఈ దగ్గరితనం పనిచేస్తుంది.

మానవ సంకేతాలకు మూలమైన కౌగిలి నుండి పొందే ఆధ్యాత్మిక, ఆరోగ్య ప్రయోజనాలను చాలామంది గుర్తించకపోవచ్చు. ఈ ఆరోగ్య ప్రయోజనాలను విజ్ఞానశాస్త్రం ఈ విధంగా వివరిస్తుంది.

రోగనిరోధకశక్తిని పెంపొందిస్తుంది. ఆలింగనంలోని తృప్తితో ఆహారంపట్ల విపరీతమైన మోహం తగ్గుతుంది. దీనితో శరీరం బరువెక్కే ప్రమాదం ఉండదు. ఈ సందర్భంలో ఒక జోక్ గుర్తొస్తోంది.

అప్రస్తుతం కాని అసందర్భం కాదు. ఒక వ్యక్తి ఫాస్ట్‌ఫుడ్ సెంటర్‌కు వెళ్ళి తనకు నచ్చిన బర్గర్లు వగైరా కొనుక్కుని తింటూ వెళ్తుంటాడు.




దారిలో ఒక బికారి కూర్చుని ఉంటాడు. "మూడు రోజులుగా నేనేమీ తినలేదు" అని అంటాడు.

దానికి ఈ వ్యక్తి సమాధానంగా "నీకు ఉన్నంత నిగ్రహం నాకు లేదు బ్రదర్" అని ముందుకు సాగుతాడు. సరే. హగ్‌వల్ల వచ్చే మరో ప్రయోజనం మరి కొంతకాలం ఎక్కువగా జీవించటం.చురుగ్గా,మరింత శక్తితో ఉండగలుగుతారు.

పరిష్వంగంలో ఆక్సిటోసిన్ అనే హార్మోన్ విడుదలయి బంధాన్ని గట్టిపరుస్తూ, ఆనందాన్నిస్తుంది.

ఆలింగనంవల్ల ఆత్మగౌరవం పెరగటమేగాక, కష్టాలనెదుర్కొనే ఆత్మస్థైర్యమూ లభిస్తుంది.

ఒక అపరిచితుని మొహంమీద చిరునవ్వు తీసుకురావటం అంటీముట్టనట్టున్న నేటి సామాజికస్థితిలో ఎంతో వాంఛనీయమని జాన్ మాన్ అనే వ్యక్తి ఎఫెక్ట్ ఆఫ్ ఫ్రీ హగ్స్ (ఉచిత పరిష్వంగాల ఫలితాలు) అనే ప్రచారం ప్రారంభించారు.

విదేశాలలో ఫ్రీ హగ్ అని రాసిన కాగితపు బోర్డులు పట్టుకుని ఈ హగ్గింగ్ డేను జరుపుకుంటారు.

మన దేశంలో మాతా అమృతానందమయిని అందరూ అమ్మ అని ప్రేమగా పిలుచుకుంటారు. దేశవిదేశాలలోని భక్తులందరినీ అమ్మ ఆప్యాయంగా పొదువుకుంటుంది. ఆమె కౌగిలిలో కన్నీరుమున్నీరయినవారు, ఎంతో ఆత్మానందాన్ని, ఊరటను పొందిన వారు కోకొల్లలు.

ఆమె అన్నిగంటలు నిర్విరామంగాకూర్చుని ప్రతి వ్యక్తినీ ఆదరించటమనేది ఏదో దివ్యశక్తివల్లే సాధ్యమని చాలామంది అంటారు.

"నాలో నా వద్దకు వచ్చినవారినందరినీ చేరే శక్తి ఉన్నంతవరకు, దుఃఖిస్తున్న వ్యక్తి భుజంమీద నేను చేయిపెట్టగలిగినంతవరకు నేను దర్శనం ఇస్తూనే ఉంటాను. ప్రేమగా ప్రజలను నిమరటాన్ని, ఓదార్చటాన్ని వారి కన్నీళ్ళు తుడవటాన్ని ఈ నా అశాశ్వత శరీరం ఉన్నంతవరకు నేను కొనసాగిస్తాను. ఇదే నా కోరిక" అని అమ్మ అంటారు.

ఆమె చేస్తున్న మానవసేవ కూడా మాటలకందనిది. మదర్ థెరిసాకూడా అన్నిటికంటే మించిన దరిద్రం, పేద ప్రేమరాహిత్యమనే చెప్పారు. ఆ యా దేశాల, ప్రాంతాల ఆచారాల దృష్ట్యా ఇతరులను తాకటం అనేది భిన్నంగా ఉంటుంది.

ఉత్తరదేశంలో, ముఖ్యంగా పంజాబ్‌లో ఒకరినొకరు పలకరించుకోటం, క్షేమసమాచారాలడగటం, ఆత్మీయ తను ప్రకటించటం పరిష్వంగంతోనే ఉంటుంది. పెద్దల పట్ల వినయవిధేయతలూ ఎక్కువే.

కొన్ని దేశసంస్కృతులలో ముద్దులతో పలకరించుకుంటారు. కేవలం ప్రతీకాత్మకమే. మధ్య ప్రాచ్య, పశ్చిమ ప్రాచ్యదేశాలలోనూ పరిష్వంగాలు ఉన్నాయి. పాశ్చాత్యుల పద్ధతి వేరు.

విదేశ అధిపతులను కలిసినప్పుడు ప్రధాని నరేంద్రమోడీ ఆప్యాయంగా కౌగలించుకుని సన్నిహితత్వం తెలియజేయడం చర్చనీయమైంది. రకరకాల నేతలతో ప్రధాని పరిష్వంగాలను చూపిస్తూ, వ్యంగ్యమైన వ్యాఖ్యలతో ఒక నిమిషపు వీడియోను కాంగ్రెస్ విడుదలచేసింది.నాయకులు దానిని సరదాగా హాస్యం కింద తీసుకోవాలని చెపుతున్నా దానిలో హాస్యంకంటే ఎక్కువ ఎగతాళి, మర్మభావాలున్నాయి.

"మోడీజీ, త్వరపడండి. ప్రెసిడెంట్ ట్రంప్‌కు మరో కౌగిలంత అవసరమైనట్టుంది" అని రాహులే ఒకసారి ట్వీట్‌చేశారు. ఈసారి రిపబ్లిక్‌డేకు పదిమంది ఆసియాన్ నేతలు రానున్నందున ఎన్ని కౌగిళ్ళు చూడాలో అని మరికొందరు వ్యాఖ్యానిస్తున్నారు. ఎవరిదృష్టివారిది.మోడీగారిదిమాత్రం అన్ని దేశాలతో సత్సంబంధాలు అని అందరికీ తెలుసు.




**ఆయుర్వేద అంటే ఏంటి?**

ఆయుర్-వేద అంటే 'జీవిత విజ్ఞానం'. మరియు ఇది నాల్గవ వేదం అయిన అధర్వ-వేదనుంచి వెలువడిన ప్రాచీన వైద్యవిధానం. మానవ చరిత్రలో లిఖించిన ప్రాచీన గ్రంథం. శరీరం, మనస్సు, ఆత్మ అన్నింటినీ ప్రశస్త మైన సమతౌల్యంతో ఉంచుతూ, మానవుల సంపూర్ణ సంక్షేమంకోసం పవిత్ర పరిష్కారంగా ఈ శాశ్వత విజ్ఞానాన్ని భగవంతుడు సృష్టించాడు.

జి. 2017లో భారతదేశం ఉత్తమ అయుర్వేద అస్పత్రిగా అవార్డు.

హెచ్. కేవలం రాష్ట్ర ప్రభుత్వ ఎమ్‌ప్యానల్డ్ హాస్పిటల్, టిఎస్, ఎ.పి.& కర్ణాటక.

ఐ. అన్ని ఇన్సూరెన్స్ కంపెనీలు క్లెయిమ్స్ పరిష్కరిస్తాయి.

జె. 65 పడకల ఆస్పత్రి మరియు బెంగళూరులో 15.

**ప్ర. K.S.A.C ఆస్పత్రిలో ఏయే వ్యాధులకు చికిత్స చేస్తారు?**

జ. జ్వరం నుంచి క్యాన్సర్‌దాకా మేము చికిత్సచేస్తాం. ఎయిడ్స్(హెచ్.ఐ.వి)కు మాదగ్గర చికిత్సలేదుకాని,వారిలో రోగనిరోధకశక్తి మెరుగవడానికి వారికి సహాయపడతాము. అది సిడి4 మరియు సిడి8 కౌంట్స్‌లో తెలుస్తుంది.

**ప్ర. ఈ ఆస్పత్రి ఎప్పుడు ఏర్పాటయింది? మరియు సామాజిక బాధ్యతలు చేపట్టారా?**

జ. మేము 1998లో అంటే 20 సంవత్సరాల క్రితం ఏర్పాటుచేశాం. మా సామాజిక బాధ్యతల్లో :

ఎ. నెలకు కనీసం రెండు ఉచిత వైద్యశిబిరాలు నిర్వహిస్తాం.



# నిజమైన ఆరోగ్యానికి ఆయుర్వేద సరైన మార్గం

**ప్ర. ఆయుర్వేద కేంద్రాలుగా చెప్పుకునే మిగతావాటికి K.S.A.C అస్పత్రి ఏ విధంగా భిన్నమైనది?**

జ. అనేక కారణాలున్నాయి కాని, కొన్నింటిని పేర్కొంటున్నాం.

ఎ. K.S.A.C ఆస్పత్రి మసాజ్‌కేంద్రంకాదు,ఇది మల్టీస్పెషాలిటీ ఆస్పత్రి.

బి. ఈ విభాగంలో తెలంగాణ & ఆంధ్రప్రదేశ్‌లలో పెద్ద అయుర్వేదిక్ ఆస్పత్రిగా ఉంది.

సి: ఆర్థో, న్యూరో, ఇఎన్‌టి, అప్తమాలజీ, గైనకాలజీ మరియు అబ్‌స్టెట్రిక్స్, పంచకర్మ, యానోరెక్టాల్, గ్యాస్ట్రో ఎంట్రాలజీ, సెక్సాలజీ, జెరియాట్రిక్స్, పీడియాట్రిక్స్, అంకాలజీ, డెర్మటాలజీ, స్పోర్ట్స్ మెడిసిన్ మొదలైన అన్ని స్పెషాలిటీలు ఉన్నాయి.

డి. భారతదేశంలోని ఉత్తమ అయుర్వేద వైద్యులు మా నిపుణుల బృందంలో ఉన్నారు.





ఇ. వందశాతం సాక్ష్యాధార చికిత్సలు. చికిత్సకు ముందు, తర్వాత వైద్య రిపోర్టులు ఆశావహ ఫలితాల విశ్లేషణకు సోదాహరణలు.

ఎఫ్. మేము తప్పుడు వాగ్దానాలు/హామీలుఇవ్వం.మాది పారదర్శక పాలసీ... మేము రోగులకు వారి సమస్య నయం అయ్యేదా? కాదా? అని స్పష్టంగా తెలియజేస్తాం. ఒకవేళ నయం అయ్యేదైతే ఏంచేయాలి...చికిత్స ప్రారంభానికి ముందే చెప్తాం.

బి. హెల్త్ ఇన్సూరెన్స్ కాని, ప్రభుత్వ రీ ఎంబర్స్‌మెంట్ సదుపాయం కాని లేని మధ్యతరగతి రోగులకు ఆర్థికసాయాన్ని అందిస్తాం.

సి. బాగా నిరుపేదలైన రోగులకు పూర్తిగా ఉచిత వైద్యం చేస్తాము.

డి. K.S.A.C హెల్ప్‌లైన్ ఉచిత కన్సల్టేషన్ ప్లాట్‌ఫారం-ఫోన్‌లో అందరికీ అందుబాటులో ఉంటుంది. ఎవరైనా 91770 04001కి కాల్ చెయ్యవచ్చు.

**ప్ర. మీరు ఇప్పటికే పేరుగాంచి, తెలుగు మాట్లాడేవారందరికీ తెలిసినవారై ఉండి స్వాతిలో మీరెందుకు కాలమ్ రాస్తున్నారు?**

జ. సింపుల్... నెలకు ఒకసారి ఇదే శీర్షికలో వారివారి ఆరోగ్యసమస్యలపై అడిగే ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వడంద్వారా స్వాతి పాఠకులందరికీ సాయపడాలని భావిస్తున్నాం. మీరు info@ayurvedaksac.comకు మెయిల్ చేయవచ్చు లేదా మా అడ్రెస్ K.S.A.C హాస్పిటల్, 63-252/1/3, తాజ్ డెక్కన్ పక్కన, బంజారా హిల్స్, హైదరాబాద్, తెలంగాణ-500 034కు రాయవచ్చు లేదా 98661 30743/98661 32743 నెంబర్లకు కాల్ చేయవచ్చు.

# డయపర్లు ఎలా మార్చాలి



ఇంట్లోకి బుడిబుడి అడుగుల బుజ్జాయి ప్రవేశించాక ఇంట్లోనివారి దినచర్య పూర్తిగా మారిపోతుంది. బిడ్డపనులతో ఊపిరి సలపదు. పాపాయికిచేయాల్సిన పనుల్లో ప్రధానమయింది డయపర్లు మార్చడం. ఇది వినడానికి, చెప్పడానికి చాలా సులువుగా అనిపించవచ్చుకాని, చేయడానికి మాత్రం బోల్డెంత పని వుంటుంది.

రోజుకు కనీసం పది డయపర్లు మార్చడం అంటే మామూలు విషయం కాదు. బిడ్డ పుట్టాక చెప్పుకోదగ్గ ప్రధాన ఆనందకర విషయాల్లో ఒకటి కాకపోవచ్చుకాని ఈ పని అవసరం, అనివార్యం.

కొత్తపని, గబుక్కున సెకన్లలో మార్చేయడానికి కుదరని పని. అయినా తప్పదు. డయపర్లు మార్చడమన్నది ఊహించినంత సులభచర్య కాదు. బయటకు వెళ్ళాల్సివచ్చినా, ఇంటికి బంధువులు వచ్చినా తనకు తానే స్వయంగా చేసుకోవాల్సిన చర్య. కొన్ని మెళుకువలు తెల్సుకుంటే పని సులువవుతుంది.

## ఎంపిక

తల్లికాబోయేవాళ్ళు ముందుగా తెలుసుకోవాల్సిన విషయం డయపర్ల ఎంపిక. మార్కెట్లలో అనేక డిస్పోజబుల్ డయపర్లు లభిస్తుంటాయి. బిడ్డకు వీటినే వాడాలన్నది మొదటిఛాయిస్. ఎలా ఆరంభించాలి? ఏకమొత్తంగా ఒకేసారి కొనాలా? ఏ సైజ్ ఎంచుకోవాలి? ఏ బ్రాండ్ కొనాలి? ప్యాంట్ స్టయిల్ ఎంచుకోవాలా? లేక స్నాప్స్ రకాలా? ఇటువంటి ప్రశ్నలు, సందేహాలు లెక్కలేనన్ని ఉంటాయి. మంచి డయపర్ ఎలా ఎంచుకోవాలో ముందుగా తెలుసుకోవాలి.

## పీల్చుకునే గుణం

డయపర్లు కొనేముందు ప్రధానంగా గుర్తుంచుకోవాల్సిన విషయం బాగా పీల్చుకునేగుణం కలిగి వుండాలి. పాపాయికి ఏమాత్రం తడిగా, అసౌకర్యంగా ఉండకూడదు. ఏ రకం డిస్పోజబుల్ డయపర్లు అయినా నీటిని పూర్తిగా పీల్చుకోగలిగివుండాలి.

ఇలా పీల్చుకుంటేనే బిడ్డకు కిందివైపు పొడిగా ఏమాత్రం తడిలేకుండా వుంటుంది. ఎక్కువ లిక్విడ్ పట్టివుంచగల రకాన్ని ఎంచుకోవాలి. యూరిన్ డయపర్‌లో ఒక్కచోట కలెక్టయితే హెవీగా వుంటుంది. అలాకాకుండా సమంగా కలెక్టవగల రకాలు చూడాలి. డయపర్లు స్ట్రెచబుల్ సపోర్ట్‌తో వుంటే, మూత్రాన్ని పీల్చుకున్నాక సైతం హెవీగా వుండవు.

## ఫిట్టింగ్

డయపర్‌ను ఎంచుకునే సమయంలో మరో ముఖ్యవిషయం సరైన ఫిట్టింగ్. సరైన్ ఫిట్ లేకపోతే లీకేజీ, డయపర్ ర్యాష్ వంటి సమస్యలు వస్తాయి. ఒకే వయస్సు, స్టేజి అయినప్పటికీ ఇద్దరు పిల్లలకు ఒకేరకం సైజ్ ఫిట్ కాదు. ఉదాహరణకు ఆర్నెల్లపాపాయికి బ్రాండ్ 'ఎ'లో చిన్నసైజ్ ఫిట్ కావచ్చు, బ్రాండ్ 'బి'లో మీడియంసైజ్ అవసరం పడొచ్చు.

ఎందుకంటే డయపర్ సైజులను చాలాభాగం బరువు ఆధారంగా కేటగిరి చేస్తుంటారు. కాబట్టి డయపర్లు కొనేముందు పాపాయి బరువు చెక్‌చేసుకోవాలి. చాలా బ్రాండ్స్ డయపర్లకు స్పష్టంగా బరువు, సైజు సూచిస్తారు. ప్యాంట్ స్టయిల్ డయపర్లు బాగా ఫిట్టయి సౌకర్యంగా వుంటాయి.

## చిన్న ప్యాకేజీ

కొత్తరకం డయపర్లు ట్రై చేయాలనుకుంటే పెద్దగా వుండే సూపర్-సేవర్ ప్యాక్స్ ఎంచుకోవద్దు. పాపాయికి సౌకర్యంగా లేకపోతే ఉపయోగం లేక వృధా అయిపోతాయి. రెండు లేదా ఐదు డయపర్లు వుండే శాంపుల్ ప్యాక్స్ లభిస్తాయి. ముందుగా ఈ చిన్న ప్యాక్స్ ప్రయత్నించి, పాపాయి అవసరాల



Courtesy : MOTHER AND BABY

కనుగుణంగా సౌకర్యంగా వుంటే అప్పుడు పెద్దప్యాక్ ఎంచుకోవచ్చు. ట్రైల్ ప్యాక్స్ తెచ్చుకుని, పరిశీలించాక పెద్దవి కొనుక్కోవచ్చు.

## డయపర్ ప్యాంట్స్

ప్యాంట్ స్టయిల్ డయపర్లు బెటర్ చాయిస్. ఎక్కువ సౌకర్యంగా ఉండి పాపాయి సున్నిత చర్మాన్ని ర్యాష్ నుంచి పరిరక్షిస్తుంటాయి.

పాపాయి పాకుతున్నా, నిలబడుతున్నా, అడుగులు వేసే ప్రయత్నాలు చేస్తున్నా ఏ పొజిషన్‌లో అయినా వీలుగా వుంటాయి. పాపాయి సహజ కదలికలకు ఏవిధంగానూ ఆటంకం కలిగించవు.



ఈ స్టయిల్‌లో సులువుగా నడవడం, పరిగెత్తడం చేయగలరు. వీటిలో అదనపు పీల్చే పొర వుండడం వల్ల లీకేజీలు ఏవీ ఉండవు.

ఎక్కువగంటలు పొడిగా, సౌకర్యంగా వుంటుంది. ఇతరరకాల డయపర్లతో పోల్చితే, ప్యాంట్‌స్టయిల్ డయపర్లు ఎక్కువ మృదువుగా వుండి, ఎక్కువగంటలు ధరించి వున్నా సౌకర్యంగా వుంటాయి.

నూతన శిశువుల కోసం ప్రత్యేకంగా లభిస్తాయి. న్యూబోర్న్-జీరో సైజ్ మూడుకిలోల బరువు గల శిశువులకు, న్యూబోర్న్ మూడు నుంచి ఐదు కిలోల బరువుగల పిల్లలకు సూటవుతాయి.

మృదువైన లోపలి షీట్, సాఫ్ట్ వేస్ట్ బ్యాండ్ నూతన శిశువులకు అవసరం. లేనట్లయితే వారి చర్మం ఎర్రగా కమిలిపోతుంది. కాబట్టి అన్నింటినీ క్షుణ్ణంగా పరిశీలించి ఎంపిక చేసుకోవాలి.

## ఆన్‌లైన్ షాపింగ్

చాలామంది రిటైలర్లు డయపర్లపై భారీ డిస్కౌంట్ కాని, కనీసమాత్రం తగ్గింపులు కాని ఇవ్వరు. ఆన్‌లైన్ షాపింగ్‌లో అనేకబ్రాండ్ల ప్రయత్నించే అవకాశం ఉంటుంది. వీటిపై డిస్కౌంట్లు ఉంటాయి. క్యాష్‌బ్యాక్ ఆఫర్లూ వుంటాయి.

అయితే, కేవలం భారీ డిస్కౌంట్ ఇస్తున్నారన్న కారణంగా ఏ బ్రాండునూ కొనవద్దు. నాణ్యమైన వాటినే ఎంపికచేసుకోవాలి. లేనట్లయితే డయపర్ ర్యాష్‌లకు అవకాశం ఉంటుంది.



## మార్చే పద్ధతులు

- బిడ్డను చేంజింగ్ మ్యాట్ లేదా టవల్ మడతపై వెల్లకిలా పడుకోబెట్టాలి. బెడ్‌పైన లేదా చేంజింగ్ టేబుల్‌పైన అయితే మార్చడానికి సౌకర్యంగా వుంటుంది. ప్యాంట్‌స్టయిల్ అయితే తీసేయడం సులువు. పక్కల చింపేసి తీసేయవచ్చు.

ఎటువంటి తాజా లీక్స్ రాకుండా చూసుకోవాలి. అదనంగా తడి ఉన్నట్లయితే బేబీ వైప్‌తో మృదువుగా తుడిచేయాలి. తన కాళ్ళు పైకి ఎత్తి, తన కిందనుంచి డయపర్ పక్కకు జరిపేసి, కిందివైపు అంతా బేబీ వైప్‌తో క్లీన్‌చేసి, టిష్యూ లేదా సాఫ్ట్ టవల్‌తో పొడిగా అద్దాలి.

ఆడపిల్ల అయితే ముందునుంచి వెనక్కు వైప్ చేయడం వల్ల క్రిములు స్ప్రెడ్ కావు.



- ఎటువంటి లీకేజీలు లేకుండా కొద్ది నిమిషాలు షీట్‌తో కవర్‌చేసి, బిడ్డను అలా వదిలేయాలి. పెట్రోలియం జెల్లీ లేదా ఏదైనా బేబీక్రీమ్ అప్లయ్ చేయడం వల్ల చర్మం మృదువుగా వుంటుంది. డయపర్ లెగ్‌హోల్స్‌ను చేతులకు తగిలించుకుని పాపాయి రెండు కాళ్ళకు తొడిగి డయపర్‌ను సింపుల్‌గా పైకి లాగేయాలి. వేస్ట్‌బ్యాండ్ సరిగ్గా ఫిట్ అయిందో లేదో చెక్ చేసుకోవాలి.



- బిడ్డను పైకెత్తి సరిగ్గా అమరిందో లేదో చెక్‌చేసుకోవాలి. ప్యాంట్ రకం డయపర్ మరీ బిగుతుగా లేకుండా జాగ్రత్తగా చూసుకోవాలి. డయపర్‌కు, బిడ్డ నడుముకు నడుమ వేలువుంచి కదిపి చూస్తే టైట్‌గా వుందో, లూజ్‌గా వుందో అర్థమవుతుంది. ఈ పనంతా టెన్షన్‌గా చేయనక్కర్లేదు. టైట్‌గా అనిపిస్తే తదుపరి సైజు ఎంచుకోవాలి.
- మురికి డయపర్ తీసేసి చేతులు శుభ్రంగా సబ్బుతో వాష్ చేసుకోవాలి.

ఇలా అవసరాన్ని బట్టి డయపర్లు కనీసం రోజులో పదిసార్లయినా మార్చాలి.

కొంచెం అలవాటయిపోతే హడావిడిపడకుండా ఐదారు నిమిషాల్లోపే డయపర్ మార్చేయవచ్చు.

బిడ్డ పరిశుభ్రత, ఆరోగ్యానికి సంబంధించిన ఈ పనిని పొరపాటున కూడా వాయిదా వేయడం కాని, రాజీపడడంకాని చెయ్యకూడదు.

వి.అనూరాధ

## కొత్త సీరియల్ ప్రారంభం

దేవకన్యలాగా మెరిసిపోతూ ఉన్న ఆమె సోఫాలో కూర్చుని ఉంది. అతను కూడా ఆమె వున్న ఆ గదిలోకి వచ్చాడు.

అతనిచేతిలో అందమైన గుండ్రటి కుండీ ఉంది. అందులో గులాబీ మొక్క ఆకులు తొడగటం మర్చిపోయి నేరుగా పూలు పూసిందా అన్నట్టు ఆ మొక్క నిండా చిన్నచిన్న ఎర్ర గులాబీపూలు విరగబూసాయ్.

# హృదయం ఎక్కడున్నది...

డాక్టర్ బొమ్మదేవర నాగకుమారి

93932 76969
E-mail: drbnagakumari@gmail.com



దూరాన్నుంచి చూస్తే చక్కటి కళాభిరుచి ఉన్న ఏ ఫ్లోరిస్టో సహజసిద్ధంగా ప్రకృతికి దగ్గరగా ఉండాలని, ఎంతో ఓపికగా కళాత్మకంగా ఈ పుష్పగుచ్ఛాన్ని తయారుచేశాడా అని అన్పిస్తుంది. కానీ సృష్టికర్తని మించిన ఫ్లోరిస్ట్ ఎక్కడుంటాడు?

అతని చేతిలో ఆ గులాబీ పూల మొక్కని చూడగానే ఆమె ముఖంలో అంతకన్నా రెట్టింపు గులాబీలు విరగబూసాయ్! ఆమెనే చూస్తూ కుడి మోకాలిమీద కూర్చున్నాడు. తన పాదాల దగ్గర కూర్చున్న అతణ్ణి చూసి ఆమె కంగారుపడింది.

"ఏయ్ విష్ణూ? ఏమిటిది?" అడుగుతూ పాదాల్ని వెనక్కి జరుపుకుంది.

అతనేమీ మాట్లాడలేదు. అలానే చిరునవ్వుతో చేతిలో పూలమొక్కతో ఆమె కళ్ళలోకి చూశాడు.

ఆమె గుండె వేగంగా కొట్టుకుంది. ఇప్పుడు విష్ణు ఏం చెప్పబోతున్నాడు? అతను ఆ పూలమొక్కని ఆమె చేతికి అందించి "నన్ను పెళ్ళి చేసుకుంటావా యశస్వీ?" అనడిగాడు ప్రేమగా, ఆర్తిగా. ఊహించని ఆ ప్రపోజల్‌కి ఆమె నోట మాట రాలేదు.

ఆ పూలమొక్కని తీసుకుని ఎడమచేత్తో తన గుండెకు హత్తుకుంది. కుడిచేత్తో అతడి జుత్తు నిమిరింది. మొత్తం ప్రపంచంలో ఎంతమంది అమ్మాయిలకు ఇంత అందమైన పెళ్ళి ప్రపోజల్ లభించి ఉంటుంది? అతనింకా పైకి లేవలేదు.

ఆమె చేతికిచ్చింది పూలమొక్కకాదు తనమనసు! తన జీవితం! తన జీవితానికి సంబంధించిన అతి ముఖ్యమైన నిర్ణయాన్ని ఆమె చెప్పబోతుంది అన్నట్టుగా ఊపిరిబిగబట్టి, రెప్పవేయకుండా అలానే ఆమెనే చూడసాగాడు.

"విష్ణూ! వచ్చి ఇటు కూర్చో!" సోఫాలో తనప్రక్కన చోటుచూపిస్తూ చెప్పిందామె.

అతను తల అడ్డంగా ఊపాడు. "నాకు నీ సమాధానం కావాలి" అడిగాడు.

ఆమెకు అర్థమైపోయింది అతను ఎందుకలా కూర్చున్నాడో? ఎప్పుడూ లేనిది పెళ్ళివిషయంలో ఎందుకింత పట్టుదలగా ఉన్నాడో? "ఇంత సడెన్‌గా, ఇంత అర్జెంట్‌గా ఏమిటీ ఈ కొత్త ప్రపోజల్?" అడిగింది.

"యశస్వీ! నాకు నువ్వు కావాలి!" ఆర్తిగా చెప్పాడు. "విష్ణు నేను నీదాన్నే కదా విష్ణూ!" మార్దవంగా అడిగింది.

"ఏమో! నాకనుమానంగా ఉంది. జీవితంలోకి కొత్తవ్యక్తులువస్తున్నారుకదా!అందుకే.." అదోలా చూస్తూ చెప్పాడతను.

అతను ఎవర్ని ఉద్దేశించి అలా మాట్లాడుతున్నాడో ఆమెకు అర్థమైంది."యశస్వీ! మనం పెళ్ళిచేసుకుంటే మన మధ్యలోకి ఇంకెవరూ రారు. నాకు నువ్వు, నీకు నేను! నువ్వు నా భార్యవయ్యాక నీవైపు తలెత్తి చూసే సాహసంకూడా ఎవరూ చేయలేరు. నామీద నీకు, నీమీద నాకు పూర్తి అధికారం వచ్చేస్తాయ్!" అతను ఆమె చెయ్యిపట్టుకుని చెప్పాడు.

"అంటే పెళ్ళి అనే 'ఉచ్చు'లో నన్ను బిగిద్దామని చూస్తున్నావా?" సూటిగా అడిగింది.

"అలా మాట్లాడకు యశూ! ఎంత ఖరీదైన సిస్టమ్‌కైనా 'యాంటీ వైరల్ ప్రోగ్రామ్' ఒకటి వేసుకోవాలి. అలానే ఎంత గొప్ప ప్రేమికులైనా పెళ్ళి చేసుకోవాలి. పెళ్ళిఅంటే కమిటెడ్‌రిలేషన్‌షిప్! అర్థంచేస్కో!" ఓపిగ్గా ఆమెకి అర్థమయ్యేలా చెప్పేప్రయత్నం చేశాడు.

"అయ్యో విష్ణూ! నీకిప్పటికే చాలాసార్లు చెప్పాను.

మళ్ళీ చెబ్తున్నా! నువ్వనుకుంటున్నట్టుగా ఎవరూ నా వెంటపడి, ప్రపోజల్ చేసి 'నువ్వు ప్రేమించి తీరాల్సిందే' అంటూ నన్ను నిర్బంధించి ఇబ్బందిపెట్టలేదు. నేనే నా ఇష్టపూర్వకంగా అతణ్ణి ప్రేమిస్తున్నాను" అని స్పష్టంగా చెప్పిందామె.

ఆమె అంత నిజాయితీగా సమాధానం చెప్పినందుకు ఎలా రియాక్ట్ కావాలో అతనికి అర్థం కాలేదు. అతనలాగే క్రింద నేలమీద కూర్చున్నాడు.

"అది కాదు యశూ! ఒకసారి మనిద్దరికీ ఒక బంధం, ఒక కమిట్‌మెంట్ అంటూ ఏర్పడితే నువ్వు కూడా ఇలా ఇంకొకరితో ఎలాంటి రిలేషన్‌షిప్‌లోకి" అంటూ ఆగిపోయాడు. అతనికి ఇంకెలా మాట్లాడాలో అర్థం కాలేదు. కళ్ళల్లో ఎన్నెన్నో ప్రశ్నలు! అతడ్ని ప్రేమిస్తున్నావా? నేన్నిన్ను మనసా వాచా కర్మణా ప్రేమించాను. జన్మజన్మలకూ నువ్వే నాదానివనుకున్నాను. మరి నన్నూ?

"విష్ణూ! నేన్నిన్ను కూడా ప్రేమిస్తున్నాను! నీకు మళ్ళీ మళ్ళీ చెప్తున్నాను. ఇదివరకటికన్నా కూడా ఇప్పుడు ఎక్కువగా నిన్ను ప్రేమిస్తున్నాను. విష్ణూ! ఐ లవ్ యూ టూ!" చెప్పిందామె.

ఇక్కడ 'టూ' అన్న పదం సుతిమెత్తని కత్తిలా గుండెను కోస్తోంది. ఆ పదానికివచ్చిన అర్థమే వేరు. అతడినీ ప్రేమిస్తున్నాను. నిన్ను కూడా ప్రేమిస్తున్నాను. గాడ్! "యశూ! నీకు తెలిసి మాట్లాడ్తున్నావో, తెలియక మాట్లాడుతున్నావో నాకు అర్థంకావట్లేదు. ఈ ప్రపంచంలో ఏ ఆడపిల్లకూడా ఒకేసారి ఇద్దరబ్బాయిల్ని ఒకే గాఢతతో, ఒకేరకంగా ప్రేమించలేదు. ఒక మనస్సులో ఇద్దరికి చోటివ్వలేదు. ఇటీజ్ జస్ట్ ఇంపాజిబుల్! అసంభవం!" అన్నాడతను.

"అలా ప్రేమించకూడదని ఎక్కడన్నా రూలుందా? ఉంటే ఉందేమో! అయినా అందరి సంగతీ నాకనవసరం. మీరిద్దరంటే నాకిష్టం! నేను మాత్రం ఈ నిమిషంలో మీ ఇద్దర్నీ ప్రేమిస్తున్నాను" ఆమె



**కొత్త సీరియల్ ప్రారంభం**

ఎలాంటి జంకూ గొంకూ లేకుండా చెప్పింది. అతను కోపాన్ని కంట్రోల్ చేసుకుంటూ చెప్పాడు "అది తప్పమ్మా!"

"తప్పు కావచ్చు, పాపం కావచ్చు కాని నేను నా మనసులో మాట నీకు చెప్పాను. అయినా నాకు తెలీక అడుగుతున్నాను. ప్రేమించటం తప్పెలా అవుతుంది?" అర్థంకానట్టే ప్రశ్నించింది.

"అదంతే! విశ్వవ్యాప్తంగా ప్రేమగురించి ఒక ప్రాథమిక సూత్రముంది. ప్రేమ కేవలం ఒక్కరిపైనే కలుగుతుంది. జన్మలో ఒక్కసారిమాత్రమే కలుగుతుంది. నువ్విలాంటి గొప్ప సూత్రాన్ని కాదంటున్నావ్! నిన్ను ఏమనాలో నాకర్థం కావట్లేదు" అసహాయంగా తల పట్టుకున్నాడు విష్ణు.

"నిజం విష్ణూ! నా మనసులో మీ ఇద్దరూ ఉన్నారు. మీ ఇద్దరినీ నేను సమానంగా ప్రేమిస్తున్నాను. ఒక్కళ్ళనే ప్రేమించటం, జీవితమంతా ఆ ఒక్కరిని మాత్రమే ప్రేమిస్తూ ఉండటం కేవలం సినిమాల్లోనూ, నవలల్లోనూ మాత్రమే సాధ్యమవుతుంది. కానీ నిజజీవితంలో ఏ అమ్మాయి కూడా అలా ఉండలేదనుకుంటా" లోతుగా ఆలోచించి చెబుతున్నట్టుగా చెప్పింది ఆమె.

అతనికి పిచ్చికోపం వచ్చింది. "నువ్వసలు స్త్రీ జాతి మొత్తాన్నీ అవమానిస్తున్నావ్!" తన కోపాన్ని అదుపులో ఉంచుకుంటూ చెప్పాడు.

"ఏమో విష్ణూ! అమ్మాయిల మనసు ఎలా ఉంటుంది? ఒకటైమ్‌లో ఒక అమ్మాయ్ మనసులో ఒక్క అబ్బాయే ఉన్నాడా?అన్నవిషయం చెప్పగలిగే 'యాప్' ఏదైనా ఉంటే అప్పుడుమనకు కరెక్ట్‌గా తెలుస్తుంది. మిగిలిన అమ్మాయిలంతా మనసు చంపుకుని బ్రతుకుతున్నారేమో?

నాకు అలా ఉండటం చేతకాలేదేమో! అయినా మనస్సులో ఒకటి పెట్టుకుని బయటకు ఒకటి మాట్లాడటం నాకు చేతకాదు"

"ఈ వాదనంతా వద్దుగానీ ఫైనల్‌గా నువ్వేమంటావ్? చెప్పు! నీకు నేను కావాలా? అతను కావాలా?" ఆమెతో వాదనపెంచుకోలేక చివరగా అడిగేశాడు. "నాకు ఇద్దరూ కావాలి. మీరిద్దరూ నా ప్రాణం!" ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయ్!

"యశస్వినీ! ఒక ప్రాణం విడివిడిగా రెండుగా ఉండలేదు. అది అసాధ్యం. ప్రాణం ఒక్కటిగా ఉంటుంది. అది ప్రకృతిధర్మం. ఎవరికైనా 'ఆత్మ' అంటే సోల్ ఒక్కటే ఉంటుంది. ఆ 'సోల్‌మేట్' ఒక్కరే ఉంటారు. అది నువ్వు ఒప్పుకుని తీరాలి" అతని మనస్సులో సముద్రాలే ఎగిసిపడుతున్నాయ్! అయినా బయటపడట్లేదు.

ఆమె బదులు చెప్పలేదు. అలా చూస్తూ ఉండిపోయింది. "విష్ణూ! ఇదంతా నీ వల్లే! ప్రేమంటే ఏమిటో నాకు తెల్సింది నీ వల్లే! నువ్వు రాకముందు నా జీవితంలో ప్రేమకు చోటెక్కడిది? నిన్ను చూసి, నువ్వు నన్ను ప్రేమించటం చూసి నేన్నీతో ప్రేమలోపడ్డాను. నిన్నుచూసి, నీ దగ్గర్నుంచి నేనుప్రేమించటం నేర్చుకున్నాను. ఈరోజున ప్రేమించటం తప్పంటున్నావ్! ఎలా నీతో?

**రాజకీయవ్యవస్థపై ఇప్పటికే ప్రజలకు నమ్మకం పోయింది. అత్యున్నత న్యాయవ్యవస్థపై నమ్మకం పోయే పరిస్థితి నెలకొంది.**

-నారాయణ, జాతీయ కార్యదర్శి సి.పి.ఐ.



సూర్యకిరణాల్లోని వెలుతుర్ని, వెన్నెలజల్లులోని వెచ్చదనాన్ని, హరివిల్లులోని అద్భుతాన్ని కలగలిపితే నువ్వు! దేవుడు ఎంతటి కరుణామయుడూ, దయార్ద్రహృదయుడూ, గొప్ప భావుకుడూ కాకపోతే నా కోసం నిన్ను సృష్టించిఉంటాడు?

తను సృష్టించిన ప్రాణికోటిని మొత్తం దేవుడు గాఢంగా ప్రేమిస్తాడట. ఎంత దేవుడైతే మాత్రం నాకంటే ఎక్కువగా నిన్ను ప్రేమించగలడంటావా?

ప్రియతమా!

ప్రతిజన్మలోనూ నేను నీతో ప్రేమలో పడుతూనే ఉన్నాను.

సీతగా, దమయంతిగా, చంద్రవతిగా, ముంతాజ్‌గా, పార్వతిగా! ప్చ్... ఒక్కోజన్మలో నీ ప్రేమని ఒక్కోరకంగా కోల్పోతూవస్తున్నాను. మళ్ళీ మళ్ళీ పుడుతూనే ఉన్నాను. మళ్ళీ మళ్ళీ...

ఇన్ని జన్మల్లో కోల్పోయిన ప్రేమను ఈ జన్మలో పరిపూర్ణంగా పొందుదామని పంతంగా దేవుడితో పందెం కట్టి మరీ వచ్చాను.

ప్రేమకు ఇంతటి విలువేంటి? అని అంతాఆశ్చర్యపోతారేమో? అవున్నిజమే. ప్రేమ నీది కాకపోతే అసలు ప్రేమకు ఇంతటి విలువేంటి? బాధకు ఇంతటి మాధుర్యమెక్కడిది. అది నీకు సంబంధించింది కాకపోతే?

ప్రేమన్నది అగోచరమైన అనుభూతులమయం! నువ్వు లేకపోవటం అంటే నాకు నేనులేకపోవటమేకదా? నిన్ను వెతుక్కోనా? నీలో నేనైన నన్ను వెతుక్కోనా ప్రియా?

పసిపిల్లలు ఆరణి పురుగుల్ని భద్రంగా దాచుకున్నట్టు, పండితులు




**మళ్ళీ మళ్ళీ వస్తుందా?**

మంచి కథ, హ్యాండ్సమ్ హీరో దొరకాలే, కాని తెలుగులో నటిస్తానంటూ ఎప్పుడో స్టేట్‌మెంట్ ఇచ్చిన శ్రద్ధాకపూర్ ఏకంగా 'బాహుబలి' ప్రభాస్‌తో కలిసి 'సాహో' అవకాశం పొంది కోరిక తీరిందంటూ ఒకటే సంబరాలుపోతోంది.

సినిమా అవకాశం వచ్చినప్పటినుంచి ఆమె ఆనందానికి అవధులు లేకుండా వుంది.

"ప్రభాస్‌తో కలిసి పనిచేయగలగడం నా అదృష్టం. గొప్ప అనుభవం" అంటూ ఆ విషయాన్ని తరచూ వల్లెవేస్తున్నది. మరి, ఒకేసారి హిందీ, తెలుగు భాషల్లో రూపొందే అవకాశం మళ్ళీమళ్ళీ వస్తుందా?

పవిత్రగ్రంథాలను కూడబెట్టినట్లు, నేను నీ జ్ఞాపకాల్ని మెత్తటి ముఖమల్ వస్త్రంలో చుట్టి, బంగారు కలశంలో దాచుకున్నాను.

**త**న ఒరిజినల్ సర్టిఫికెట్లని జిప్ ఫైల్‌లో సర్దుకుంటున్న యశస్వి వాకిట్లో కారు ఆగిన శబ్దం విన్పించటంతో "అమ్మా! నాన్నగారు వచ్చేశారు" చెప్పింది.

"ప్లేట్లు సర్దెయ్. భోజనం చేద్దాం" పద్మావతి చెప్పింది.

"ఓకే" అంటూ భోజనాల బల్లమీద నానమ్మకి, తల్లికి, తండ్రికి, తనకు నాలుగు ప్లేట్లు పెట్టింది. ఆ బల్లదగ్గర ఎవరిస్థానాల్లో వారు కూర్చుంటారు.

లోపలికి వస్తోన్న శ్రీధర్‌ని చూడగానే ఆమెకి ఒక చిలిపి ఆలోచన వచ్చింది.

"రేపటినుంచి ఈ సీట్లో ఎవరు కూర్చుంటారు నాన్నగారూ?" తన కుర్చీ చూపించి అడిగింది.

**ఒ**క్కసారిగా తల్లితండ్రులిద్దరూ గతుక్కుమన్నారు. ఆ వెలితి తలుచుకుని నానమ్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయ్. అందరికన్నా ముందుగా శ్రీధర్ తేరుకుని, "కమాన్! ఆ ప్లేస్ ఎప్పుడూ నీదే యశూ!" అంటూ నవ్వాడు.

"ఓకే! నా ప్లేస్‌లో నా టెడ్డీబేర్ బొమ్మని కూర్చోబెడతాను" అంది.

పద్మావతిలోని తల్లి హృదయం ఆర్ద్రమయింది. ఇంకా తన ఒక్కగానొక్క కూతురు ఇంకా బొమ్మలతో ఆడుకునే చిన్నపిల్లలానే కనిపించింది.

టాపిక్ మార్చటానికి అడిగాడాయన "రైల్వే వారికి నీ బైక్ హ్యాండ్ ఓవర్ చేశావా?" తనే స్వయంగా బైక్ మీద వెళ్ళి ఆ బైక్‌ని ట్రాన్స్‌పోర్ట్ విభాగంలో అప్పజెప్పి డబ్బుకట్టి, రసీదు తీసుకుని వచ్చింది.

"చేశాను నాన్నగారూ" చెప్పింది.

"గుడ్! భోంచేద్దాం రండి" ఆయన చేతులు కడుక్కుని వచ్చాడు. అందరూ భోజనాల బల్ల చుట్టూరా కూర్చున్నారు.

"ఇంకొంచెం కూర వేసుకో! మళ్ళీ ఎప్పటికో ఇంటి భోజనం, మన కూరలు? ఆ కర్ణాటక వెళ్తున్నావు. అక్కడంతా బిసిబేళాబాత్, మరమరాలతో చేసే ఉగ్గాణి, అటుకులతో చేసే పోహా, మైగాడ్! అవన్నీ ఎలా తింటావో? ఎలా ఉంటావో? ఇంకా ఎంత చిక్కిపోతావో?" పద్మావతి బెంగగా అంది.

"రోమ్‌లో ఉన్నప్పుడు రోమన్‌లాగా ఉండమన్నారు. కర్ణాటకలో ఉన్నప్పుడు తెలుగు అమ్మాయ్ అయినా కన్నడ అమ్మాయిలా ఉండమని అమ్మకి ఎవరూ చెప్పలేదా నాన్నగారూ?" అంటూ తండ్రివైపు తిరిగింది. పద్మావతి రేపటినుంచి భోజనాల బల్ల దగ్గర ఈ సందడి, కోలాహలం ఉండవు! అని తలచుకుంటేనే వాళ్ళందరికీ గుబులుగా ఉంది. రెక్కలు వచ్చిన పక్షులు ఎగరటం సహజమే!

ఇంకా తన వయసు అమ్మాయిలంతా అమెరికా, ఆస్ట్రేలియా, ఇంగ్లాండ్ అంటూ విదేశాలకు కూడా రివ్వున ఎగిరిపోతున్నారు. తను వెళుతున్నది బెంగళూరే కదాని సర్దిచెప్పుకున్నారు.

క్యాంపస్ ప్లేస్‌మెంట్స్‌లో యశస్వినికి ఓ పెద్ద బహుళజాతి సంస్థలో ఉద్యోగం వచ్చింది. బెంగళూరులో ఆరునెలల పాటు ట్రైనింగ్ ఉంటుంది. ఈ రోజే బెంగళూరు ప్రయాణం.

అందుకే ఇంత హడావుడి! తను బెంగళూరు వెళ్ళాల్సిన తేదీ నిర్ణయమైనప్పటి నుంచి ఇంట్లో అందరూ అదోవిధంగా ఉంటున్నారన్న సంగతి ఆమెకూ అర్థమయ్యింది.

భోజనాలు పూర్తయ్యి బయటికి వచ్చాక నానమ్మ వైపు పరిశీలనగా చూసింది. ఆవిడ దుఃఖాన్ని బలవంతంగా ఆపుకుంటున్నట్టుగా ఉంది.

ఆవిడ దగ్గరకు వెళ్ళి "నానమ్మా! నేను బెంగళూరు వెళ్ళిపోతే నువ్వు బెంగ పెట్టుకుంటావు కదా?"

"బెంగ ఎందుకు? నిన్ను చూస్తుంటేనాకు గర్వంగాఉంది. నిన్నా మొన్నా పుట్టిన నా చిట్టి మనవరాలు అప్పుడే ఉద్యోగం చేయటానికి వెళ్తుంది.

నీకు తెల్సా? మీ తాతగారికి పెళ్ళినాటికి ఉద్యోగమే లేదు. మీ నాన్న కూడా నీలాగే ఇంజనీరింగ్ చదువుకున్నా మళ్ళా ఓ నాలుగేళ్ళు ఇంట్లోనే కూర్చుని కాలేజీకి వెళ్ళి చదువుకున్నప్పటికంటే ఇంకా గట్టిగా చదివేసుకుని పోద్దస్తమానమూ పరీక్షలు రాసి ఉద్యోగం తెచ్చుకున్నాడు.

అందుకే వాడికి ఉద్యోగం వచ్చేదాకా నేను పెళ్ళి చేయలేదు. నువ్వు బంగారు తల్లివి. నువ్వు ఇంకా కాలేజీలో చదువుకుంటూండగానే నీకు ఉద్యోగం వచ్చేసింది. ఎంతైనా నువ్వు నా మనవరాలివి!" గొప్పగా చెప్పింది కానీ ఆవిడ గొంతు దుఃఖభారంతో కాబోలు కొద్దిగా వణుకుతోంది.

**య**శస్వి నవ్వేసి, మళ్ళీ ఒకసారి 'చెక్ లిస్ట్' తీసుకుని సర్దుకున్న సామాన్లని సరిచూసుకుంది. అటు తల్లి, తండ్రి, నానమ్మ అందరూ కలిసి ఎవరికి తోచిన వస్తువులను వారు ప్యాక్ చేస్తున్నారు. యశస్వి మళ్ళీ నానమ్మ వైపు చూసింది.

ఆవిడ జాగ్రత్తగా చేతిలో ఉన్న ప్లాస్టిక్ డబ్బాలోకి కారప్పొడిని నింపుతోంది. కదిలిస్తే ఎమోషనల్ అయిపోయేలా ఉంది. అమ్మానాన్నా ఇద్దరూ ఉద్యోగాలకు వెళితే నానమ్మ తనని చిన్నప్పటినుంచి రాకుమారిని చేసి ఎన్నెన్నో కథలు చెప్తూ పెంచింది.

ఆవిడ ప్రక్కన కూర్చొని ఆవిడ భుజాల చుట్టూ చేతులు వేసి "ఇక నుంచి నాకు కథలు చెప్పవా?" అని అడిగింది యశస్వి.

"పోవే! ఎలాగూ నన్ను వదిలేసి వెళ్ళిపోతున్నావు కదా!" ఆవిడ నిష్ఠూరంగా అంది.

తన చేతిలో ఉన్న ఐపాడ్‌ని నానమ్మకు చూపిస్తూ "నానమ్మా! ఇప్పుడు సాంకేతికపరంగా మనమెంతో

'ఇజం' పిల్ల అదితి ఆర్య 'నన్ను వదిలి నీవు పోలేవులే' సినిమాలో ఐటిఅమ్మాయిగా కన్పించనున్నది. "నాది సాఫ్ట్‌వేర్ ఇంజినీర్ పాత్ర. 'ఇజమ్' సినిమాలో పాత్రకు పూర్తిగా భిన్నమైనది. పాశ్చాత్య, సంప్రదాయ దుస్తులు రెండూ ధరించాల్సి ఉంటుంది.

జీవితంలో మొదటిసారిగా ఈ సినిమాకోసం లంగా ఓణీ ధరించాను. భలే సరదాగా అనిపించింది. హిందీ వెబ్ సిరీస్ 'స్పాట్‌లైట్ 2' కూడా చేస్తున్నా. సినిమాలు, వెబ్ సిరీస్ నడుమ ప్రయాణం గొప్ప అభ్యాస అనుభవంగా వుంది. చేసిన నాలుగుప్రాజెక్టులూ ఎంతో సంతృప్తినిచ్చాయి. దక్షిణాదిలోని అవకాశాలకు సదా కృతజ్ఞురాలిని' అంటూ ఉత్సాహంగా తెలిపింది.





రాబోయే రోజుల్లో హెల్త్‌కేర్, రియల్ ఎస్టేట్, విద్య, 5జి వ్యవసాయరంగాలు ప్రతి భారతీయుని జీవితంపై ప్రభావం చూపుతాయి.

-ఆకాశ్ అంబానీ,
రిలయన్స్ జియో డైరెక్టర్



## అనుకరణలో ఓవర్

ఈమధ్య విడుదలైన కీర్తిసురేష్ సినిమాలు చూస్తుంటే నవ్వులో, మూతి తిప్పడంలో, కళ్ళెగరేయడంలో అనేకమంది ప్రేక్షకులకు 'మహానటి' సావిత్రి గుర్తుకువచ్చింది.

'మహానటి' సినిమాలో నటిస్తున్న కీర్తి అదే పనిగా సావిత్రి సినిమాలు చూసేసిందేమో, హావభావాల్లో ఆమెనే అనుకరించే ప్రయత్నాలు 'అజ్ఞాతవాసి' ఆరంభ సన్నివేశాల్లో మరీ ఎక్కువ కనిపించాయి. తదుపరి సన్నివేశాల్లో అనుకరణను కాస్తంత తగ్గించిందనుకోండి.

ఆమెను అనుకరించడమే కాదు, సావిత్రి లక్షణాలనూ పాటిస్తున్నదట. సావిత్రికి సెట్‌లోనివారికి హఠాత్తుగా ఏవో ఒక బహుమతులు ఇవ్వడం అలవాటు. ఒక్కోసారి బంగారు నాణేలుకూడా ఇచ్చేది. ఇప్పుడు కీర్తి అదే పని చేసింది. 'మహానటి' సెట్‌లోనివారికి బంగారు నాణేలు బహుమతిగా ఇచ్చింది. మరీ ఇంత అతిఅనుకరణలు అవసరమా.

ముందుకెళుతున్నాం. దూరం సమస్య కానే కాదు. మనిషితో మనిషి మాట్లాడుకోవటం ఎంతో ఈజీ.

వాట్సాప్, స్కైప్, వీడియో కాలింగ్ ఇన్ని ఉండగా ఒకరిమీద ఒకరు బెంగపెట్టుకోవలసిన అవసరమే లేదు. ఎప్పుడు కావాలంటే అప్పుడు ఇదిగో ఇలా ఒకరినొకరం చూస్తూ మాట్లాడుకోవచ్చు. నీకు ఇవన్నీ నేర్పించాను కదా?" గారాబంగా అడిగింది.

"కాని ఒకరినొకరు ఇలా దగ్గరకు తీసుకోవాలన్నా, ముద్దుపెట్టుకోవాలన్నా ఎలాగే మరి?" నానమ్మ ప్రశ్నకు ఆమె దగ్గరే కాదు, ప్రపంచంలో ఎవరి దగ్గరా జవాబు లేదు.

అదే ఐపాడ్‌ని చూపించి, "దీనిమూలంగానే మనం ఒకరికొకరం దూరమవుతున్నాం" నానమ్మ తిరుగు లేని సమాధానం చెప్పింది.

"ఉండు నానమ్మా! మనిద్దరం ఒక ఫోటో తీసుకుందాం" అంది యశస్విని.

"ఇదో సంబడం!" ఆవిడ విసుక్కుంటూనే, మురిపెంగా జుత్తు సర్దుకుంది.

సెల్ఫీ తీసుకున్నాక "నువ్వెప్పుడూ మమ్మల్ని వదిలి ఉండలేదు. ఇప్పుడు నువ్వెళ్ళి ఒంటరిగా..." అంటూన్న ఆవిడని మధ్యలోనే ఆపేసి-

"అయ్యో! భలేదానివే నానమ్మా! ఒంటరిగా ఉంటానికి నేనేమన్నా జైలుకి వెళుతున్నానా?

ఉద్యోగం చేయటానికి వెళుతున్నాను. నాలాంటివాళ్ళు అక్కడ నూట యాభై మంది ఉంటారు. నాతోపాటు మా కాలేజీ నుంచి ఎంపికైనవాళ్ళు ఇంకా నలుగురున్నారు.

మా సీనియర్స్ అదే ఆఫీస్‌లో పని చేస్తున్నారు. నేను బెంగళూరులో నాకు తెల్సిన ఒక సీనియర్‌తో కల్సి ఓ డీలక్స్ ఫ్లాట్‌లో ఉండబోతున్నాను. నీకు భయమే అక్కర్లేదు" గబగబ చెప్పేసింది.

"అయినా నాకు తెలీకడుగుతాను. ఇంత పెద్ద పట్టణంలో నీకు ఉద్యోగమే రాదా?" నానమ్మ అడిగింది. ఇంకా ఆవిడలో ఏదో అసంతృప్తి!

"అలా అడగండి అత్తయ్యా! నేను ముందునుంచీ చెబుతూనే ఉన్నాను. ఇంకో రెండేళ్ళన్నా పై చదువులు చదువుకోమని..." పద్మావతి కినుకగా అంది.

ఆమెకి అప్పుడే ఆ అమ్మాయి ఉద్యోగం చేయటం అస్సలు ఇష్టం లేదు.

"అమ్మా! నేను తప్పకుండా మాస్టర్స్ చేస్తాను. కానీ ఇప్పుడు కాదు. నేను ఇంతకాలం చదువుకున్నదేమిటో, అది ప్రాక్టికల్‌గా ఎలా ఉపయోగపడుతుందో నన్నర్థంచేసుకోనీ! నాకే సబ్జెక్ట్‌లో ఇంట్రెస్ట్ ఉందో నన్ను డిసైడ్ చేసుకోనీ! మార్కెట్‌లో డిమాండ్‌ని బట్టి ఆ సబ్జెక్ట్‌లో మాస్టర్స్ చేస్తాను"

"పోనీ ఇక్కడే ఏదన్నా కోచింగ్ తీసుకుని ఎంచక్కా బ్యాంక్ పరీక్షలు రాసి..." అంటూ ఇంకా ఏదో అనబోయింది పద్మావతి.

"అమ్మా! ఇంజనీరింగ్ విభాగం వేరు, బ్యాంకింగ్ విభాగం వేరు! ఆ చదువు చదివి ఈ ఉద్యోగం చేయటం ఏమిటి? జస్ట్ ఎబ్సర్డ్! అస్సలు నన్నడిగితే ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్స్‌ని బ్యాంక్ పరీక్షలు రాయకూడదని ఓ రూల్ పెట్టాలి" చిరాగ్గా చెప్పింది యశస్వి.

"అయ్యో రామా!" అంటూ ఆమె నుదుటి మీద కొట్టుకుంది.

"ఇప్పుడు ఈ వాదోపవాదాలన్నీ అవసరమా? ఈ టైమ్‌లో అయినా కాస్త ప్లెజెంట్‌గా మాట్లాడుకోవచ్చు కదా!" శ్రీధర్ అన్నాడు.

ఎవరూ బదులు చెప్పలేదు. యశస్విని హాల్లో ఆ గోడ దగ్గరికి వెళ్ళింది. ఆ గోడ అంటే ఆమెకి చాలా ఇష్టం. ప్రత్యేకంగా ఆ గోడకు నారింజరంగు పెయింట్ వేయించి, ఆ గోడ మీద బోలెడన్ని ఫోటోలు లామినేషన్ చేయించిపెట్టారు.

అవన్నీ వివిధ సందర్భాల్లో తీసిన రకరకాల ఫోటోలు! ఒక ఫోటోలో నానమ్మ, తాతయ్య, (చిన్నప్పటి) నాన్న, ఇంకో ఫోటోలో అమ్మమ్మ, తాతయ్య, (చిన్నప్పటి) అమ్మ, అమ్మానాన్నల పెళ్ళిఫోటో, మరో ఫోటోలో అమ్మా, నాన్నా, తను, తను డ్యాన్స్ చేస్తున్న ఫోటో, ప్రైజ్‌లు అందుకుంటున్న ఫోటోలు, పుట్టిన రోజు నాడు కేక్ కట్ చేస్తున్న ఫోటో... అలానే ఇంకా చాలా ఫోటోలు ఉన్నాయి.

అన్నింటినీ ఒకసారి చేత్తో తడిమి చూసింది. ఆ గోడముందు నిలబడితే చాలు 'టైమ్ మెషీన్'లో కూర్చుని జీవితంలో వెనక్కంటా వెళ్ళి మళ్ళీ ముందుకు వచ్చినంత ఆనందం కలుగుతుంది. అక్కడ నిలబడి ఒక సెల్ఫీ తీసుకుంది. తన మొబైల్‌లో ఆ ఫోటోని జూమ్ చేసి చూసుకుంది.

ఆమె పెదవులపై చిరునవ్వు మెరిసింది. అందర్నీ తన వెనక నిలబడమని మరో సెల్ఫీ తీసుకుంది.

తన ముఖానికి తగిలిన ఆమె జుత్తుని ఓ పక్కగా జరుపుతూ "ఈ జుత్తుని ఇలా రెండు పాయలన్నా అల్లుకోవచ్చు కదమ్మా!" అడిగిందావిడ.

"అయ్యో నానమ్మా! ఇప్పుడిదే ఫ్యాషన్! నేను కాబట్టి క్లిప్ పెట్టుకున్నా కానీ అస్సలైతే అందరూ జుత్తు ఇలా వదిలేసుకుంటున్నారు" తన జుత్తుని ఒక్కసారి విరబోసుకుని మరీ చూపించింది.

"ఆ కాలంలో ఒక్క ద్రౌపది జుత్తు విరబోసుకున్నందుకే కురుక్షేత్రయుద్ధం జరిగింది.

ఇప్పుడింతమంది ఆడపిల్లలు ఇలా జుత్తు విరబోసుకుంటున్నారు. ఈ ప్రపంచం ఎటుపోతుందో?" గొణుక్కుందావిడ.

"బయల్దేరదామా?" అని శ్రీధర్ అడిగాడు.

ఇంకా ఉంది

నాణ్యమైన వైద్యం కావాలంటే భారీఖర్చులను భరించాల్సిందే.

-డా॥ ప్రతాప్ సి.రెడ్డి, అపోలో ఆస్పత్రుల ఛైర్మన్





### పర్సనల్ ఎజెండా

# హ్యూమాఖురేషి

థియేటర్, మోడలింగ్ ఎసైన్‌మెంట్లు, అక్కడి నుంచి సినిమా- ఇదీ హ్యూమాఖురేషి పయనం. 2012లో అనురాగ్ కాశ్యప్ ఆమెను గుర్తించాడు.

'గ్యాంగ్స్ ఆఫ్ వాస్సెపుర్'తో చిత్రసీమకు పరిచయం అయింది. శక్తివంచనలేకుండా కృషిచేసి, నటిగా ప్రతిభ చాటుకున్నది.

సపోర్టింగ్ రోల్‌కు ఉత్తమనటిగా ఫిల్మ్‌ఫేర్ అవార్డు నామినేషన్ దక్కించుకున్నది.

ఆమె వ్యక్తిగత అభిప్రాయాలు, విశేషాలు.

▸ **నాకు మొదటినుంచి :** గ్లామర్ పరిశ్రమపట్ల ఫ్యాసినేషన్ ఉంది

▸ **నేను చెప్పని, నాకు నచ్చని మాటలు :** పలానా నిర్మాతకు, పలానా దర్శకుడికి ఎవరో నా పోర్ట్ ఫోలియో పంపారు.ఇది నేను ప్లాన్‌చేసుకోలేదు. అలా జరిగిపోయిందిలాంటి మాటలు

▸ **నాకు మొదటినుంచీ :** సినిమాలంటే అమితమైన ఆసక్తి ఉంది. ఏ సినిమాలు చూడదలుచుకున్నా చూసేస్తుంటా. చిన్నప్పుడు లెక్కలేనన్ని సినిమాలు చూశాను

▸ **మొదటి చిత్రంలో బీహారీ యాసలో మాట్లాడడం :** నాకు కష్టం కాలేదు. ఎందుకంటే నేను చాలా బాగా మిమిక్రీ చెయ్యగలను. ఎవరితోనైనా కొద్దిసేపు కూర్చున్నా, వెంటనే వారిమాదిరి మాట్లాడేయగలను

▸ **తదుపరి రెండు సినిమాలు :** 2015 నాటికి 'బద్లాపూర్' ఓ ఛాలెంజ్ కాగా, 2014 నాటి 'డేఢ్ ఇష్కియా' కూడా అలాగే ఉంది.

ఈ రెండు సినిమాలు కూడా అవార్డులకు నామినేట్ అయ్యాయి

▸ **అవార్డులనేవి :** చేసే పనికి తిరుగులేని గుర్తింపు లాంటివే. మరింత డబ్బు, మరిన్ని సినిమాలకు మార్గం మాత్రమే సుగమం కాదు.

సినిమాలు ఎంపిక చేసుకునే విషయంలో బాధ్యత కూడా బాగా ఇనుమడిస్తుంది

▸ **నేను సినిమాల్లోకి వెళ్తాననడం :** మా నాన్న గారికి రుచించలేదు. ఆయన ఢిల్లీలో సలీమ్ అన్న పేరుతో చైన్ రెస్టారెంట్ నడుపుతారు.

వద్దనలేదు కాని, ఈ అస్థిరమైన రంగంలో నా భవిష్యత్ ఎలా ఉంటుందోనని భయపడ్డారు.

ఎబిఎలాంటి ఎకడమిక్స్ ఏవైనా చేస్తే బావుంటుందని భావించారు

▸ **మా వ్యాపారం, నేపథ్యం :** ఆహారానికి సంబంధించి అవికూడా భారీగా ఉండే మొఘలాయి పదార్థాలు. బరువుకు సంబంధించిన సమస్యలు ఉండడం ఆశ్చర్యం కాకపోవచ్చు కాని, నాకు ఆకృతికి సంబంధించిన సమస్యలు లేవు

▸ **నా ఆహారం విషయంలో :** చాలా జాగ్రత్తగా వుంటాను. చాలాభాగం సలాడ్లు, గ్రీన్స్ మాత్రం నా ఆహారంలో వుంటాయి.

చక్కెరలు, సోడా, గ్లుటెన్‌లకు, ప్రిజర్వేటివ్‌లు, ఆల్కాహాల్‌కు దూరంగా వుంటుంటా

▸ **వంట చేయడం :** కుటుంబ నేపథ్యం రెస్టారెంట్ కాబట్టి, నాకు కావాల్సినవి నేను తయారుచేసుకోవడం నాకు పెద్ద కష్టం కాదు

▸ **గొప్ప ఆఫర్ :** రజనీకాంత్ నటించే 'కాలకరికాలన్'లో అవకాశంపొంది తమిళనాట ప్రవేశించడం

▸ **నేను అనేకమంది :** గొప్ప దర్శకులతో పనిచేయగలిగాను. 'గ్యాంగ్స్ ఆఫ్ వాస్సెపుర్' సినిమా నాకీ అవకాశాలకు మార్గాన్ని ఇచ్చింది

▸ **నా దృష్టిలో వివాహం అంటే :** గొప్ప వ్యవస్థకు మించినది

▸ **ఓ వ్యక్తిగా :** నేను చాలా ఎమోషనల్

▸ **నా దృష్టిలో బాలీవుడ్‌లో స్టయిలిష్ తార :** సోనమ్‌కపూర్

▸ **నా ఫేవరెట్ డ్రెస్ :** ట్రాక్స్, టీషర్టులు

▸ **తప్పనిసరిగా కావాల్సినవి :** హైహీల్స్, మంచి బ్యాగ్, జీన్స్, బ్లాక్‌డ్రెస్, బ్లాక్ మ్యాక్సీ



అనిల్



# Malaysia

A sultan is a ruler in a Muslim country. Malaysia is the country with the most sultans. It has nine sultans!

## Melaka

In Melaka, there are old European buildings built by the Dutch, the British and the Portuguese.



## kampung house

Some people live in kampung houses made of wood and attap.

Fishermen live in kelongs built above the sea, with fishing nets to catch the fish that swim by.



There are many kinds of buildings in Malaysia. In the city, you can see tall buildings like the Petronas Towers.

## Petronas Towers



## kelong

## Cinta Sayang dance

In the Cinta Sayang dance, fishermen's wives with them good luck and hope for them to return home safely from their fishing.

Marshall Cavendish Education



## satay

Mmm... I smell satay cooking! Satay is meat cooked over charcoal and eaten with yummy peanut sauce.



## Hari Raya Aidilfitri

After fasting for a month, Muslims celebrate Hari Raya Aidilfitri. Children ask their elders for forgiveness and everyone wears new clothes to celebrate.

Shh! The giant turtle is laying her eggs on the beach. Be very quiet, or she will go away.

## giant turtle






# మతిలేని సాక్ష్యం

ఒక వ్యాపారి వ్యాపారం నిమిత్తం దూరదేశానికి పోతూ పొద్దుకూకే వేళకు ఒక గ్రామం చేరుకున్నాడు. ఆ రాత్రి ఆ గ్రామంలోనే గడుపుదామని నిశ్చయించి వ్యాపారి తనగుర్రాన్ని గ్రామంకేసి నడిపిస్తూ ఉండగా దారిలో ఒక మనిషి ఎదురు వచ్చి "అయ్యా నాలుగు అణాలిప్పించండి.

నాకు నల్లమందు అలవాటుంది. రెండు రోజుల నుంచీ నా దగ్గర కానీ కూడా లేక చాలా బాధపడుతున్నాను" అన్నాడు.



వాడికి నాలుగణాలిచ్చి పంపేసి వ్యాపారి ఊళ్ళోకి వెళ్ళాడు. ఒక ఇంటిముందు గుర్రం దిగి, ఇంటి యజమానిని ఆ రాత్రికి అక్కడ పడుకోనివ్వమన్నాడు. ఇంటి యజమాని ఒప్పుకున్నాడు.

వ్యాపారి తన గుర్రాన్ని ఇంటి బయట ఉన్న కట్టుకొయ్యకు కట్టేసి ఆ రాత్రి ఆ ఇంటనే పడుకున్నాడు. వ్యాపారి తెల్లవారి లేచి తిరిగి ప్రయాణం సాగిద్దామని బయటికి వచ్చేసరికి, అతని గుర్రాన్ని ఇంటి యజమాని ఎక్కడికో తోలుకుని పోబోతున్నాడు.

"అయ్యా, నేను వెళ్ళిపోబోతున్నాను. దయచేసి నా గుర్రాన్ని ఎటూ తీసుకుపోకండి" అని వ్యాపారి ఇంటి యజమానికి హెచ్చరించాడు.

ఇంటి యజమాని ఆశ్చర్యంతో, "ఇది నా గుర్రం. నా ఇంటిముందున్న కట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడుతుంది" అన్నాడు.

"అయ్యా, నా గుర్రాన్ని హరించటానికి యత్నిస్తున్నారు. ఇది న్యాయం కాదు" అన్నాడు వ్యాపారి.

"నామాట నమ్మకం లేకపోతే, ఈ ఊళ్ళో ఎవరినన్నా అడుగు. మా ఇంటి కట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడుతుందని అందరికీ తెలుసు" అన్నాడు ఇంటి యజమాని.

ఆ మనిషి పచ్చిదొంగ. ఆ ఊళ్ళో చాలామంది అతనిలాంటివాళ్ళే. తెలియక పొరుగూరివాడు వస్తే అందరూ కలిసి మోసం చేస్తూ ఉంటారు. అందుచేత, అందరూ ఆ యజమాని చెప్పినదాన్నే బలపరిచారు. ఇక చేసేదిలేక వ్యాపారి గ్రామాధికారి వద్దకు పోయి ఇంటి యజమానిపై ఫిర్యాదు చేశాడు. గ్రామాధికారి ఇంటి యజమానిని పిలిపించి అడిగాడు.

"చిత్తం, మా ఇంటికట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడుతుందండి. కావలిస్తే బోలెడుమంది చేత సాక్ష్యం ఇప్పించగలను" అన్నాడు ఇంటి యజమాని.

"ఏమయ్యా? ఈ గుర్రం నీదేనని నీకెవరైనా సాక్షులున్నారా? ఉంటే తెచ్చుకో!" అన్నాడు గ్రామాధికారి వ్యాపారితో.

సేకరణ : చందమామ రావే

కిందటి సాయంకాలం నల్లమందుకోసం తన వద్ద నాలుగణాలు పుచ్చుకొన్న మనిషి సంగతి జ్ఞాపకం వచ్చి వ్యాపారి అతన్ని వెతుక్కుంటూ వెళ్ళాడు. ఈలోగా ఇంటి యజమాని కూడా తనవైపు సాక్ష్యం చెప్పేవారిని తీసుకురావటానికి వెళ్ళాడు. వ్యాపారిదగ్గర నాలుగణాలు పుచ్చుకున్న మనిషి నల్లమందు మత్తులోనే ఉన్నాడు. వ్యాపారి ఆ నల్లమందు భాయీని కష్టపడి లేపి తనకు జరిగిన అన్యాయాన్ని గురించి చెప్పాడు.

అది వినగానే ఆ నల్లమందు భాయి వ్యాపారి వెంట న్యాయాధికారివున్న చోటుకు వచ్చాడు.

అప్పటికే ఇంటియజమాని తన సాక్షులను తెచ్చి గ్రామాధికారి ఎదుటపెట్టి, తన ఇంటి కట్టుకొయ్య రోజుకొక గుర్రాన్ని పెడుతుందని సాక్ష్యం చెప్పిస్తున్నాడు. నల్లమందు భాయీని చూడగానే ఇంటి యజమాని సాక్షులు బిగ్గరగా నవ్వి-

"వెతికి వెతికి ఈ నల్లమందు భాయీనా సాక్ష్యం తెచ్చావు? వీడి మాట ఎవరు నమ్ముతారు?" అని వ్యాపారిని చూసి గేలిచేశారు.

మత్తు పూర్తిగా పోక ఆవలిస్తున్న నల్లమందు భాయీని చూసి గ్రామాధికారి కూడా "ఏమయ్యా, బాగా నల్లమందు మత్తులో ఉన్నట్టున్నావు. అలాంటి నీ సాక్ష్యం ఎలా ఆమోదించేది?" అన్నాడు.

దానికి నల్లమందు భాయీ తడుపుకోకుండా, "అయ్యా, నేను మత్తులో లేను. రాత్రల్లా చెరువు అడుగున మంటచేసి చెరువులో చేపల్ని ఉడకపెట్టాను. కన్నుమూస్తే ఒట్టు. అందుచేత నిద్రమత్తుగా ఉంది. అంతే!" అన్నాడు.

ఈ మాటకు అందరితోబాటు గ్రామాధికారికూడా నవ్వి "నీది మతిలేని సాక్ష్యమని నీ మాటలే రుజావు చేస్తున్నాయి. చెరువుకింద ఎవరన్నా మంటచేస్తారా?" అని అడిగాడు.

"అదేమిటండీ? కట్టుకొయ్యలు గుర్రాలనీనగా లేందీ, చెరువుకింద మంటబెట్టటం అబ్బురమా? నాదా మతిలేని సాక్ష్యం?" అని అడిగాడు నల్లమందు భాయీ. ఈ మాటకు గ్రామాధికారి సిగ్గుపడి, వ్యాపారి గుర్రాన్ని వ్యాపారికిప్పించి, ఇంటి యజమానిని గట్టిగా హెచ్చరించాడు.

టి.నాగరాజు






# సెల్ఫ్ గోల్

"హలో! హలో! హలో!!

"హలో! ఎ టు జెడ్ ఈవెంట్ మేనేజర్స్" అన్నాడు భూలోకం.

"నా పేరు హరి అండీ! నేను యు.ఎస్ నుండి మాట్లాడుతున్నా" అన్నాడు అవతలివ్యక్తి.

"చెప్పండి సార్! ఏం కావాలి?"

"మా అమ్మగారికి ఎనభై ఐదేళ్ళు. సహస్ర చంద్ర పౌర్ణమి దర్శనం కూడా అయిపోయింది.

"అయితే?"

"ఆవిడ ఆరోగ్యం ఏ మాత్రం బాగోలేదట. నాకు తరచూ ఫోన్లు. నాకు ఇండియా వచ్చి అమ్మను చూసేంత తీరిక లేదు. ఆమె మహాప్రస్థానం మాత్రం చాలా గ్రాండుగా జరగాలి. అది నేను కుటుంబ సమేతంగా జన్మధన్యమయ్యేలా స్కైప్‌ద్వారా లైవ్‌చూడాలి" అన్నాడు హరి తల్లి మీద ప్రేమ ఒలకపోస్తూ.

"అమ్మగారి పేరు?" "మంగమ్మ గారు"

"ఎక్కడ ఉన్నారు?" "వృద్ధాశ్రమంలో"

"అంటే... మంగమ్మగారి మహాప్రస్థానం... అదే కద మీరు మాకు ఇచ్చే ఈవెంటు?"

"యస్! పేకేజీ మొత్తం ఎంతవుతుందో చెప్పండి. మా తమ్ముడు నారాయణ అక్కడే ఉన్నాడు గానీ... వాడో యూజ్‌లెస్ ఫెలో.అందుచేత ఆఖరి ప్రయాణం అయినా గ్రాండుగా జరగాలని"

"ఒక్క నిమిషం" అని కంప్యూటర్ ఓపెన్ చేసి టారిఫ్ చూశాడు భూలోకం.

"మహాప్రస్థానం అయితే లక్షాపదివేలండీ! టెన్ పర్సంట్ డిస్కౌంట్ పోతే తొంభై తొమ్మిది వేలు. యాభై శాతం ముందు, మిగతా ఎమౌంట్ కార్యక్రమం నాడు ఇవ్వాలి. ద్వాదశ కార్యక్రమాలు, దశ దానాలు అయితే మరో లక్ష" అన్నాడు.

"ఓకె! ఓకె! మా అమ్మగారు 'హరీ' అనగానే ఆశ్రమం వాళ్ళు మీకు ఫోన్ చేస్తారు.

మీరు కార్యక్రమాలన్నీ సంప్రదాయ బద్ధంగా, శాస్త్రోక్తంగా జరిపించాలి.స్కైప్‌లో లైవ్ అరేంజ్ చెయ్యాలి" "మీకు సిడి కూడా ఇస్తాం సరేనా?" అన్నాడు భూలోకం.

"ఓకె! మీ అకౌంట్ నెంబరు మెసేజ్ పెట్టండి. ఎమౌంట్ అకౌంటులో వేస్తాను. సెలవ్"

నాలుగు రోజులు గడిచింది. హరి నుంచి గానీ, ఆశ్రమం నుంచిగానీ మంగమ్మగారి గురించి ఏ శుభవార్తా భూలోకానికి రాలేదు.

ఇవాళో రేపో అన్నట్లున్న వ్యక్తి ఇలా వాయిదావేస్తే ఎలా? దేనికైనా ఓ పద్ధతుండాలి కదా!

అన్ని రకాల మనుష్యులను, వస్తువుల్ని ఏర్పాటు చేసి కూర్చున్నాడు తను. ఇక లాభం లేదని ఆశ్రమానికితానే ఫోన్‌చేశాడు.అవతల మేనేజర్ ఫోన్‌ఎత్తాడు. "సార్! నేను ఎ టు జెడ్ ఈవెంట్ మేనేజర్ భూలోకాన్ని మాట్లాడుతున్నాను. మంగమ్మగారు ఎప్పుడు పోతారో చెప్పగలరా?" అన్నాడు భూలోకం.

"ఆహా! కలికాలం. ఎవరైనా 'ఎలా ఉన్నారు?' అనడుగుతారు. తమరెప్పుడు పోతారు?' అన్నారు డైరెక్ట్‌గా. సరే! ఏ మంగమ్మగారు?"

విరించి

"ఎనభై అయిదేళ్ళుంటాయి... ఆవిడ సార్!"

"మా దగ్గర ముగ్గురు మంగమ్మలున్నారు. ముగ్గురికీ ఎనభై ఏళ్ళు దాటాయి"

గతుక్కుమన్నాడు భూలోకం.

"ఆవిడ కొడుకు అమెరికాలో ఉంటాడు"

"ముగ్గురి కొడుకులూ అమెరికాలో ఉన్నారు"

భూలోకం మాలోకంలా తయారయ్యాడు. బుర్ర గోక్కున్నాడు.

"ఓ కొడుకు పేరు హరి. మరొకడు నారాయణ"

"ఓకె! ఆవిడ? ఎ. మంగమ్మగారు"

"ఆవిడే సార్! ఎప్పుడు పోతారో చెప్పగలరా?"

"నేనేమైనా చిలుక జ్యోతిష్యుడినా, చిత్రగుప్తుడినా చెప్పడానికి?"

"పోనీ... ఎన్నాళ్ళుంటారో చెప్పగలరా?"

"గలను... కానీ"

"కానీ ఏమిటి సార్?"

"చెప్పను. చెపితే నాకేంటి?" అన్నాడు.

'వీడి దుంపతెగ. వీడిక్కూడా కమిషన్ కావాలా?' అనుకున్నాడు భూలోకం.

"నేనున్నాగా... నన్ను నమ్మండి"

"ఈరోజుంటావ్. రేపు గ్యారంటీ ఏమిటి" కరక్టే కదా! జీవితం క్షణభంగురం.

"ఆవిడని సాగనంపేదాకా ఈ భూలోకం ఈ లోకాన్ని వదిలిపెట్టి వెళ్ళడు సార్!" అన్నాడు.

"సరే! మీ కోరిక ప్రకారం యధాశక్తి త్వరగాపోయే ఏర్పాటుచేస్తాం. రెండురోజుల్లో మీకు పిలుపొచ్చే ఏర్పాటుచేస్తాం. సరేనా?"

"థాంక్యూ సార్! ఎంత త్వరగా అయితే అంత మంచిది"

"భూలోకంగారూ! మీరు రెడీగా ఉండండి. ఆవిడ పోరాటం చేస్తున్నారు. హరీ అనగానే ఫోన్ చేస్తా" అన్నాడు ఆశ్రమ మేనేజర్ మూర్తి.

"ఓకె! థాంక్యూ. మేం రెడీ. అయితే బయల్దేరి వచ్చేస్తాం" అన్నాడు హుషారుగా భూలోకం.

భూలోకం పిలవగానే మంగమ్మగారి మహాప్రస్థానం ఫ్లెక్సీ బోర్డుతో వ్యాన్ వచ్చి గుమ్మంలో ఆగింది.

వేరు వేరు వయస్సున్న నలుగురు ఆడవాళ్ళు, ముగ్గురు మగవాళ్ళు ఎక్కారు. ఆ వెనుకే 'ఆపద్భంధు' అంబులెన్స్‌లో భూలోకం, కెమేరామన్ సుందరం బయల్దేరారు. ఆశ్రమం ముందు వ్యాను, అంబులెన్స్ ఆగాయి. అందరూ దిగారు. భూలోకం సరాసరి మేనేజర్ రూమ్‌లోకి వెళ్ళాడు.

"నమస్కారమండీ! నేను భూలోకాన్ని" అన్నాడు మంగమ్మగారి రూమ్‌కు తీసుకెళ్ళాడు మేనేజరు.

ఓ పెద్దామె పడుకుని ఉంది. ఎగ ఊపిరి దిగ ఊపిరిగా ఉంది. ఏదో కొత్త రిలీజ్ సిన్మా చూస్తున్నట్లు మిగతా ముసలాళ్ళంతా చుట్టూ మూగి కుతూహలంగా నుంచుని చూస్తున్నారు.

భూలోకం ఆమె పల్స్ పట్టుకుని

## ఏక్ ఛాన్సు!



**నా**లుగేళ్ళనాడు బాలీవుడ్‌లో 'ఫగ్లీ'తో సినీ అరంగేట్రం చేసిన ముంబయి ముద్దుగుమ్మ కైరా అద్వాని ఎమ్.ఎస్.ధోనీతో రెండోమారు ఉత్తరాదివారిని ఊపేసింది. ఇప్పుడీ ఉత్తరాది బ్యూటి దక్షిణాదిలో తన అదృష్టాన్ని పరీక్షించుకునే ప్రయత్నాల్లో పడింది.

ఏకంగా తెలుగువారి అభిమాన హీరో ప్రిన్స్ మహేష్‌బాబుతో నటించే ఛాన్స్ కొట్టేసింది. 'భరత్ అనే నేను' షూటింగ్‌లో ఉండగానే ఇంకో తెలుగు అవకాశాన్ని దక్కించుకున్నది. రామ్‌చరణ్ సినిమాలో కైరా కైపులు మరో మారు చూడవచ్చున్నమాట!

చూశాడు. చాలా వీక్‌గా అన్పించింది.

ఇంతలో మంగమ్మగారి రెండో కొడుకు నారాయణ అందరిని తోసుకుంటూ ముందుకు వచ్చాడు. అతని చూపులు చాలా అసహనంగా ఉన్నాయి. "వచ్చావా నాయనా! ఓసారి డాక్టర్‌ని పిలువు బాబు" ఓ ముసలామె నారాయణకు సలహా ఇచ్చింది.

"డాక్టర్‌ని పిలవాలో, యాక్టర్‌ని పిలవాలో నాకు బాగా తెల్సు" అన్నాడు నారాయణ... అసహనంగా... వెటకారంగా.

అతగాడు జేబులోంచి సెల్ తీసి డయల్‌చేశాడు. "సుబ్బారావు గారూ! మీరు ఆశ్రమానికి అర్జంటుగా రావాలి. నన్ను నవమాసాలుమోసిన నా కన్నతల్లి అటో ఇటోగా ఉంది. ఆ తర్వాత ఏమనుకున్నా లాభంలేదు" నారాయణ చాలా టెన్షన్‌లో ఉన్నాడు.

"ఎంతయినా కన్నతల్లి కదా!" అన్నారెవరో.

"అవశానదశలో అయినా కొడుకు దగ్గరున్నాడు. పాపం... తల్లి కోసం ఎంత తపనో! చూశారా? డాక్టర్ కోసం ఫోన్ చేశాడు" అక్కడే వున్న ఓ ముసలామె అంటోంది... వ్యంగ్యంగా.

నారాయణ తల్లిని ముట్టుకోలేదు. ఆవిడ తట్టుకోలేదని.. పలకరించలేదు ఆవిడ్ని ఇబ్బంది పెట్టకూడదని. టెన్షన్‌గా లోపలికి, బయటికి తిరుగుతున్నాడు. వాచీకేసి చూసుకున్నాడు. మళ్ళీ సెల్ డయల్ చేసి "అర్జంటుగా రావాలి సార్!" అన్నాడు.

పావుగంట తర్వాత ఆశ్రమం ఎదురుగా కారు ఆగింది. నారాయణ ఎదురెళ్ళి కారులోంచి దిగి నాయన్ని రిసీవ్ చేసుకుని లోనికి తీసుకొచ్చాడు.

"డాక్టర్‌గారు వచ్చారు. అంతా ప్రక్కకు తప్పుకోండి" అంటూ ఓ ముసలాయన గట్టిగా అరుస్తున్నాడు.

వచ్చినాయన బ్రీఫ్ కేస్‌లోంచి ఏవో కాగితాలు తీశాడు. ఆవిడ చెయ్యి పట్టుకుని పల్స్ చూశాడు. "ప్చ్" అని పెదవి విరిచాడు.

"చూడండి డాక్టర్‌గారూ!" ఏదైనా ఇంజెక్షన్ చేసి ఆవిడ్ని బతికించండి" అన్నాడు ఆశ్రమంలోనే ఉండే రంగనాథం మాష్టారు.

ఆ వచ్చినాయన చుట్టూ పరికించి చూశాడు. చివరికి "డాక్టర్ ఎవరూ?" అన్నాడు.

"మీరే!" అన్నారు అంతా ముక్తకంఠంతో.

"బాబూ! నేను లాయర్ సుబ్బారావుని. డాక్టర్‌ని కాదు. నారాయణ గారూ! ఈ వీలునామా కాగితాలు జాగ్రత్తగాపట్టుకుని అన్నింటి మీదా అమ్మగారి వేలు ముద్రలు వేయించండి" అన్నాడు సుబ్బారావు.

వెంటనే అన్ని కాగితాల మీద వేలిముద్రలు వేయించి, ఒకసారి ఊపిరి పీల్చుకుని "అమ్మయ్యా!" అన్నాడు నారాయణ.

"నువ్వు పుట్టినప్పుడు మీ అమ్మగారు కూడా అలాగే అనుకునుంటారు. తెలివైనవాడివి. డాక్టర్‌ను పిలవమంటే లాయర్ని పిలిచావు" అన్నాడు రంగనాథం మాష్టారు.

"ఈ సమయంలో డాక్టర్‌ను పిలిచి ఇంజక్షన్లు గుచ్చి ఆవిడ్ని హింసించడం నాకు ఇష్టంలేదు సార్! ఆవిడ హాయిగా, ప్రశాంతంగా పోవాలనే నా కోరిక. వీలునామా మీద వేలుముద్రలు వేయించకపోతే మా అన్న హరి వాటాకొస్తాడు. అప్పుడు ఆమె ఆత్మకు శాంతి ఉండదు" అన్నాడు నారాయణ.

"ఎంత ముందుచూపు? తల్లంటే



అమెరికా సహాయం లేకున్నా పాకిస్తాన్ బ్రతకగలదు.
-ఖవాజా అసీఫ్, పాక్ విదేశాంగ మంత్రి

ఎంత ప్రేమ?" అన్నాడు రంగనాథం మాష్టారు.

"ఆవిడ 'హరీ' అంటే మా అన్నకు కాల్ చెయ్యండి. నాకుమాత్రం చెయ్యకండి. ఆ వార్త వింటే నేను తట్టుకోలేను. ఇదిగో... భూలోకం ఉన్నాడుగా... కానిచ్చేయండి" అని హడావుడిగా లాయర్ కారెక్కి వెళ్ళిపోయాడు నారాయణ.

అంతవరకూ మాట్లాడకపోయినా కళ్ళు తెరిచి చూస్తున్న మంగమ్మ నెమ్మదిగా కళ్ళు మూసింది.

"అదిగో... ఆవిడ కన్ను మూసింది.ఇక మేం స్టార్ట్ చేస్తాం" అన్నాడు భూలోకం ఉత్సాహంగా.

"అయ్యో! ఆవిడ కళ్ళు మూసుకుంది. బహు వచనం, కన్ను మూయలేదు. కాస్త ఓపికపట్టండి" అన్నాడు మేనేజర్ మూర్తి.

మిట్ట మధ్యాహ్నం పన్నెండయ్యింది. ఎండవేడికి శోషవచ్చి వీళ్ళ ప్రాణాలుపోయేలాఉన్నాయి. బృందంలోసభ్యుల మొహాలకేసి చూశాడు.మంగమ్మ గారి ఆఖరిపోరాటం చూసి బాగా నిరాశచెందిన వాళ్ళలా ఉన్నారు. వాళ్ళందర్నీ దగ్గర్లో ఉన్న చింత చెట్టు దగ్గరకు తీసుకెళ్ళాడు.

"మీరేం నిరుత్సాహపడకండి. ఈలోపు ఒకసారి మీరంతా మీ పాత్రలను గుర్తుచేసుకుని రిహార్సల్ వేసుకోండి. సుబ్బలక్ష్మీ! మంగమ్మ గారు అక్క నీకు. 'అక్కా!' అనే ఏడవాలి. తాయారూ! నువ్వు మంగమ్మ గారి కూతురువి... అంటే 'ఎంత పనిచేశావే అమ్మా!' అంటూ ఏడవాలి.

రాములమ్మా! నువ్వు పక్కింటావిడవి... తెల్సుగా! పద్మా! నువ్వు మనవరాలివి. 'మామ్మా!' అంటూ సాగాలి నీ ఏడుపు. నువ్వేంటోయ్ సుందరం! కెమెరా పైన కదులుతూ చక్కగా రావాలి.ఒక్కసారి మీరంతా మంగమ్మగారు బాల్చీ తన్నేసినట్లుగా ఫీలయ్యి మీ రిహార్సల్స్ చేయండి" అన్నాడు భూలోకం వాళ్ళని ఖాళీగా ఉంచడం ఎందుకని.

అప్పటికే వాళ్ళు రిహార్సల్స్ ప్రారంభించారు.

"చంద్రం! మీ నలుగురిలో నువ్వు కర్తవి. కార్యక్రమాలు చెయ్యాలి. సూర్యం! నువ్వు అపరఖర్మ చేసే బ్రాహ్మణుడివి.మిగతా మీ ఇద్దరూ భోక్తలు. సరేనా?" అన్నాడు నలుగురు మగాళ్ళతోటి భూలోకం.

"మీరు కానిస్తూ ఉండండి. నేను పోయి మంగమ్మ గారు పోగానేవచ్చి చెప్తాను"అని భూలోకం మంగమ్మ గారి రూమ్‌కి వచ్చాడు.

మేనేజర్ మూర్తి ఒక్కడే ఉన్నాడు. మంగమ్మగారి బెడ్ ఖాళీగా ఉంది. బాడీని ఎక్కడకు తీసుకుపోయారో అని భూలోకం అనుకుంటూ "మంగమ్మగారు పోయారా?" అన్నాడు.

"ఆ పోయారు...బాత్‌రూమ్‌కి" అన్నాడు మూర్తి.

"అదేమిటి? అన్యాయం!'పోవడం గ్యారంటీ' అని మీరంటేనేగా మేమంతా ఏర్పాట్లతో వచ్చింది"

"పోవడం కాదు..పోరాటం గ్యారంటీ అన్నాను. అమ్మా! ఇది పదహారోసారి. ప్రతీసారి ఆవిడ కళ్ళు మూయడం... మేం హడావుడి పడటం.

ఆవిడ తాపీగా లేచి కూర్చోడం. ఈసారి గ్యారంటీ






అనుకున్నాం. ఆవిడ అలవాటుప్రకారం లేచి కూర్చున్నారు" అన్నాడు మూర్తి.

ఇంతలో మంగమ్మగారు బాత్‌రూంలోంచి చిరునవ్వుతో బయటకువచ్చింది. భూలోకాన్ని చూసి "ఈ మాలోకం ఎవరూ?" అంది.

"తమరికి స్వర్గలోక దర్శనం చేయించే కాంట్రాక్టర్ భూలోకం అండి. మీ పెద్దకొడుకు 'హరి' పురమాయించాడు. మీరు ఎప్పుడు 'హరీ' అంటారా అని"

"నీకు అడ్వాన్స్ ముట్టిందా నాయనా?" అంది మంగమ్మ.

"సగం అందిందమ్మా" అన్నాడు భూలోకం బిక్క మొహం వేసుకుని.

"అందుకు సంతోషించు. క్రిందటిసారి మా పెద్దాడు హరి వీలునామా మీద వేలిముద్రలు వేయించుకున్నాడు. ఇప్పుడు మా చిన్నాడు నారాయణ వేలిముద్రలు వేయించుకున్నాడు.

నేను ఎప్పుడూ సంతకమే పెడ్తాను. వేలిముద్రలు చెల్లవు. మా బడుద్దాయిలకు ఆ విషయం తెలియదు. నా ఆస్తి ఈ ఆశ్రమానికి ఏనాడో రాసేశాను"

"ఇందాక మీరు అలా పడుండటం, మీ చుట్టూ అంతమంది మూగి ఉండటం?" అన్నాడు భూలోకం అయోమయంగా.

"నేను యోగా చేస్తాను. ప్రాణా యామం, ధ్యానం చేశాను. ప్రతీ ఆసనం తర్వాత శవాసనం వేస్తాను. ఆ టైమ్‌లోనే నారాయణ, నువ్వు వచ్చినట్లున్నారు. ఆశ్రమంలో అందరికీ నా సంగతి, నా కొడుకుల సంగతి బాగా తెల్సు.

మీరు వస్తారని తెల్సే ఆ నాటకం కాస్త రక్తి కట్టించారు. నేను ఇప్పట్లో... అంటే సెంచరీ కొడ్తేగానీ 'హరి' అనను... 'నారాయణ' అనను.

వాళ్ళలాగే నువ్వు నా ప్రస్థానం గురించి ఎక్కువ ఆశపెట్టుకోకు.ఇక నువ్వెళ్ళిరా నాయనా! ఇప్పట్లో నీ అవసరం నాకు ఉండదు" అంది మంగ్గమ్మగారు.

ఆ మాటకు భూలోకం కళ్ళు బైర్లుకమ్మాయి. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. బైట రిహార్సల్స్ వినిపిస్తున్నాయి. ఈ దిక్కుమాలిన ఈవెంటు అప్పజెప్పినవాడు జ్ఞాపకంరాగానే ఒక్కసారి గట్టిగా 'హరీ!' అని అరిచి, చొక్కా చింపుకుని, జుట్టు పీక్కుని గంతులేసి టక్కున పడిపోయాడు.

"బాబూ! ఎటు జెడ్‌వాళ్ళూ! మీ భూలోకం కళ్ళు బైర్లు కమ్మి కళ్ళు మూశాడు. హాస్పిటల్‌కు మోసుకుపోండి. ఈ వేళకి ఇదే మాకు పెద్ద ఈవెంట్"అన్నాడు ఆశ్రమ మేనేజర్ మూర్తి.

భూలోకాన్ని స్ట్రెచర్ మీద మోసి, అంబులెన్స్‌లో పడేసి హాస్పిటల్ వార్డులో కుదేశారు. ఈవెంటువాళ్ళు వరసలు మార్చి ఏడవడం స్టార్ట్ చేశారు.

"నాకేమయ్యింది?" అన్నాడు భూలోకం, మెలుకువ వచ్చి కళ్ళు తెరిచి.

"ఫుట్‌బాల్ గేమ్‌లో ఎవరి గోల్ వాళ్ళు వేసుకోవడాన్ని ఏమంటారు?"అన్నాడు కూడా వచ్చిన ఆశ్రమం మేనేజర్ మూర్తి.

"సెల్ఫ్ గోల్" అన్నాడు భూలోకం తన పరిజ్ఞానానికి తనే మురిసిపోతూ... మీలో ఎవరు కోటీశ్వరుడు కార్యక్రమంలో చెప్పినట్లు.

"ఇప్పుడదే జరిగింది. నీ ఈవెంట్ నువ్వే చేసుకున్నావ్" అన్నాడు మూర్తి.

# జీవితానికో పాఠం


Courtesy : THE MAN

"నా చేతిరాతను మెరుగుపరచుకోవడానికి నేను ప్రయత్నిస్తున్న సమయంలో నా మొదటి ఫౌంటెయిన్ పెన్ (ఇంక్‌పెన్)ను నాకు బహుమతిగా ఇచ్చిన మా బాబాయి చెప్పిన మాటలు నేను ఎన్నటికీ మరచిపోలేను.

'నీ ఆలోచనలకన్నా వేగంగా నడిచే కలంతో నువ్వు ఎన్నడూ రాయకు' అని అన్నారాయన. నేను కలిపిరాతను నేర్చుకుంటున్న సమయం అది. ఆయన ఆలోచన చాలా సింపుల్.

"ఏదైనా రాసేముందు బాగాఆలోచించాలి" బాల్ పాయింట్ పెన్ యొక్క పనితనం ఒక గొప్ప ఆలోచనల సంపుటిని పలుచపరుస్తుంది. నేను ఆయన మాటలను తుచ తప్పక పాటించాను. ఇంక్‌పెన్నులోని ఇంక్ ఎన్నిసార్లు బయటకు ఒలికినా, నా జేబు ఆ ఇంక్‌తో తడిసినా, ఇంక్‌పెన్ను అంటుకున్న బొటన వేలుతో ఎన్నిసార్లు మీటింగ్‌కు వెళ్ళాల్సొచ్చినా,ఆయన మాటలను నేను పెడచెవిని పెట్టలేదు.

## ఇంక్‌పెన్నుల హవా

ఈ మధ్యకాలంలో కాస్త వెనకబడ్డ ఇంక్‌పెన్ మరలా నూతనోత్తేజాన్ని, నవజీవనాన్ని పొందుకుంది. చాలామంది సామాజిక మాధ్యమాల్లో అందరికీ కనిపించేలా వారి కొత్త ఆస్తిని ప్రదర్శిస్తున్నారు. ఇదో స్టేటస్ సింబల్. మౌంట్‌బ్లాంక్ నుండి కరన్ డి అచే వరకు, వివిధ రకాల పెన్‌లను వాడడం సహజమైన అలవాటుగా మారింది.

నన్ను తప్పుపట్టకండి అవి మార్కెట్‌లోని గొప్ప పెన్‌లు. ఇంక్‌పెన్ భక్తులు చెప్పినట్లు ఇంక్‌పెన్‌తో రాసేటప్పుడు ఉండే పట్టు మరియు కలిగే అనుభూతి, దాని బరువు ఇత్యాదివన్నీ ఒక ప్రత్యేకమైన అనుభూతిని కలగచేస్తాయి. ఈ అనుభూతి పెన్‌పై ఎత్తుగా రాసిన మన పేరుకన్నా గొప్పది.

వీటి పనితనంలోని గొప్పదనం ఏంటంటే, కొన్ని వారాలపాటు మనం వాటిని వాడకపోయినా, వాటిని ఒకరోజు తీసి చూస్తే అవి చాలా సులభంగా, సరళంగా, ఆగకుండా రాస్తాయి. ఈ విషయంలో మేస్టర్ ట్రక్ పెన్‌కన్నా తక్కువధరకు దొరికే డెల్టా పెన్ ముందంజంలో ఉంటుంది.

ఈ రోజుక్కూడా పెయిలర్ మరియు ఫాబెర్ కాస్టెల్ పెన్‌ల పాళీలకు ప్రత్యామ్నాయం కనుగొనాల్సి ఉంది. శ్యాహి అనే పెన్నుల కంపెనీవల్ల ఇంక్‌పెన్‌ల హవా మళ్ళీ మొదలైంది.

సనయ్ షా అనే యువకుడు తన హాబీని ఒక వ్యాపార రహస్యంగా మలచి, ఇంక్‌పెన్నులను సహజమైన పాతచెక్కలతో చేయడం మొదలుపెట్టాడు. దీనివలన పెన్నులకు ఎక్కడలేని అందం వచ్చి అవి మెరవడం మొదలుపెట్టాయి.

నేను ప్రస్తుతానికి మాక్‌స్పార్ ఎబోని పెన్‌నుగాని జీబ్రావుడ్ బ్రాండ్ పెన్‌ను కాని కొని దాచుకుందామనుకుంటున్నాను. ఇవన్నీ జర్మన్ దేశంలో తయారైన పీటర్ బాక్ పాళీని కలిగి, స్క్మిడ్ అనే కన్వర్టర్ కలిగి ఉంటాయి.

దీనివలన వీటిని ఇంక్‌తో నింపి మరలా వాడుకోవచ్చు. నాకు తెలియని ఒక బ్రాండ్‌ను నేను ప్రమోట్ చేయడంలేదు. ఒక స్థానిక వ్యాపారిని నేను ప్రమోట్ చేస్తున్నాను. ఇంక్‌పెన్నులు అవసానదశకు చేరుకున్నాయి. నిజంగా చెప్పాలంటే రాయడం అనే ప్రక్రియే అవసానదశకు చేరుకుంది.

ఎంతో అద్భుతమూ, ఆహ్లాదకరమైన వస్తువు లేదా ప్రక్రియ అవసానదశకు చేరుకుంటుంటే దాన్ని కాపాడి దృఢపరచవలసిన బాధ్యత మనదని నా నమ్మకం. మన పూర్వీకులు చెప్పిన 'నిల్చుని-గమనించు'లాంటి దృక్పథాన్ని కలిగి ఆనందాన్ని ఒడిసి పట్టడం మనందరి బాధ్యత.

## నిల్చుని గమనించు

ఇంకుపెన్నుల్ని కాపాడుకోవడంగానీ, బాల్కనీలో నుంచుని టీ తాగడం అనే అనుభూతిగాని, వేకువజామునేలేచి పక్షుల కిలకిలరావాలుగాని వినడంలాంటి ఆనందాల్ని,అనుభవించడం మనం నిరంతరం చేస్తూఉండాలి. అదే మన పూర్వీకులు చెప్పిన 'నిల్చుని-గమనించు' దృక్పథంలోని పార్శ్యం.

నా సైకిల్ని నేను తుడుచుకోవడం, దాన్ని అన్ని విధాలుగా సిద్ధంచేసుకోవడం నాకు అవధుల్లేని ఆనందాన్నిస్తుంది.

నా షూ పాలిష్ చేసుకోవడం నాకెంతో ఇష్టం. బీచ్ ఒడ్డున కూర్చుని, ఇసుకలో కాళ్ళుపెట్టి, ఇసుక గూడుకట్టడం నాకెంతో ఇష్టం.

ప్రతిమనిషి జీవితంలో చివరికి మిగిలేది ఇలాంటి క్షణాలేనన్నది నిర్వివాదాంశం. మనమెక్కడ మొదలైనాం, ఎక్కడకు చేరుకున్నాం అనేవి నిరంతరం గమనిస్తూనే ఉండాలి. ఇలాంటి ఆలోచనల్ని ఆలోచించడానికి, అవి మీతో పంచుకోవడానికి ఈ అవకాశం వచ్చినందుకు నేను ఆనందిస్తున్నాను.

# వారఫలం

**ఫిబ్రవరి 1 నుండి 7, 2018 వరకు**

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



**మేషం:** అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. నిన్నటి గ్రహణముచే ఈ రాశివారు ఉదయకాలమందు స్నానదైవారాధనలు, పిదప శివాలయ దర్శనమును చేయుట తప్పనిసరిచేయుండి. ప్రయత్న కార్యాలను ముమ్మరం చేయగలరు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు హడావిడి తనం ఉండగలదు.ఆర్థిక వ్యవహారాలు మీకనుకూలమైనవిగా ఉంటాయి.ఆరోగ్య మందు మేలుతనంగా ఉంటుంది. తొందరతో కూడిన ప్రయాణాలు పనికిరావు. నిరుద్యోగులకు శుభవార్తలుంటాయి. ఆది, సోమ, బుధవారాలు అనువైనవి.



**వృషభం:** కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా. కుజ-శనులు ప్రతికూలురు. దూకుడు స్వభావం తగదు. ప్రయత్నించుకునేవారికి మేలుతనం ఉండగలదు. శ్రమ, బడలిక, బద్ధకంవంటివి ఎక్కువగా ఉండగలవు. పోస్టుపోనుమెంటులు, ఇతరులపై ఆధార పడుటచే కొన్ని ఇబ్బందులను ఎదుర్కోవలసి రావచ్చును. ఉద్యోగ, వ్యాపారాలందు కలిసిరాగలదు. అనారోగ్యం విషయంలో అశ్రద్ధ చూపకండి. ఆర్థికంగా ఉత్సాహాలు ఏర్పడతాయి. వారమంతా సామాన్యతలు కొనసాగగలవు.



**మిథునం:** మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3పా. వారమంతా మధ్యమ అనుకూలతలు ఉంటాయి. ప్రణాళికా బద్ధంగా-ఇంటా బయట సంయమనములతోను వ్యవహరించుకోవాలి. ఏకాగ్రతతో పనిచేసుకోండి. శారీరక బడలికలుంటాయి. ఆరోగ్య విషయంలో స్వల్పజాగ్రత్తలు అవసరం. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు రొటేషన్లచే చికాకులు పొందుతున్నా ఓరిమితో వ్యవహరించుకోవాలి. ఆర్థిక సర్దుబాట్లు అవసరమవ్వగల సూచనలున్నాయి. శుక్ర, శని, ఆదివారాలు అనువైనవి.



**కర్కాటకం:** పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. నిన్నటి గ్రహణ కారణంగా గురువారం ఉదయం స్నాన-జపాదుల తదుపరి శివాలయ దర్శనాలు తప్పనిసరిచేయండి. కార్యసాఫల్యాలుంటాయి. సమయానుకూలంగా వ్యవహరించుకోగలరు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు సాధారణతలు కొనసాగుతాయి. ఆర్థికమైన ఒడిదుడుకులను ఎదుర్కోవలసి రావచ్చును. అవసరాలను దృష్టిలో పెట్టుకుని పనిచేయాలి. చెల్లింపులకు ప్రాధాన్యతనీయండి. ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.



**సింహం:** మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా. గ్రహణ దోష నివారణకు గురువారం ఉదయం స్నాన-జపాదుల తదుపరి శివాలయ దర్శనాలను తప్పనిసరిచేయండి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలందు గౌరవాలేర్పడతాయి. అధికారులచే సహకారాలు పొందుతారు. సంతాన, విద్యావిషయాలలో స్వల్ప జాగ్రత్తలు పాటించవలసి రావచ్చును. గతంలో వాయిదాపడిన పనులను శీఘ్రగతిన పూర్తిచేసుకోగల్గుతారు. విద్యార్థులు టార్గెట్ విధానాలకు ప్రాధాన్యతనీయాలి.శుక్ర, శని, బుధవారాలు అనువైనవి.



**కన్య:** ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా. కార్యసాఫల్యతలు ఏర్పడతాయి. ఆదాయాలందు సంతృప్తికరమైన స్థితులుంటాయి. మీకున్న గుర్తింపును పెంచుకోగల్గుతారు. నూతన వ్యక్తుల పరిచయాలందు సంయమనాలు పాటించుకోండి. భాతృవర్గంనుండి ఆశించిన ప్రయోజనాలను పొందగలరు. బంధుమిత్రులచే ఏర్పడు సలహాలు, సూచనలు మీకనుకూలమైనవి అయితేనే స్వీకరించండి. విద్యార్థులకు ప్లేస్‌మెంట్‌లు ఊరించగలవు. శని, ఆది, సోమవారాలు అనువైనవి.



**తుల:** చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా. ఈ వారమందు చేపట్టుకున్న పనులను నిదానంగా పూర్తిచేసుకోగలరు. వృత్తి-ఉద్యోగాలందు ఒత్తిడులున్నా పనులను సకాలంలో చేసుకోగలరు. ఖర్చులు కొన్ని ఊహించనవి ఏర్పడుటచే మానసిక ఒత్తిడులకు గురికాగల సూచనలున్నాయి. బంధుమిత్రులచే సూచనలు, సలహాలు వంటివి ఇచ్చిపుచ్చుకోవడాలు ఏర్పడతాయి. సహాయకులతో వ్యవహరించుకొనునప్పుడు లౌక్యంతో సాగండి. విద్యార్థులు టార్గెట్స్ విధించుకుని సాగాలి. ఆరోగ్య విషయంలో మేలుతనాలుంటాయి. శుక్ర, శని, బుధవారాలు అనువైనవి.



**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. ప్రణాళికాబద్ధంగా సాగాలి. ముఖ్యం అనుకున్న పనులను చేపట్టి పట్టుదలతో నిర్వహించుకోవాలి. కుటుంబసభ్యుల సలహాలకు ప్రాధాన్యతనీయుట మేలవ్వగలదు.మిత్రులు, తోటివారి ఉత్సాహాలందు పాలుపంచుకోగలరు. ఖర్చులందు ఏకాగ్రతలతో సాగవలసి ఉంటుంది. ఇతరులను తక్కువ అంచనావేసి వ్యవహరించుటచే ఇబ్బందులు పొందే సూచనలున్నాయి. విద్యార్థులు క్రమశిక్షణలకు ప్రాధాన్యతనిచ్చి వ్యవహరించుకోవాలి. సుబ్రహ్మణ్యారాధనలను తప్పనిసరిచేయండి. శని, ఆది, సోమవారాలు అనువైనవి.



**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. గ్రహణ శాంతికై గురువారం ఉదయం స్నాన-జపాదుల తదుపరి శివాలయ దర్శనాలు చేయుట తప్పనిసరిచేయండి. ఈ వారం అంతా మిశ్రమంగా సాగగలదు. స్వల్ప అనారోగ్య భావనలు,వ్యక్తిగతంగా ఉత్సాహాలు చూపలేకపోవుటవంటివి ఉంటాయి. ఋణబాధలున్నవారు ఋణదాతలకు అందుబాటులో ఉండుట మేలు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు కర్తవ్యాలకు అంకితమవ్వడం ఉపకరించగలదు. సాధ్యాసాధ్యాలను ఊహించుకుని నూతన పనులను చేపట్టుకోండి. ఆది, సోమ, బుధవారాలు అనువైనవి.



**మకరం:** ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. ఈ వారమంతా ఉత్సాహంగా సాగుతుంది. యత్నీకృత కార్య లాభాలు ఉంటాయి.ఆర్థికపరమైన మేలుతనమైన ఫలితాలుంటాయి. వృత్తి, ఉద్యోగాలందు అధికార్లను సంతృప్తిపరచగలరు. ఉద్యోగ, ఉపాధులు వంటివాటికై చేయు యత్నాలు ఉపకరించగలవు. యంత్ర, వాహనాదులచే ప్రయోజనాలు ఉంటాయి. ప్రయాణాలు సౌకర్యవంతంగా సాగగలవు. మీ సమీపులలో తగిన గుర్తింపులేర్పరచుకోగలరు.వివాహాది శుభకార్య యత్నీకులు శుభవార్తలు వినగలరు. అనారోగ్య విషయంలో స్వల్ప జాగ్రత్తలు అవసరం. గురు, శుక్ర, శనివారాలందు అన్నిటా మెలకువలు పాటించుకోవాలి.



**కుంభం:** ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2,3పా. ఈ వారంలో భవిష్యత్ ప్రయోజనాలు ఏర్పరచు పనులను చేపట్టి పూర్తిచేసుకోగలరు. మెలకువలు పాటించుకోవాలి. పెట్టుబడులందు సంతృప్తినేర్పరచుకోగలరు. ప్రయాణాలు, ప్రయత్నాలు అనుకూలంగా సాగుతాయి. జీవిత భాగస్వామిచే అదనపు ఖర్చులు ఏర్పడు సూచనలున్నాయి. విదేశీ నివాస, ప్రయాణ ప్రయత్నాలు అనుకూలిస్తాయి. అనారోగ్యం విషయంలో మెలకువలు అవసరం. ఈ రాశివారికి ఆది, సోమవారాలు ముఖ్యమైన పనులు చేయుటకు అనువైనవి. వీరికి అన్నిటా మెలకువలు అవసరం.



**మీనం:** పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. గత పారపాట్లు కొన్ని ఒత్తిడులను ఏర్పరచు సూచనలున్నాయి. కుటుంబ వ్యక్తులచే సహాయాలు పొందగలరు. విద్యా వ్యాసంగాలకు తెలియని ఆటంకాలుంటాయి. జాగ్రత్తలు అవసరం. చెల్లింపులకు ప్రాధాన్యతనీయండి. నూతన వ్యాపార, వ్యవహారాలను తలపెట్టుకొను సూచనలున్నాయి. హామీలిచ్చుటకు దూరంగా ఉండండి. ఆరోగ్యం విషయంలో మంచి మార్పులు ఏర్పడతాయి. వాగ్వాదాలందు లౌక్యాలు పాటించుకోండి. నమశ్శివాయ జపమునకు ప్రాధాన్యతనీయండి. మంగళ, బుధవారాలందు అన్నిటా మెలకువలు అవసరం.



# సెక్స్ AND సైకాలజీ



డా॥జి. సమరం

ఎ.కె. రాజోలు

నాకు తెల్లబట్ట అవుతుంది. పెళ్ళికాకముందు నుంచి ఈ జబ్బు ఉంది. ఏ బాధా లేకపోవడంతో డాక్టరుకి చూపించుకోలేదు. ఇప్పుడు నాకు పెళ్ళి అయింది. మావారు నాతో సెక్స్‌లో పాల్గొన్నప్పుడల్లా పురుషాంగం మంటపుడుతుందని, ఎర్రగా కందుతోందని గోలపెడుతున్నారు.

సెక్స్‌లో పాల్గొనడానికి ఇంట్రెస్టు చూపడంలేదు. నాకు సెక్స్ కావాలని ఉంటుంది. కాని ఆయనసెక్స్‌లో పాల్గొనడానికి భయపడుతున్నారు. స్త్రీలకి తెల్లబట్ట వ్యాధి ఉంటే పురుషులకి బాధ కలుగుతుందా? ఇప్పుడు నా విషయంలో ఏం చేయాలి?

చాలామంది స్త్రీలల్లో ఎటువంటి వ్యాధీ లేకుండా వైట్ డిశ్చార్జి అవుతుంది. దానివల్ల భార్యాభర్తలు ఇద్దరిలో ఎవరికీ ఏ బాధా ఉండదు.

కొందరికి ట్రైకోమొనియాసిస్, మొనిలియాసిస్, క్లామిడియల్ ఇన్‌ఫెక్షన్స్ ఉంటాయి.

దానివల్లవైట్‌డిశ్చార్జి కొద్దోగొప్పో అవుతూ ఉంటుంది. ఇదేమీ పెద్దజబ్బు కాదు.

ఇటువంటి వైట్ డిశ్చార్జి అయ్యే స్త్రీలల్లో ఎటువంటి బాధా అనిపించదు. కొందరిలోనే యోని దగ్గర కాస్త మంట, దురద ఉంటాయి. ఈ విధమైన వైట్ డిశ్చార్జి అయ్యే స్త్రీలతో సెక్స్‌లో పాల్గొన్నప్పుడు పురుషునికి మాత్రం శిశ్నందగ్గర కాస్త కందినట్లు అవడం, మంట, దురద అనిపించడం ఉంటాయి.

వాస్తవానికి అవి పెద్ద బాధలు కాదు. కాని మీవారు ఆ కొద్దిపాటి బాధలకే ఏదో అయిపోతుందని భయపడుతున్నారు. సెక్స్‌కి దూరంగా ఉంటున్నారు. కాని సెక్స్‌కి దూరంగా ఉండనవసరంలేదు.

ఇద్దరూ డాక్టరు దగ్గరకి వెళ్ళి చూపించుకోండి. కొద్దిపాటి చికిత్సతోనే ఈ వైట్ డిశ్చార్జి సమస్య తీరిపోతుంది. హాయిగా ఉంటారు.

జె.కె. రాజమండ్రి

మావారికి ఎయిడ్స్ వ్యాధి ఉంది. నాకు లేదు. కండోమ్ పెట్టుకుని జాగ్రత్తగా సెక్స్‌లో పాల్గొంటున్నాము. అప్పుడప్పుడు ఆయన వీర్యం నా తొడల మీద పడుతుంది. దానివల్ల నాకు ఎయిడ్స్ వ్యాధి వచ్చే ప్రమాదం ఉందా?

తొడలమీదగాని, శరీరంమీద ఇతరచోట్ల చర్మం మీదగాని వీర్యం పడటంవల్ల ఎయిడ్స్‌వ్యాధి రాదు. మీరు నిర్భయంగా సెక్స్‌లో పాల్గొనవచ్చు.

ఎల్.కె. సికింద్రాబాద్

నా వయస్సు ఇరవై సంవత్సరాలు. ముప్పై సంవత్సరాల స్త్రీతో పరిచయం ఏర్పడింది. ఆమె నాతో బాగా చనువుగా ఉంటోంది ఆమెకు పెళ్ళి అయింది. ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారు. ఆమె తన భర్తతో ఎటువంటి సుఖం లేదని చెప్పింది.

నేనంటే తనకి చాలా ఇష్టంగా ఉందట. తనతో సెక్స్‌లో పాల్గొనమని ఎంతగానో కోరుతోంది. కాని నాకు భయంగా ఉంది. నేను ఆమెకంటే చాలా చిన్నవాడిని కదా. ఆమెతో సెక్స్‌లో పాల్గొంటే నేను పనికి రాకుండాపోతానా? నాకు మాత్రం ఆమెతో సెక్స్‌లో పాల్గొనాలని ఎంతగానో ఉంది. అయినా ఏదో అవుతుందని భయంతో ఆగిపోతున్నాను. నన్ను ఎంజాయ్ చేయమంటారా? వద్దంటారా?

---

Communication is the absolute key to a Good Sex

## సంసారబంధం బలానికి పంచసూత్రాలు

భార్యాభర్త అన్యోన్యంగా, ఒకరికొకరుగా భావిస్తే ఆ జీవితం ఎంతో మధురంగా, ఆనందంగా వుంటుంది. కాని అంత మధురమైన సంసారజీవితం అందుకునేవారు తక్కువ.

అందుకు కారణాలు ఏవైనా కావచ్చు. దానివలన బంధం బలహీనపడి ఒకరికొకరు ఎడమొహం, పెడమొహంగా జీవితాన్ని సాగదీస్తారు.

విదేశాలలో బంధం బలహీనమవగానే విడిపోతుంటారు. మన సమాజంలో ఇంకా అంతటి వెసులుబాటు లేనందున సర్దుబాటు తీసుకుని, బలహీనపడినదానిని బలమైన బంధంగా మార్చుకోవాల్సి వుంటుంది. వివాహబంధంలోకి కొత్తగా దిగినవారు తమబంధాన్ని బలహీనపడకుండా చూసుకునేమార్గాలను అనుసరించాలి.

తనను తాను ప్రేమించుకున్నవారే ఎదుటివారిని ప్రేమించగలరన్నది సూత్రం. ఎప్పుడూ ఏవో లోపాలను వెతుక్కునే మనస్తత్వం కలవారికి ఎదుటివారిలోని లోపాలే కనిపిస్తాయి తప్పించి మంచి కనిపించదు.

అద్దంలో తనను తాను చూసుకుని ఆహా ఎంతఅందంగా వున్నాను అని మెచ్చుకోవటం మొదలుపెడితే అవతలివారిని మెచ్చుకోవటం మొదలవుతుంది.

ఒకరినొకరు మెచ్చుకుంటున్న దంపతులు చాలా ఉత్సాహంగా జీవించగలుగుతారు. ప్రతిరోజూ కొత్తదనం ప్రదర్శిస్తే జీవితం మధురంగాఉంటుంది.ప్రతిరోజూ ఒకే డ్రస్, ప్రతిపూటా ఒక్కటేరుచి ఇష్టపడరు ఎవరైనా. అలాగే ప్రతిరోజూ ఒక కొత్త అనుభవం కావాలి. అటువంటి అనుభవంకోసం ఎదుటివారిని ఆశ్చర్యపరిచే పనిచేయండి.

వారిలో కనిపించిన కొత్తని చెప్పండి. చూసిన మంచిని పొగడండి. అలా రోజూ ఒక కొత్త బహుమతి, కొత్త ప్రతిపాదనవల్ల భాగస్వామి కోసం ఎదురుచూసే స్థితికి చేరుతుంది మనసు.

ఎదుటివారి భావోద్వేగాలను అర్థంచేసుకున్న జంటలే కడదాకా ఒకరకమైనప్రేమతో వుండగలుగుతారు. అవతలివారి మాటలు శ్రద్ధగా వినటం అవసరం. వారి మానసిక పరిస్థితిని గమనించటం అవసరం. మాటలకు అడ్డుపడకుండా, వారి భావాన్ని పూర్తిగా బయటకు చెప్పనివ్వాలి.

ఎటువంటి పరిస్థితుల్లో మానసికంగా వున్నారో తెలుసుకుని ఆ పరిస్థితిలోనుండి బయటకు తీసుకొచ్చేలా అనునయించాలి. దగ్గరికి తీసుకుని ఓదార్చాలి. మద్దతుగా నిలిచి ప్రోత్సహించాలి. అలా ఎవరైతే భావోద్వేగమద్దతును ఇవ్వగలుగుతారో వారు బాగా ఆకట్టుకోగలుగుతారు.

కలిసి గడిపే సమయం కీలకం. కలిసి సమయం గడపలేనప్పుడు కలిసి బ్రతకటంలో అర్థం వుండదు. తమ కోసం తాము ప్రత్యేకంగా సమయం కేటాయించుకోవటం ప్రతి జంటకూ అవసరం.

గతంలో ఉమ్మడి కుటుంబాలలో అటువంటి అవకాశం వుండేది కాదు. కాని ఇప్పుడు విడిగా సమయం దొరుకుతోంది. అటువంటి సమయాన్ని వినియోగించుకోవటం అవసరం.

ప్రత్యేకంగా ఒంటరి సమయం కేటాయించుకోవాలి. ఇతరులు ఏదో అనుకుంటారనేది పక్కనపెట్టి ఏ వయసులో అయినా హాయిగా జంటగా గడపగలగాలి. అప్పుడే వారి బంధం బలపడుతుంది. ◆

అధిక వయస్సు ఉన్న స్త్రీతో తక్కువ వయస్సు ఉన్న పురుషుడు సెక్స్‌లో పాల్గొన్నప్పటికీ సెక్స్ హరించిపోదు. కాని ఇటువంటి అక్రమ సంబంధాలు మంచిది కాదు. ఇక ఎప్పుడూ సెక్స్ ధ్యాసే ఉండి చదువుమీద దృష్టి లేకుండాపోతుంది. అందుచేత ఆమెకు మీరు దూరంగా ఉండండి.

జి.ఎస్. సికింద్రాబాద్

*నా వయస్సు 26 సంవత్సరాలు. ఇంకా పెళ్ళి కాలేదు. సెక్స్ కోరికలు విపరీతంగా ఉంటాయి. వాటిని తట్టుకోలేకపోతున్నాను.*

అంగం పెద్దది అవడానికి మందులు ఏవీ లేవు. పుట్టుకతోనే అంగ పరిమాణం నిశ్చయమై ఉంటుంది. మామూలుగా పురుషాంగం రెండు అంగుళాలనుండి నాలుగు అంగుళాల రేంజ్‌లో ఉంటుంది.

అందరి ఎత్తు ఒకటే ఉండనట్లు, బరువు ఒకే రకంగా ఉండనట్లు అంగపరిమాణంకూడా ఒకరికి ఒకరికి తేడాగా ఉంటుంది.

అంగం స్తంభించడం ఉందంటే ఇక అంగపరిమాణం గురించి ఆలోచించడం అనవసరం. మీకు హస్తప్రయోగం అలవాటు ఉంది కనుక అంగం

పన్నెండవ రోజునుంచి పదహారవ రోజువరకు ఇంటి దగ్గరే ఉండేటట్లు ప్లాన్ చేసుకోమనండి.

ఆ రోజుల్లో సెక్స్‌లో పాల్గొంటే గర్భం వచ్చే అవకాశాలు చాలా ఎక్కువగా ఉంటాయి.

డి.ఎమ్. గుడివాడ

*మావారికి మొదటినుంచి వీర్యం చాలా త్వరగా అవుట్ అయిపోతుంది. దానివల్ల నాకు చాలాసార్లు తృప్తి లేకుండా అవుతుంది.*

*ఏ రోజుకారోజు ఈ రోజు బాగుంటుంది, తృప్తి అనిపిస్తుంది అనుకుని సెక్స్‌లో పాల్గొంటూవచ్చాను.*

Photography : NICK SAGLIMBENI Courtesy : MAXIM

*పొరపాటున ఏ అమ్మాయినైనా రేప్‌చేస్తానని భయంగా ఉంది. పెళ్ళి అయ్యేవరకు సెక్స్ కోరికలు లేకుండా అవ్వాలి. ఏం చేయమంటారు?*

మామూలు వ్యక్తులు ఎవ్వరూ రేప్‌కి సాహసించరు. కేవలం నైతిక విలువలులేనివాళ్ళే రేప్‌కి సాహసిస్తారు. ఎంత సెక్స్ కోరిక ఉన్నా జీవితంలో విలువలు ఉన్న వాళ్ళు పరిమితులు దాటరు. అందుకని మీలో సెక్స్ కోరికలు అంత ఎక్కువగా ఉన్నప్పటికీ రేప్ చేస్తానని భయపడనవసరంలేదు. అయినా మనస్సులో కలిగే కోరికలని కంట్రోలులో ఉంచుకోండి. అప్పుడు మనస్సు ప్రశాంతంగా ఉంటుంది.

కె.కె. రాయచోటి

*నా అంగం చిన్నది. ఇంకా పెళ్ళి కాలేదు. అంగం చిన్నదిగా ఉండటమే కాకుండా నాకు అతిగా హస్త ప్రయోగం అలవాటు ఉంది. దీంతో పెళ్ళైన తర్వాత భార్యని తృప్తిపరచలేనని భయంగా ఉంది. నా అంగం పెద్దదిగా అవ్వాలంటే మందులు ఏం వాడాలి?*

చిన్నదిగా అనిపించినా సెక్స్‌లో పాల్గొనడానికి ఎటువంటి ఇబ్బందీలేదు.

మీకు ఎటువంటి దిగులు అవసరంలేదు. కొంత మంది మోసగాళ్ళు అంగపరిమాణం పెంచడానికి మందులు అని, ఆపరేషన్లు అని దగా మాటలు చెబుతారు. ఆ మాటలకి మోసపోకండి.

ఆర్.ఎమ్. సికింద్రాబాద్

*మావారు తరచూటూర్స్‌లో ఉంటారు. ఇంటిదగ్గర ఉండేది చాలా తక్కువ. దానివల్ల నెలకి 2-3 సార్లే సెక్స్‌లో పాల్గొనడం ఉంటుంది. పెళ్ళి అయ్యి మూడు సంవత్సరాలైనప్పటికీ ఇంకా గర్భం రాలేదు. నాకు త్వరగా గర్భం రావాలంటే ఎలా?*

స్త్రీకి నెల మధ్యలో అండం విడుదల అవుతుంది. అలా విడుదలైన అండానికి వీర్యకణంతో కలిసే శక్తి కేవలం ఒక్కరోజు మాత్రమే ఉంటుంది. ఆ రోజుల్లో సెక్స్‌లో పాల్గొనబోతే గర్భంరాదు.

అందుకని మీవారిని మీకు మెన్సస్ అయిన

*కాని నా ఆశలన్నీ అడియాసలే అయ్యాయి.*

*ఇప్పుడు నాకు సెక్స్‌మీద ఇంట్రెస్టు లేకుండా పోయింది. మావారికి శీఘ్రస్ఖలనం అవుతున్నప్పటికీ సెక్స్‌మీద ఆసక్తి ఏమీ తగ్గలేదు.*

*ఆయనకి రోజూ సెక్స్ కావలసిందే. కాని నా బాధ ఆయనకి అర్థంకావడంలేదు. ఆయన దగ్గరకి వస్తున్నారంటేనే చిరాకు వస్తోంది.*

*ఇద్దరి మధ్య రోజూ గొడవలు జరుగుతున్నాయి. శృంగారంలో ఎంజాయ్ చేయవలసిందిపోయి తిట్టుకోవడం, విసుక్కోవడంతో సరిపోతోంది. ఇక మా సంసారం ఇంతేనా?*

శీఘ్రస్ఖలనం సమస్యకి కూడా పరిష్కారాల మార్గాలు ఉన్నాయి, మందులు ఉన్నాయి.

మీవారిని శృంగారంలో పాల్గొనడానికి మూడు గంటలముందు డేపాక్సిటిన్ 30 ఎమ్.జి. బిళ్ళ రోజూ ఒకటి వేసుకో మనండి. చాలావరకు శీఘ్రస్ఖలనం సమస్య కంట్రోలు అవుతుంది.

డా॥ జి.సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

# మనిషిలో మనిషి

తన కూతురు చేసిన పని రామచంద్ర గజపతి మహదేవ్‌కు పెద్ద షాక్.

ఆయన పరువుప్రతిష్ఠలకు పెద్దపీట వేసే మనిషి. ప్రేమజంట ఏమయిందో తెలీదు గాని మొత్తానికి ఆ గొడవలో సంవత్సరం ఆలస్యంగా తన అక్క సులక్షణాదేవితో రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ వివాహం జరిగింది. కొన్నాళ్ళకి తను వసుంధరా దేవిని పెళ్ళి చేసుకున్నాడు.

తర్వాతి కాలంలో తమ విజయపురం సంస్థానం చేజారిపోవడంతో తను భార్యాపిల్లలతో పర్లాకిమిడి చేరుకున్నాడు. మేనకోడలు మేఘనా సౌందర్యానంద సహనాదేవి పుట్టిన రెండేళ్ళకి ఇక్కడా పరిస్థితులు మారాయి. పెద్దాయన రామచంద్రగజపతి మహదేవ్ పక్ష వాతంతో కాలం చేశారు.



కూతురి అచ్చటా ముచ్చటా తీరకుండానే తన అక్క సులక్షణాదేవి మెట్లనుండి జారిపడి యాక్సిడెంట్‌లో మరణించింది. ఇదిలాఉండగా పాప జాతకం చూసిన జ్యోతిష్కులు ఆమెకు ప్రాణాపాయం ఉందని హెచ్చరించారు.

దాంతో బావగారు సంస్థానబాధ్యతలు తనకు ఒప్పగించి పాపను తీసుకుని లండన్ వెళ్ళిపోయారు. అదంతా గతం. తిరిగి ఇంతకాలానికి తను కొత్త విషయాలు వింటున్నాడు.

ఇంతకీ ఉమామహేశ్వరీ చంద్రబాల ప్రేమించింది ఎవరినీ? కార్తికేయ వాళ్ళ బిడ్డ అయితే వాళ్ళిద్దరూ ఏమయ్యారు? వీడు అనాథగా ఎలా పెరిగాడు? సూర్య ప్రకాశవర్మ కళ్ళముందు గతం మెదిలిందిగానితర్వాత ఏం జరిగిందీ అర్థంగాక తెల్లబోయి చూస్తున్నాడు.

ఇక రాకుమారి మేఘనా సౌందర్యానంద సహనా దేవి అయితే షాక్ నుంచి ఇంకా కోలుకోలేదు. తను ప్రేమించినవాడు సొంతబావ అంటే నమ్మలేకపోతోంది. తమ ప్రేమకు తండ్రినుంచి ఇంత సులువుగా ఆమోద ముద్ర లభించడానికి కారణ మేమిటో ఇప్పుడిప్పుడే అర్థ



E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్మోహనరావు



మవుతోంది. కాని అనేక ప్రశ్నలు ఇంకా మిగిలిపోయే ఉన్నాయి. ఇంతవరకు కార్తికేయతో ఈ విషయాలు చెప్పకపోవడానికి కారణమేమిటి

కార్తికేయ అనాథగా పెరగాల్సివచ్చిందంటేఅత్తయ్య మావయ్యలు ఏమయ్యారు? ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ సూర్యప్రకాశవర్మ గొంతు విప్పటంతో సంజనా ఆలోచనలు చెదిరిపోయి అటు చూసింది.

"సారీ బావగారూ, నిజంగా నాకు తెలీకే అలా మాట్లాడాను. క్షమించండి. ఇంతకీ కార్తికేయ తల్లిదండ్రులు ఏమయ్యారు. ఇప్పుడు ఎక్కడున్నారు?" అని అడిగాడు.

బాధగా నిట్టూర్చారు రాజావారు.

"వాళ్ళు ఇప్పుడు లేరు. ఏం జరిగిందో అదికూడా చెప్తా వినండి" అంటూ చెప్పటం ఆరంభించారు.

"మా తండ్రిగారు మహరాజా రామచంద్రగజపతి మహదేవ్‌గారిగురించి మీరూవినే ఉంటారు. కాలంతో బాటు మారే స్వభావం కాదు ఆయనది. నరనరాన రాచరికపు ఠీవి నింపుకొని రాజసింహంలా ఉండేవారు. న్యాయానికి ధర్మానికి ఆచార కట్టుబాట్లకు పెద్దపీట వేసేవారు. సొంతవాళ్ళయినా తప్పుచేస్తే కఠినంగా శిక్షించేవారు. కర్కశంగా ప్రవర్తించేవారు.

సోమశేఖరనాయుడని ఈ వూరివాడే. గొప్ప స్థితిమంతులు కాదుగాని రైతు కుటుంబం. సొంతంగా యాభై ఎకరాల భూమి ఉండేది. వ్యవసాయంమీద ఆధారపడిన కుటుంబం.

తల్లిదండ్రులు అన్నదమ్ములు అక్కాచెల్లెళ్ళు వెరసి చాలా పెద్ద కుటుంబం ఆ కుటుంబంలో ఆఖరివాడు సోమశేఖరనాయుడు. బాగా చదువుకుంది కూడా అతడే. చాలా అందంగా ఉండేవాడు.

ఇప్పటికీ కార్తికేయను చూస్తూవుంటే నాయుడే గుర్తొస్తాడు. తండ్రి పోలికలు వాడిలో చాలా ఉన్నాయి. ఉద్యోగ ప్రయత్నంలో ఉండగా ఈ సంస్థానంలో నాయుడికి అవకాశం లభించింది.

ఆ రోజుల్లో ఇప్పుడు మీ స్థానంలో ఆయన పని చేసేవాడు. చాలా నమ్మకమైనవాడు. ఎలాంటి పనైనా వప్పగించింది సాధించుకువచ్చేవాడు. మా అందరి అభిమానం సంపాదించుకున్నాడు.

మా సోదరి ఉమామహేశ్వరీ చంద్రబాల వలపును గెలుచుకున్నాడు. వాళ్ళు ప్రేమించుకున్నట్టు గాని, రహస్యంగా కలుసుకుంటున్నట్టుగాని మాకు తెలీదు. ఈ లోపల విజయపురి సంస్థానంతో మాకు సంబంధాలు ఖాయపర్చారు.

వివాహాలకు ముహూర్తాలు ఖరారు చేయాల్సివుంది. తన తండ్రి చండశాసనుడు. చెప్తే వినకపోగా సోమశేఖరనాయుడి ప్రాణాలకే ప్రమాదం.

ఏంచేయాలో తోచక రాత్రికి రాత్రి తన నగలు కొంత డబ్బు తీసుకుని రహస్యమార్గంగా కోట వదిలి నాయుడివద్దకు పారిపోయింది.

ఆమెను చూసి నాయుడి తల్లిదండ్రులు, అన్నదమ్ములు అంతా భయపడిపోయారు. సంస్థానంతో వైరం చావుతో చెలగాటం వంటిది. వెనక్కి పంపించేయమని ఒత్తిడి చేశారు. ఆమె తన ప్రాణం. వెనక్కి పంపించేంత పిరికివాడు కాదు నాయుడు.

రాత్రికి రాత్రి రాకుమారిని తీసుకుని పర్లాకిమిడి వదిలివెళ్ళిపోయారు. తమ ప్రేమను బ్రతికించుకోవటంకోసం ఎటో వెళ్ళిపోయారు..." అంతవరకు చెప్పి కాసేపు మౌనంగా ఉండిపోయారు రాజావారు. గత జ్ఞాపకాలు ఆయన్ని బాధిస్తున్నట్టున్నాయి. కళ్ళు చెమ్మగిల్లాయి. గొంతు రుద్ధమయింది.

అగ్నిపర్వతం కూడా మామూలు పర్వతాలలాగే ఉంటుంది. అది విస్ఫోటనం చెందినప్పుడు తెలుస్తుంది లావా వేడి. ఎప్పుడూ నవ్వుతూ, ఆనందంగా, ఉత్సాహంగా తిరిగే రాజావారిలో ఇంత విషాదం దాగివుందని ఇంతవరకునూ ఎవరికీ తెలీదు.

"చెప్పండి డాడీ... తర్వాత ఏమైంది? అత్తయ్య మావయ్య ఎక్కడికి వెళ్ళారు? పెళ్ళిచేసుకున్నారా?" అంటూ అడిగింది సంజనా.

తిరిగి చెప్పుకువచ్చారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్. "ప్రేమజంట ఆ రాత్రి ఎటో ఎగిరిపోయింది. రాకుమారి అదృశ్యమైన విషయం తెల్లవారే సరికి గుప్పుమంది. ఉమామహేశ్వరీ చంద్రబాల వెళ్ళిపోతూ తన మందిరంలో రాసి ఉంచిన ఉత్తరం మూలంగా అసలు విషయం తెలిసింది.

మా తండ్రిగారు రాజా రామచంద్రగజపతి మహదేవ్‌తోపాటు మాకందరికీ ఇది పెద్దషాక్. సోమశేఖర నాయుడుతో లవ్ ఎఫైర్ అప్పుడే బయటపడింది. మా తండ్రిగారి కోపానికి అంతులేదు.

సంస్థాన ప్రతిష్ఠ వంశగౌరవం మంటగలిపిందని మండిపడ్డారు. వెంటనే మనుషుల్ని పంపించి నాయుడు తల్లిదండ్రులు, అన్నదమ్ములు ఫ్యామిలీ మొత్తాన్నీ కోటకు రప్పించి విచారించారు.

తమకే పాపం తెలీదని వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో అస్సలు తెలీదని మొత్తుకున్నారు వాళ్ళంతా. కొరడాలతో రక్తాలు వచ్చేట్టు కొట్టించినా ప్రయోజనం లేకపోవడంతో వాళ్ళని వదిలేశారు.

ఇక నాలుగు దిక్కులా మనుషులను పంపించి గాలించటం ఆరంభించారు. ఆ జంట మా తండ్రిగారి

## జరిగిన కథ

(12) నా కూతురిని ప్రేమగా చూస్కో అని రాజావారు చెప్పేసరికి మరింత అయోమయంలో పడతాడు కార్తికేయ.

కార్తికేయ దగ్గరకు వస్తుంది సంజనా. పెళ్ళి కాకుండానే ఆ రాత్రి శోభనం జరుగుతుంది వారిద్దరికీ. స్వామి సత్యానంద వెళ్ళేటప్పుడు ఓ స్ఫటికమాలను సంజనాకి ఇస్తాడు.

కార్తికేయ జాతకాన్ని మున్నలూరి కృష్ణశాస్త్రికిస్తారు రాజావారు. ఆ జాతకాన్ని పరిశీలించి ఇతడు మహామేధావి అని, ఇతన్ని కట్టుకున్న యువతి నిండునూరేళ్ళు సుఖంగా ఉంటుందని చెప్పేసరకి ఆయన సంతృప్తిచెందుతాడు.

ప్యాలెస్ సిబ్బంది యూనిఫామ్‌లో ఉన్న ఓ ఆగంతకుడు తమ రహస్యాలను వింటున్నాడని తెలిసి అతనివెంటపడతాడు కార్తికేయ. తోడుగా సంజనా కూడా పరిగెడుతుంది. కానీ ఆ ఆగంతకుడు దొరకకుండా తప్పించుకుంటాడు.

కార్తికేయను అల్లుడిగా రాజావారు చేసుకోబోతున్నారని తెలిసి, ఆయన బావమరిది సూర్యప్రకాశవర్మ, ఆస్ట్రేలియాలో డాక్టర్‌గా ఉన్న నా కొడుకుని అల్లుడిగా చేసుకోక, ఓ అనాథకు మీ కుమార్తెనిచ్చి పెళ్ళిచేస్తారా అంటూ నిష్టూరమాడతాడు. అందుకు రియాక్టవుతుంది సంజనా.

కార్తికేయ అనాథ కాదని తన మేనల్లుడని రహస్యం చెబుతారు రాజావారు.

తర్వాత జరిగేది చదవండి.

మనుషులకు చిక్కితే ఎంత ప్రమాదమో నాకు తెల్సు. వాళ్ళకన్నా ముందే కలుసుకుని ఆ జంటకు రక్షణ కల్పించాలని రహస్యంగా నేనూ మనుషుల్ని పంపించాను జాడ తెలియడానికి.

కాని ఎంత గాలించినా వాళ్ళ ఆచూకీ చిక్కలేదు. ఈలోపల సంవత్సరం గడిచిపోయింది. ఇక వాళ్ళ సంగతి పక్కనపెట్టి నా వివాహం సులక్షణాదేవితో జరిపించారు. మా పెళ్ళైన మూడో ఏట నీవు పుట్టావు. సరిగ్గా అప్పుడే చివరకు సోమశేఖరనాయుడు ఉమా మహేశ్వరీ చంద్రబాల ఇద్దరి ఆచూకీ తెలిసింది.

వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకుని ఇక్కడికి దూరంగా దక్షిణాదిన ఆంధ్రాలో- నెల్లూరు సమీపంలోని వింజ మూరు గ్రామంలో సెటిల్ అయ్యారు. అక్కడ నాయుడికి పెంచలయ్య అనే మిత్రుడున్నాడు. అతడి సాయంతోనే వీళ్ళక్కడ స్థిరపడ్డారు.

నా మనుషులు తెచ్చిన సమాచారం ఎన్నడూ అబద్ధం కాదు. ఈ విషయం తెలియగానే ఢిల్లీ వెళుతున్నట్టు మా తండ్రిగారితో అబద్ధం చెప్పి ఫ్లయిట్‌లో చెన్నై చేరుకున్నాను. అక్కడ్నుంచి రోడ్డు మార్గంగా వింజమూరు చేరుకున్నాను. నన్ను చూడ గానే నా చెల్లెలు బోరున ఏడ్చింది.

నాయుడు క్షమించమని వేడుకున్నాడు. జరిగింది చెప్పారు. ఇద్దర్నీ అక్కున చేర్చుకుని ఓదార్చాను.

ఉమ వెంటతెచ్చిన డబ్బు నగలతో ఒక ఇల్లు, కొంత పొలం కొనుక్కున్నారు. ఇంటివద్దే ఫ్యాన్సీషాపు నడుపుతూ సాధారణ జీవితం గడుపుతున్నారు. అప్పటికే వాళ్ళకి మూడేళ్ళ కొడుకున్నాడు.

వాడే కార్తికేయ. ముద్దులు మూటగట్టే నా మేన ల్లుడ్ని గుండెలకు హత్తుకున్నాను. సాధారణ జీవితం గడుపుతున్నా వాళ్ళక్కడ సుఖంగానే ఉన్నారు.

నాయుడు మిత్రుడు పెంచలయ్యను కలిశాను. ఏ అవసరం ఉన్నా ఫోన్ చేయమని నా పర్సనల్ ఫోన్ నెంబర్ ఇచ్చాను. మూడురోజులు వాళ్ళింట్లో ఆతిథ్యం తీసుకుని బయలుదేరి వచ్చేశాను. సరిగ్గా నెల తిరక్కముందే ఓ రోజు ఉదయం వింజమూరు నుంచి పెంచలయ్య ఫోన్ చేశాడు.

అతడు చెప్పింది విన గానే షాక్‌తో కూలబడి పోయాను. గత అర్ధ రాత్రి దాటినతరువాత కొందరు రౌడీలు సోమశేఖర నాయుడు ఇంటిమీద దాడిచేశారు.

కత్తులతో పొడిచి సోమశేఖరనాయుడిని చంపే శారు. నా సోదరి చంద్రబాలను బలవంతంగాలాక్కొచ్చి కారు ఎక్కించబోతుంటే ఆమె తప్పించుకొని లోనకు పారిపోయి తలుపులు మూసుకొని ఒంటిమీద కిరస నాయిలు పోసుకుని నిప్పంటించుకు చనిపోయింది.

ఆ సమయంలో పసివాడు కార్తికేయ లోన గదిలో నిద్రపోతున్నాడు. అతను సేఫ్. చుట్టుప్రక్కల అంతా లేచి వచ్చేసరికి దుండగులు అక్కడ్నుంచి వాహనాల్లో పారిపోయారు. వాళ్ళెవరో ఏమిటో తెలీదట.

పెంచలయ్యకు తెలీకపోవచ్చుకాని నాకు తెలుసు. వాళ్ళంతా కఠినుడైన నా తండ్రి పంపించిన మను షులు. తల్లిదండ్రులమీదపడి పసివాడు చేస్తున్న రోదనలు చూడలేకపోతున్నామంటూ పెంచలయ్య చెప్పింది విని కుమిలిపోయాను. వెంటనే బయలుదేరి వస్తున్నట్టు పెంచలయ్యకు చెప్పి ఫోన్‌పెట్టేశాను.

చీమకైనా హాని తలపెట్టని సోమశేఖరనాయుడికి వింజమూర్‌లో శత్రు వులు ఎవరూ లేరు. నా తండ్రి మనసులో ఇంకా కూతురు అల్లుడిమీద పగ ప్రతీకారజ్వాలలు రగులు తూనే ఉన్నాయని పసిగట్టలేకపోయాను.

ఆయన ద్వేషానికి ఒక పచ్చని సంసారాన్నికూల్చేసి లోకం తెలీని పసివాడిని అనాథను చేసింది. ఇంత జరిగాక కూడా మౌనం వహించలేకపోయాను. మా తండ్రిగారితో గొడవపడ్డాను. ఈ సందర్భంలోనే కూతురు, అల్లుడు మరణించిన సంగతి మా తల్లి గారికి తెలిసిపోయి బోరున విలపించారు. ఆమెకు కూతురు అంటే పంచప్రాణాలు.

"నేను శాసిస్తున్నాను. అవి అనాథ శవాలు. నువ్వు వింజమూరు వెళ్ళటానికి వీల్లేదు" అంటూ నన్ను ఆపాలని చూశారు.

ఆయన శాసనాన్ని ధిక్కరించి నేను వింజమూరు వెళ్ళాను. పసివాడు కార్తికేయను అక్కున చేర్చు కున్నాను. బావ సోమశేఖరాయుడి ఒంటినిండా కత్తి పోట్లు. పూవుకన్నా సుకుమారి నా సోదరి. ప్యాలెస్‌లో అల్లారుముద్దుగా పెరిగిన రాకుమారి.

ఒళ్ళంతా కాలిపోయిన స్థితిలో శవాన్ని చూడలేక బోరున ఏడ్చాను. చందన కట్టెలతో ఆ ప్రేమజంటను ఒకే చితిమీద మండించి మట్టిచేసిన చేతులు ఇవి. చితాభస్మాన్ని పెన్నానదిలో కలిపాను.

పక్షంరోజులు అక్కడే వుండి ఆచారం ప్రకారం జరిపించాల్సిన కార్యక్రమాలన్నీ ఘనంగా జరిపిం చాను. పెంచలయ్య నా బావకు మంచి స్నేహితుడు. మంచివాడు. జరిగిందానికి అతనూ ఏడ్చాను.

ఎంత ఏడ్చినా పోయినవాళ్ళు తిరిగిరారు గదా. ఇల్లు, ఫ్యాన్సీ స్టోర్ పెంచలయ్య తీసుకుని డబ్బిచ్చాడు. బ్యాంక్‌లో కొంత సొమ్ముంది. అంతా మైనర్ అయిన కార్తికేయ పేర బ్యాంక్‌లో వేసి గార్డియన్‌గా నేను సంతకం చేశాను. ఇరవై ఎకరాల పొలం ఉంది.

ఆ పొలాన్ని పెంచలయ్య ఇప్పటికీ కౌలుకు చేస్తు న్నాడు. కౌలు సొమ్ము కార్తికేయ అకౌంట్‌లో వేస్తు న్నాడు. ఈ విషయాలేవీ కార్తికేయకు తెలీదు.

వింజమూరులో పనులన్నీ ముగించుకుని పక్షం రోజుల తర్వాత భువనేశ్వర్ చేరుకున్నాను. కార్తి కేయను పర్లాకిమిడి తీసుకువస్తే నా తండ్రినుంచి వాడి ప్రాణాలకూ ప్రమాదం తప్పదు. అందుకే వాడ్ని ఎవరికీ తెలీకుండా పెంచాలనుకున్నాను.

ఒక అనాథ శరణాలయంలో చేర్పించాను. అనాథ లాగే పెంచాను. వెనకవుండి నడిపించాను. తెలిసీ

తమిళనాడులో నాయకత్వం లేదని రజనీకాంత్‌కి ఎవరు చెప్పారు... తమిళులు సహనంతో వున్నారు... వారిని నాశనం చెయ్యవద్దు.

-భారతీ రాజా, దర్శకుడు



## నా 'దిశ'

'లోఫర్'తో మొదలైన ఉత్తరాది పోరి దిశా పటానీ చిత్రసీమలో అన్ని దిశల్లోనూ కాలు పెట్టింది. హాలీవుడ్ చిత్రం 'కుంగ్‌ఫూ యోగా'తో ఏకంగా జాకీచాన్‌తో నటించగలిగింది.

టైగర్ గ్రాఫ్‌తో బాలీవుడ్‌లో 'బాఘి 2' చేస్తున్న దిశ చిన్నతనంలో ఎయిర్‌ఫోర్స్‌లో పైలెట్ కావాలని కలలు కనేదట.

"నా రోల్‌మోడల్ ప్రియాంకచోప్రా, మాధురీ దీక్షిత్, కత్రినాకైఫ్, రణబీర్ కపూర్, అల్లు అర్జున్, అక్షయ్‌కుమార్‌లు అంటే నాకు అభి మానం. పుస్తకాలు చదవడం నా హాబీ. డ్యాన్స్ నేర్చుకున్నా. టైమ్ దొరికితే జిమ్నాస్టిక్స్ చేస్తుంటా" అంటూ తన కబుర్లు చెప్పింది.



తెలియని వయసులో జరిగిన ఈ సంగతులు ఏవీ కార్తికేయకు గుర్తుండే అవకాశమే లేదు.

ఇది జరిగినప్పటినుంచి నా తండ్రిగారికి నాకూ మాటల్లేవు. తన మాట వినలేదని మాట్లాడ్డం మానేశారు. ఆయన రాక్షసత్వంమీద నాకు అసహ్యం. నేనూ మాట్లాడ్డం మానేశాను.

ఈ లోపల కూతురు అల్లుడిని తనే చంపించాడని మా తల్లిగారుకూడా రాజావారితో మాట్లాడ్డం మానేశారు. కూతురిమీద బెంగతోనే ఆరుమాసాలు తిరిగేసరికి ఆవిడ కాలం చేశారు.

చేసిన పాపాలు ఊరికే పోవంటారు. నిర్దాక్షిణ్యంగా కూతురి సంసారాన్ని కూల్చిన పాపం. సంవత్సరం తిరిగేసరికి పక్షవాత రూపంలో మా తండ్రిగారిని మంచాన పడేసింది. ఎన్నివైద్యాలు చేయించినాఫలితం లేకపోయింది. చివరకు ఆయనా గతించారు.

ఇలా ఉండగా- నా తండ్రిగారు గతించిన ఆరు మాసాలకు నా భార్య సులక్షణాదేవి కాలుజారి మెట్లపైనుంచి పడింది. ఆ ప్రమాదంలో బలమైన గాయాలతో ఆమె కూడా కాలం చేసింది. ఇలా వరుసచావులు చూసి చూసి నా గుండె మొద్దుబారిపోయింది.

ఇటు చూస్తే రెండేళ్ళ పాప మేఘనకు శత్రువుల నుండి ప్రాణగండం ఉందని జ్యోతిష్యులు చెప్పారు. కాబట్టి శత్రువులకు ఆమె ఎలా ఉంటుందో తెలీకుండా పెంచాలని నిర్ణయం తీసుకున్నాను.

ఇక్కడ సంస్థాన బాధ్యత బావమరిదిగా నీకు అప్పగించి పాపను తీసుకుని లండన్ వెళ్ళిపోయాను. మిగిలింది మీకు తెలుసు" అంటూ జరిగింది చెప్పి చెమర్చిన కళ్ళు తుడుచుకున్నారు రాజావారు.

జరిగింది వినగానే సంజనాకు దుఃఖం ఆగలేదు. తన బావ కార్తికేయమీద ప్రేమ రెట్టింపైంది. అతడి విషాదగాథ విని వెక్కి వెక్కి ఏడ్చింది.

కూతుర్ని అక్కున చేర్చుకుని ఓదార్చారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్.

సూర్యప్రకాశవర్మ, కృష్ణశాస్త్రులు విభ్రాంతి చెంది నోటమాటరాక అలా చూస్తుండిపోయారు. "క్షమించండి బావగారూ. మీ మనసులో ఇంత విషాదంగూడు కట్టుకునుందని తెలీక తొందరపడి మాట్లాడాను. కార్తికేయ అనాథ, అనామకుడు అని నిందించిన నా అవివేకాన్ని మన్నించండి" అంటూ అర్థించాడు.

"ఇట్సాల్ రైట్ వర్మా" అన్నారు రాజావారు.

"రాజన్యా! నాదో సందేహం" అన్నాడు కృష్ణశాస్త్రి.

"అడగండి గురువర్యా. ఏమిటది?"

"ఏంలేదు, పలని సత్యానంద స్వామీజీతో మీకు ఎంతకాలంగా అనుబంధం ఉంది? మా తండ్రిగారు గతంలో ఇక్కడ రాజగురువుగా పని చేశారు. మీరు చెప్పిన విషయాలు వారికి తెలిసివుండవచ్చుకాని నాతో ఎప్పుడూ చెప్పలేదు"

"ఈ సందేహం ఎందుకు వచ్చింది గురువర్యా. శక్తిపీఠంతో మా అనుబంధం ఈనాటిది కాదు. మా ముత్తాతగారి హయాంనుంచీ ఉంది. ఆయన కుమారస్వామి భక్తులు. కుమార శక్తిపీఠాధిపతులంటే ఎనలేని అభిమానం. ఆది అలాగే కొనసాగుతూ వస్తోంది"

రాజావారు చాలా విషయాలు చెప్పారుగాబట్టి కృష్ణశాస్త్రి గొంతులో ఒక ముఖ్యమయిన ప్రశ్న కొట్టుమిట్టాడుతోంది. అది ఒకప్పుడు తన తండ్రిగారు తనతో చెప్పిన విషయం. అడిగితే మరీ చనువు తీసుకున్నట్టవుతుంది.

అడగాలా వద్దాని సందేహిస్తూనే చివరకు అడగలేక ఆ ప్రశ్నను గొంతులోంచి వెనక్కి పంపించేశాడు. అడిగివుంటే కీలకమయిన మరో మలుపుకి తెర లేచివుండేది. అంతేకాదు- ఇన్ని తెలిసిన రాజావారికి కూడా తెలీని మెలిక ఒకటి వుంది.

అదీ ఆయన తండ్రి రామచంద్ర గజపతి మహాదేవ్‌చేసిన నిర్వాకమే. ఒక్కోసారి అనాలోచితంగా తీసుకునే నిర్ణయాలు వారసుల్ని అష్టకష్టాలపాలుచేస్తాయి. మరో దారుణమైన విషయం. మనకు తెలీకుండానే మన రహస్యాలు శత్రువులకు చేరటం.

శత్రువుల కుట్రలో అదీ ఒక భాగమే. ఇక్కడ రాజావారి టేబుల్ అడుగున శక్తివంతమైన హియరింగ్ బగ్ అమర్చబడివుంది. ఎక్కడయితే భద్రత ఉందని ఈ కీలక సమావేశం జరుగుతోందో అక్కడే భద్రత లేకుండా పోయింది.

ఆ సౌండ్ ప్రూఫ్ గదిలో చీమ చిటుక్కుమన్నా ఆ శబ్దాన్ని వైర్‌లెస్ డివైజ్ బైటికి పంపిస్తోంది. పర్లాకిమిడి టౌన్‌లో ఎక్కడో మూలకూచున్నవ్యక్తి ఒకడు ఆ మాటల్ని వింటూ రికార్డు చేస్తున్నాడు. ఆ సంగతి ఎవరికీ తెలీదు. ఒకవేళ ఈ సమావేశానికి కార్తికేయ వచ్చుంటే కుట్ర బయటపడుండేది. అతను రాలేదు. ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ తిరిగి కృష్ణశాస్త్రి గొంతు విప్పాడు. "ప్రభూ! వర నిర్ణయం జరిగిపోయింది. వరుడు కార్తికేయ, వధువు చిరంజీవి సౌభాగ్యవతి కుమారి మేఘనా సౌందర్యానంద సహనాదేవి. ఇక ముహూర్తాలు చూడ్డమే మిగిలింది. ఈలోపల వధూవరుల జాతకాల్ని తపోవనం ఫ్యాక్స్‌చేసి స్వామి సత్యానందవారి అభిప్రాయం కూడా తెలుసుకుంటారా లేక" అంటూ అర్ధోక్తిలో ఆగిపోయాడు.

రాజావారు కూడా ఇదేవిషయం ఆలోచిస్తున్నారు. మూడునిముషాలవరకు బదులు చెప్పలేదు. చివరకు తల అడ్డంగా ఊపుతూ "లేదు గురువర్యా. ఆ అవసరంలేదు. ఆయన మరో అభ్యంతరం లేవదీసినా మీకు భిన్నంగా వేరే ముహూర్తం నిర్ణయించినా అనవసర జాప్యం జరుగుతుంది.

అది మాకిష్టంలేదు. మీమీద మాకు నమ్మకముంది. మీరే మంచి ముహూర్తం నిర్ణయించండి. జరగబోయేదిపర్లాకిమిడిసంస్థాన రాకుమారి వివాహం. పెళ్ళి పనులకు కనీసం రెండుమాసాల వ్యవధి ఉండాలి.

జనం కనీవినీ ఎరుగని రీతిలో వైభవంగా పెళ్ళి జరగాలి. ఈ వారంలోనే మీ నిర్ణయాన్ని చెప్పండి. శుభలేఖలు సిద్దం చేయించాలిగదా" అన్నారు.

సమావేశం ముగిసేసరికి ఆరుగంటలు దాటింది

ఫ్లాష్ ఫ్లాష్

"పొడగరి, సొగసరి కృతీసనన్‌కు డ్రీమ్‌రోల్ విషయంలో పెద్ద ఆశలే ఉన్నాయి. 'ప్రెట్టి ఉమెన్'లో జూలియా రాబర్ట్స్ పాత్ర చేయడం ఇష్టమట. మరువలేని ఆనందాలగురించి అడిగితే ఉత్సాహంగా చెప్పుకొచ్చింది.

"చిన్నప్పుడు ఢిల్లీలో ఓ ఎంగేజ్‌మెంట్ ఫంక్షన్‌కు వెళ్ళాను. అక్కడ సల్మాన్‌ఖాన్‌ను చూసి ఎగ్జైట్‌మెంట్ ఆపుకోలేకపోయాను. ఈ మధ్య ముంబయిలో అవార్డుల ఫంక్షన్‌కు వెళ్ళా. నా హీరోపంతి సినిమా నామినేటైంది. నమ్మడానికి నన్ను నేను గిల్లుకోవాల్సివచ్చింది. అమితాబ్ బచ్చన్‌గారి పక్కన కూర్చోగలిగాను. వీటిని ఎన్నటికీ మరువలేను" అని తెలిపింది."





అవినీతి మరకే లేని
మోడీని ఎదుర్కోవటం
కాంగ్రెస్‌కి అసాధ్యమే.
-ప్రకాష్ అంబేద్కర్, దళిత నేత

> **త**నకు నచ్చిన హీరో అజిత్ అంటూ ఠక్కున చెప్పింది నయనతార.
>
> అజిత్ మాట్లాడే తీరు, వ్యావహారిక శైలి తనకు ఎంతో నచ్చుతాయంటున్నది.
>
> "క్రాష్ డైటింగ్‌లపట్ల నాకు నమ్మకం లేదు. జిమ్‌కు రెగ్యులర్‌గా వెళుతంటా. ఒకవేళ మారుమూలపల్లెల్లో షూటింగ్ చేయాల్సివస్తే అందుకు తగినట్లు జాగ్రత్తలు తీసుకుంటుంటా.
>
> జిమ్ కుదరకపోతే యోగా చేస్తుంటాను. ఆహారం విషయములో నేను చాలా ఎలర్ట్‌గా ఉంటుంటా" అంటూ ఎప్పుడూ చెప్పని కబుర్లు విప్పింది నయనతార.



సమయం. బయట చీకట్లు ముసురుకుంటున్నాయి. సరిగ్గా ఏడుగంటలకు వ్యాన్‌లో కార్తికేయవద్దకు బయలుదేరింది సంజన.

**అ**ప్పటికి అర్ధగంట ముందుగానే ప్యాలెస్ గేటు బైట కొంత దూరంలో ఉన్నాడు కార్తికేయ. చీకట్లలో బైక్ ఆపి సంజనా రాకకోసం ఎదురుచూస్తున్నాడు. చాలాసేపటిక్రితమే వీధిలైట్లు వెలిగాయి.

ఊరిజనం ఎవరి పనుల్లో వాళ్ళు హడావుడిగా తిరుగుతున్నారు. విద్యుద్దీపాల కాంతులతో ప్యాలెస్ ఇంద్రభవనంలా వెలిగిపోతోంది.

మధ్యాహ్నం కార్తికేయ ఇంటికి వెళ్ళిపోయాడేగాని అతడి మనసంతా సంజనా చుట్టూనే తిరుగుతోంది. రాకుమారి ఒంటరిగా ప్యాలెస్ నుంచి తమ ఇంటికి రాకపోకలు సాగించటం అంత మంచిది కాదనిపించింది. శత్రువుల ఉనికి తెలిశాక కూడా అరక్షితస్థితిలో సంజనాను వదలటం క్షేమం కాదు.

సంజనా శక్తిసామర్థ్యాలమీద ఎంతగా నమ్మకం ఉన్నప్పటికీ ఎదురుగా రానంతవరకూ శత్రువునూ తక్కువగా అంచనా వేయకూడదు. అందుకే సంజనాకు తెలీకుండా బాడీగార్డ్‌గా వ్యవహరించాలని తోచింది. ఆరున్నరగంటలకే వచ్చేసి సంజనా వ్యాన్ బైటికి ఎప్పుడు వస్తుందాని వెయిట్ చేస్తున్నాడు.

సరిగ్గా రాత్రి ఏడుగంటల అయిదునిముషాలకు సంజనా వ్యాన్ కోటగుమ్మం దాటి బయటికి వస్తూ కన్పించింది. వెంటనే అలర్టయ్యాడు కార్తికేయ.

వ్యాన్ ముందుకు వెళ్ళిపోయేవరకు ఆగి తన బైక్ స్టార్ట్‌చేసి దూకించాడు. ఇంతలో కాస్త ఎగువన మరో బైక్ కూడా స్టార్ట్ అయింది. అది కూడా సంజనా వ్యాన్ వెనక పరుగెత్తసాగింది.

కార్తికేయకు అర్థంకాలేదు. తన సందేహం నిజమయిందా లేక ఇది కాకతాళీయమా! అది నలుపురంగు బైక్. మనిషి దృఢంగా ఉన్నాడు. తలకు హెల్మెట్ పెట్టుకున్నాడు.

వ్యాన్‌వెనక వందగజాల ఎడంగా ఆ బైక్ వెళుతోంది. వచ్చేపోయే వాహనాలతో ట్రాఫిక్ రద్దీగానే ఉంది. వాడు ఎవడోగాని అదే దూరం మెయిన్‌టెన్ చేస్తూపోతున్నాడు.

డ్రైవింగ్‌లో సంజనా ఎక్స్‌పర్ట్. ఫాస్ట్ డ్రైవింగ్ ఆమె అలవాటు. అలాగని రఫ్ డ్రైవింగ్ కాదు. ఆమె వ్యాన్ గాని కారుగాని నడుపుతోందంటే నిశ్చింతగా నిద్రపోవచ్చు. ఇప్పుడు కూడా ట్రాఫిక్‌లో అరవై కిలోమీటర్ల వేగంలో వెళ్తోంది. మెయిన్ ట్రాఫిక్ నుంచి పక్కవీధులకు తిరగ్గానే ఆ బైక్ కూడా అటే తిరిగింది.

కొద్దిసేపట్లోనే అర్థమైపోయింది. వాడు ఎవడోగాని వదలకుండా సంజనాను ఫాలో అవుతున్నాడు. ముందుకు వెళ్ళటంలేదు, వెనక్కి తగ్గటంలేదు. అదే దూరం కంటిన్యూ చేస్తున్నాడు.

సంజనాకు హాని తలపెట్టే ఉద్దేశం వాడికి లేదు. ఉంటే వ్యాన్‌ని సమీపించేవాడే. బహుశా ఎక్కడికివెళుతుందో కనిపెట్టడం వాడి ఉద్దేశం కావచ్చు. ఇప్పుడేం చేయాలి. వాడ్ని పట్టుకుంటే నిజం కక్కించటం పెద్ద కష్టం కాదు. కాని పబ్లిక్ ప్లేస్‌లో వాడ్ని కార్నర్ చేయలేడు. అది అనవసరమైన రిస్క్. వాడు తమ ఇంటివరకూ వస్తే గుట్టు శత్రువులకు తెలిసిపోతుంది. రాకుండా ఆపాలి.

ఇక ఎక్కువ ఆలోచించలేదు కార్తికేయ. ప్రస్తుతానికి బైక్‌ని ఆపేస్తే చాలు. వాడి సంగతి తర్వాత చూడొచ్చు. జేబులోంచి రివాల్వర్ తీసి వెనక టైర్‌ను షూట్ చేశాడు. బుల్లెట్ తాకగానే బాంబు ప్రేలినట్టు పెద్దశబ్దంతో బైక్ వెనక చక్రం పేలిపోయింది.

వెంటనే అడ్డంతిరిగిపడి బైక్ ఒక పక్కకు, వాడు మరో పక్కకు దూసుకుపోయారు. దారిపక్క ఒక రాయిని కొట్టుకుని పడ్డ వాడు తిరిగి లేవలేదు. ఏం జరిగిందో తెలీక ట్రాఫిక్ స్తంభించింది.

వాడు ఏమయ్యాడో కూడా తిరిగిచూడకుండా వ్యాన్‌వెంట వెళ్ళిపోయాడు కార్తికేయ.

**పో**ర్టికోలో వ్యాన్ దిగిన సంజనాకి తనవెనకే లోనకొస్తున్న కార్తికేయ కనిపించాడు.

"నా వెనకే వస్తున్నావ్. ఎక్కడికి వెళ్ళావ్ కార్తీ?" బుల్లెట్ బైక్ దిగుతున్న కార్తికేయను విస్మయంగా చూస్తూ అడిగింది సంజనా.

"చిన్న పనుండి అలా ఊళ్ళోకి వెళ్ళాగాని లోనకు పద" అన్నాడు. జరిగింది చెప్పలేదు.

ఆ రాత్రి భోజనాలైన కొద్దిసేపటికే జయమ్మను అవుటవుస్‌కు పంపించి వేసి తలుపులు భద్రంగా మూసి నేరుగా కార్తికేయ గదిలోకి వచ్చేసింది సంజనా. పూల డిజైన్‌తో కూడిన నైటీ, జడనిండుగా మల్లెపూల దండ. మల్లెలవాసనకుతోడు ఆమె వాడే సెంటువాసన సోకి కాసేపు ఉక్కిరిబిక్కిరయ్యాడు కార్తికేయ.

"సంజా వచ్చేశావేంటి? ఈ రాత్రికూడా ఇక్కడేనా?" ఒకింత విస్మయంగా అడిగాడు.

"ఈ రాత్రేకాదు. ప్రతి రాత్రీ ఇక్కడే" అంటూ డబుల్‌కాట్ ఎక్కేసి పడుకుంది.

"ఓకే! నేవెళ్ళి నీ గదిలో పడుకుంటాను" అంటూ లేవబోతుంటే విసురుగా మీదకు లాగి కౌగిట బంధించేస్తూ ముద్దిచ్చింది సంజన.

"అదికాదు సంజా. చెప్పేది విను" నచ్చచెప్పాలని చూశాడు కార్తికేయ.

"ఇంకేం చెప్పకు. వినను. అయినా నాకు తెలీకడుగుతాను బావా. ఒక్క రాత్రితోనే నామీద మోజుతీరిపోయిందా?" అతడ్ని పక్కకునెట్టి ఎదమీదకుపాకుతూ అడిగింది. ఆమె మోజు తీరిందా అంటూ దెప్పటంకన్నా బావని పిలవటం కొత్తగా ఉండి కార్తికేయను అబ్బురపరిచింది. వింతగా చూశాడు.

"ఏయ్. ఉన్నట్టుండి ఏమయింది నీకు? కార్తీ అని ముద్దుగా పిలిచేదానివి. కొత్త వరస ఏమిటి, బావా అంటూ" అని అడిగాడు.

ఏమిటో సంజనాకు తెల్సు. కాని చెప్పలేదు. ఎందుకంటే చెప్పనంటూ తండ్రికి ప్రామిస్ చేసింది.

"ఏంటంటావా, చెప్తా ఆగు" అంటూ లేచికూచుంది. **ఇంకా ఉంది**

> రామ్‌గోపాల్‌వర్మ తీసిన గాడ్, సెక్స్ అండ్ ట్రూత్ సినిమా చూడమని ఎవరూ బలవంతం చెయ్యనప్పుడు వివాదమెందుకు. -కృష్ణంరాజు, నటుడు






## సూర్య కుటుంబం

సూర్యుని తల్లి అదితి, తండ్రి కశ్యపుడు.భార్యలు సంజ్ఞ, ఛాయ, ఉష, పద్మిని. పుత్రులు- యముడు, వైవస్వతమనువు, శని, సావర్ణి, అశ్వీదేవతలు (అశ్వినీ దేవతలనకూడదు) రేవతుడు.

సూర్యాంశతో పుట్టినవాళ్ళు- సుగ్రీవుడు, కర్ణుడు. కుమార్తెలు- యమున, తపతి, సువర్చల. అల్లుళ్ళు- సముద్రుడు, సంవరుణుడు, హనుమంతుడు.

గోత్రం-కాశ్యప ('కశ్యపునికి సంబంధించిన' అని అర్థం) లేదా కశ్యపస (కశ్యపునితో సమానమైన గోత్రం). సూర్యుణ్ణి ఆరాధించినవారిలో ఉత్తములు- సత్రాజిత్తు, ధర్మరాజు. సూర్యవిరోధులు. మందేహు లనే పేరున్న రాక్షస సమూహం. ❐

## పాతాళలోకం

ప్రతిరోజూ ఉదయకాలంలో కన్పిస్తూ సాయం కాలంలో అస్తమిస్తూ ఉండే సూర్యుణ్ణి- మనకి నిరంతరం కన్పిస్తూ ఉంటాడు కాబట్టి పెద్దగా లెక్కించుకోం. ఆయనే ఉదయించని పక్షంలో ఏది చెట్టో ఏది పుట్టో ఎదురుగా అసలు ఏమున్నదో... ఏమీ అర్థం కాదు. కాబట్టి ప్రతిరోజూ మనకి దృష్టిని (చూచే శక్తిని) అందిస్తున్నవాడు సూర్యుడన్నమాట.

ఇక సూర్యుడే గనుక రోజూ ఉదయించని పక్షంలో ప్రతినిత్యం చీకటి మాత్రమే రాజ్యం చేస్తుంది.

అలా ఉండేదే పాతాళలోకం. చెప్పలేనన్ని హానికర క్రిములు పుడతాయి చీకటి కారణంగా.

## శ్రీ రంగనాథ స్తుతి

నీలాంబువర్ణే భుజపూర్ణకర్ణే
కర్ణాంతనేత్రే కమలాకళత్రే
శ్రీవల్లి రంగే జితమల్లరంగే
శ్రీరంగరంగే వమతా నమామి॥

నీలకమలవర్ణుడూ, భుజాలవరకూ శ్రవణాలూ, చెవులవరకూ నేత్రాలున్నవాడూ, లక్ష్మీదేవి ధర్మపత్నిగా కలవాడు, శ్రీవల్లి ఆండాళ్‌కు హృదయాన్ని ఇచ్చిన శ్రీరంగ రంగధామునికి కైమోడ్పులు. ❐

శరీరానికి ఎండ తగలని కారణంగా రక్తప్రసరణ సరైన తీరులో ఉండదు. ఎనభై నాలుగు లక్షల జీవ రాసులకీ ఆహారాన్ని తన కిరణాలవల్ల ఇస్తూండే సూర్యుడు రానిపక్షంలో ఎవరికీ తిండి అనేదిఉండదు. మేఘాలు ఏర్పడవు. వర్షాలుండవు.

ప్రపంచమంతా అల్లకల్లోలమైపోతుంది. ❐

## ఉత్తమదాత

కృపణేన సమో దాతా న భూతో న భవిష్యతి।
అస్పృశన్నేవ విత్తాని యః పరేభ్యః ప్రయచ్ఛతి॥

పిసినారి అయినవాడు సొమ్మును తీవ్రమైన శ్రమ చేసి సంపాదించి సంపాదించి తాననుభవించలేక (మనసు ఒప్పక) అంత సొమ్మునీ తన వారసులకి అలా అందించి వెళ్ళిపోతాడు.

కనీసం ఆ సొమ్ముతో ఒక్కసారైనా అనుభవపూర్వక ఆనందాన్ని పొందకుండా ఇచ్చేస్తున్నాడంటే అతని కంటెఉత్తమ దాత ఎవరు?- కాబట్టితాననుభవించాకనే తన వారసులకియ్యాలని సందేశం. ❐

{ ఇతరులను మెప్పించడం కోసం
జీవించడం కాదు, పరమాత్ముని
మెప్పించేందుకు జీవించు. }

## గురు అనుగ్రహం

ఎవరికైనా ఓ ఉత్తమపురస్కారం లభించగానే 'నా కృషీ దానికి తోడుగా నా అదృష్టం కలిసొచ్చాయి కాబట్టి ఈ పురస్కారం లభించింది నాకు' అని అనడం విన్పిస్తూ ఉంటుంది.

అసలు గురువు అనేవాడు తనకి, ఈ తీరుగా ఎదుగుదల ఉండే విధంగా బుద్ధిలో విద్యని ప్రవేశ పెట్టని పక్షంలో ఈ పురస్కారం లభించి ఉండేదా? ఫలానితీరుగా కృషిచేస్తే ఎదగగలననే ఊహ అయినా ఆ శిష్యునికి వచ్చి ఉండేదా?

కాబట్టి ఏ పురస్కారం లభించినా అది లౌకికంగా ఈ గురుఅనుగ్రహం కారణంగా, దీన్ని ఆమోదించిన ఆ గురు (గురువనే మాటకి శ్రీహరి అని అర్థం- గురు ర్గురుతమో ధామ...) అనుగ్రహం కారణంగానే నా కృషీ అదృష్టం... పురస్కారానికి కారణమనడం ఓ తీరుగా గురుద్రోహమే.

అందుకే వేదాన్ని గానం చేయబోయేముందు 'శ్రీ గురుభ్యో నమః' అని ప్రారంభిస్తారు.

పూజా ప్రారంభంలోకూడా గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః... అనే శ్లోకాన్ని పఠిస్తారు.

# వెంటాడే దెయ్యం

జొన్నలగడ్డ రామలక్ష్మి

అందమయిన పార్కు. గాలి చల్లగా,ఆహ్లాద కరంగా ఉంది. ఆ పార్కులో గులాబి పొదమాటున ఎదురెదురుగా కూర్చుని వున్నారు కపిల్, సుమ. ఇద్దరూ ఒకే కంపెనీలో రెండేళ్ళుగా సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు. ఏడాదిగా ప్రేమికులు. అది ఇంకా అటూ ఇటూ పెద్దలకి తెలియదు. సమస్యేమిటంటే సుమతల్లిదండ్రులు బాగా డబ్బున్నవాళ్ళు. ఆమె తండ్రికి లేనివాళ్ళు అంటే మరీ చిన్నచూపు.

"ఆడపిల్లని నేనేం చెబుతాను? నువ్వుముందడుగేస్తే నేను నీకు వత్తాసు పలుకుతాను" అంటుంది సుమ. కపిల్ తండ్రి టీచరు. పెద్దకూతురు పెళ్ళిఅప్పు ఇంకా తీరలేదు. రెండో కూతురు పెళ్ళికి సిద్ధంగా ఉంది. కొంత ఎడ్యుకేషన్ 'లోను', కొంత స్కాలరు షిప్పుతో కపిల్ చదువు గట్టెక్కింది.

ఆర్థికఇబ్బందుల్లోంచి గట్టెక్కడానికి ఆ కుటుంబానికి ఇంకా నాలుగైదేళ్ళు పట్టొచ్చు.

"అయినింటి పిల్లవి...నేనడిగితే డబ్బుచూసి నిన్ను వలలో వేసుకున్నానంటారు" అంటాడు కపిల్.

"ముందు అసలు అడిగే సాహసం చెయ్యాలి" అంటుంది సుమ. "ఆ సాహసమేదో నువ్వే చెయ్యొచ్చుగా" అని కపిల్ అంటే,

"నాకు చేతనైన సాహసం ఒక్కటే!సాహసికి వత్తాసుగా ఉండడం" అని తేల్చేసింది సుమ. అలా వాళ్ళ 'పెహలే ఆప్'లతో కాలం గడిచిపోతోంది.

ఇంతలో కపిల్ తండ్రి గుండె కాస్త బలహీన పడింది.ఆపరేషన్‌కి రెండులక్షలవుతుంది. కపిల్ ఉద్యోగానికి మెడికల్ ఫెసిలిటీస్ ఉన్నాయి కానీ తండ్రి ప్రభుత్వోద్యోగి కాబట్టి ఆ సదుపాయం ఆయనకి అందదు. ఆయన ఉద్యోగానికీ మెడికల్ ఫెసిలిటీస్ ఉన్నాయి కానీ ప్రభుత్వ ఆఫీసులో కాగితాలు కదలడానికి టైమ్ పడుతుంది. డబ్బు అర్జంటుగా కావాలి.

సుమ ఆదుకోగలదు. కానీ ఇంట్లో పెద్దలకి తెలియకుండా ఆమె తన జీతంలోంచి పైసా ఖర్చుపెట్టదు. ఇంట్లో చెప్పాలంటే, "ఈ పేదోళ్ళున్నారే" అంటూ తండ్రినుంచి లెక్చర్ మొదలవుతుంది.

సుమని అడగడం కపిల్‌కి ఇష్టంలేదు. "ఏదో సాహసం చేసి డబ్బు సంపాదిస్తాను తప్ప నిన్నూ, మీవాళ్ళనీ అడగను. ఆ తర్వాత నువ్వు 'ఈ సాహసికి వత్తాసు పలికి' అన్నమాట నిలబెట్టుకోవాలి" అన్నాడు కపిల్. ఆ సాహసం ప్రస్తావనే ప్రస్తుతం ఇద్దరి ముఖాల్నీ గంభీరం చేసింది. అతడేం చెప్పాడంటే...

టైమ్ రాత్రి ఎనిమిది. రూమ్‌లో కపిల్. బయట వాన. తనవాళ్ళు వేరే ఊళ్ళో. తను ఇక్కడ ఆఫీసుకి దగ్గర్లో చిన్న రూమ్‌లో. తలుపు తట్టిన చప్పుడయింది. ఉలిక్కిపడి లేచి వెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా ఒకరి పక్కన ఒకరు ఇద్దరు నడివయస్కులు. ఒకడు బాగా తడిశాడు. చేతిలో చిన్న క్యాష్‌బ్యాగ్ ఉంది. రెండోవాడు పెద్దగా తడిసినట్లులేదు."నేను రమేష్. ఎందుకొచ్చిందీ చెబుతాను. లోపలకు రావచ్చా?" అన్నాడు క్యాష్ బ్యాగ్ వ్యక్తి.

రమేష్, ఆ వెనుకే రెండో వ్యక్తి లోపలకొచ్చారు. రూమ్‌లోని రెండు కుర్చీల్లోనూ చెరొకరూ కూర్చున్నారు.కపిల్ మంచంమీద కూర్చున్నాక,"డొంక తిరుగుడు ఇష్టముండదు.వచ్చినపని సూటిగా చెబుతాను" అంటూ గొంతుసవరించాడు రమేష్.పక్కన కూర్చున్నవాడు కపిల్‌ని చూసి అదోలా నవ్వాడు.

రమేష్‌ది చిట్‌ఫండ్ వ్యాపారం. భాగస్వామి తరుణ్‌కి వేరే ఫైనాన్స్ కంపెనీ కూడా ఉంది. మదుపరులకు హెచ్చు వడ్డీలిస్తానని డిపాజిట్లు తీసుకుంటాడు. రియల్ ఎస్టేట్‌లోనూ, సినిమాల్లోనూ పెట్టుబడి పెట్టి, లాభాల్లో కొంత మదుపరులకిస్తాడు.

ఉమ్మడిగా చిట్‌ఫండ్ వ్యాపారం, విడిగా తరుణ్ ఫైనాన్స్ వ్యాపారం చక్కగానే నడుస్తున్నాయి.

కానీ ఎందుకో మరి ఉన్నట్లుండి ఓరోజు తరుణ్ ఆత్మహత్య చేసుకున్నాడు. అతడికి వారసులంటూ ఎవరూ లేక, ఫైనాన్స్ వ్యాపార బాధ్యతలు కూడా రమేషే తీసుకున్నాడు. ఆ తర్వాతనుంచి కళ్ళుమూస్తే చాలు, తరుణ్ కలలో కనిపించి అతణ్ణి తెగ భయ



పెడుతున్నాడు. అలా కొన్నాళ్ళయిన తర్వాత ఓ రోజు రమేష్ కలలోనే తెగించి, తనకేం కావాలో చెప్పమని అడిగాడు.

అప్పుడు చెప్పాడు తరుణ్. తాత్కాలికావేశంలో ప్రాణాలు తీసుకున్నాడు కానీ చెయ్యాల్సిన పనులింకా ఉన్నాయి. ఊరికే తన సంపదని అనుభవిస్తున్న రమేష్‌ని ఆ బాధ్యత తీసుకోమన్నాడు.

ఆ వివరాలు తన డైరీలో ఉన్నాయి. కానీ ఆస్తి దక్కినంత సులభంగా ఆ డైరీని రమేష్‌కి దక్కనివ్వడు. ఎవరైనా ధైర్యవంతుణ్ణి వెదికి పట్టుకుని అతణ్ణి ఒప్పించి తరుణ్ ఇంటికి పంపి ఆ డైరీని వెదికి తెచ్చే ఏర్పాటుచేసుకోవాలి! "నా నెట్‌వర్క్‌తో నీకు డబ్బవసరమని తెలిసింది. రెండు కాదు, మూడు లక్షలిస్తాను.నువ్వు రహస్యంగా ఆ ఇంటికెళ్ళి ఆ డైరీ తెచ్చిపెట్టాలి" అన్నాడు రమేష్ కపిల్‌తో.

మూడు లక్షలనగానే ముందు కపిల్ ఆశపడ్డాడు. అంతలోనే వివేకం పనిచెయ్యగా "నువ్వు చెప్పింది జానపదకథలా ఉంది.నమ్మేలా లేదు. ఒకవేళ నిజమే అయినా, నీ కల ఓ భ్రమ" అన్నాడు.

"ముందు నేనూ అలాగే అనుకున్నాను. తరుణ్ మరణం, అతడి ఆస్తి నాకు కలిసిరావడం ఆకస్మికంగా జరిగాయి. అది జీర్ణించుకోలేక నాలో అలాంటి భ్రమలు కలిగాయేమో అనుకున్నాను. ఒకరోజు నేనే తరుణ్ ఇంటి కెళ్ళాను. డైరీలాంటిది ఏమైనా ఉంటే వెదుకుదామని" ఆగాడు రమేష్.

తరుణ్‌ది చిన్న డాబా ఇల్లు. ఇంట్లోనే చనిపోయాడని, కొన్నాళ్ళపాటు ఆ ఇంటిని పాడుబెట్టాలన్నారు. ఇంటి తాళాలు రమేష్ దగ్గరే ఉన్నాయి. రమేష్ ఆ ఇంటికి వెళ్ళబోతే, పొరుగువాళ్ళు వారించారు.

ఆ ఇంట్లో దయ్యం తిరుగుతోందిట. "నీకు నవ్వొస్తే రావచ్చు. కానీ నాకు దయ్యాలంటే భయం. మరి ముందుకెళ్ళలేదు" అన్నాడు రమేష్.

కపిల్‌కి నవ్వు రాలేదు. నిజానిజాలు తెలియవు కానీ ఇలాంటి కథలు చిన్నప్పుడు కొన్ని తన ఊళ్ళోనూ విన్నాడు."ఐనా నేను దయ్యాల్ని నమ్మను" అన్నాడు రమేష్‌తో.

"దయ్యాల్ని నమ్మకు. కానీ నన్ను నమ్ము" అని అతడు తన క్యాష్‌బ్యాగ్ జిప్ తీశాడు. కొన్ని నోట్ల కట్టలు కపిల్‌కి అందించి, "ఏ విషయంలోనైనా నాది అడ్వాన్స్ పేమెంట్" అన్నాడు.

కపిల్ తనకళ్ళని తనే నమ్మలేకపోయాడు.మూడు లక్షల నగదు. వెతుక్కుంటూ వచ్చి చేతిలో పడింది. తర్వాత రమేష్ అతడికి తరుణ్ ఇంటి తాళం, చిరునామా వివరాలున్న ఓ కాగితం ఇచ్చి-

"స్వానుభవంతో చెబుతున్నా. దయ్యాలున్నాయి. వాటిని అపనమ్మకంతో కాదు, ధైర్యంతో ఎదుర్కోవాలి. దయ్యాలమీద పరిశోధన అంటావో, మరేదైనా చెబుతావో, ఎలాగో అలా ఆ ఇంటికెళ్ళి, వారంరోజుల్లో నాకా డైరీ సాధించిపెట్టు. ప్రయత్నమంటూ చేస్తే, పని జరక్కపోయినా ఫరవాలేదు.

కానీ, మోసం చేశావో, డబ్బుతో బిజినెస్ చేసేవాణ్ణి ఏం చేస్తానో చెప్పక్కర్లేదు" అని హెచ్చరించి లేచాడు రమేష్. పక్కనున్న వ్యక్తి కూడా లేచాడు.అప్పుడర్థమైంది కపిల్‌కి, రమేష్‌తోపాటు మరో మనిషిని ఎందుకు తీసుకొచ్చాడో! తన బుద్ధి వక్రీకరిస్తే, తన విషయం ఆ రెండోమనిషి చూసుకుంటాడు.

"అంటే ముష్టి మూడు లక్షలకోసం నువ్వా దయ్యాల కొంపకి వెడతావా?" అంది సుమ.

"రమేష్ వేసింది ముష్టి అన్నది నిజం. మూడు లక్షలు నిజం. నేను తరుణ్ ఇంటికి వెడుతున్నది. నిజం.ఆ ఇల్లు దయ్యాలకొంప అన్నది మాత్రం నిజం కాదు. నేను దయ్యాల్ని నమ్మను" అన్నాడు కపిల్.

"కానీ పెద్ద చిట్‌ఫండ్ వ్యాపారి దయ్యాన్ని నమ్మాడు. ఒక డైరీకోసం నీకు మూడులక్షలు ఇచ్చాడు. ఇది మామూలు వ్యవహారం కాదనీ, ఏదో ప్రమాదముండొచ్చనీ నీకనిపించడంలేదా?" అంది సుమ.

కపిల్ నవ్వి "రాజకీయనాయకులతోసహా డబ్బుతో వ్యాపారం చేసేవాళ్ళందరికీ ధైర్యాన్నిచ్చేది ఈ మూఢ నమ్మకాలే. వాళ్ళ మూఢనమ్మకాలే నాలాంటి కొందరికి బ్రతుకుతెరువు" అన్నాడు.

సుమ కొంచెం ఆలోచించి "ఐతే నీ సాహసానికి ముహూర్తం నేను పెడతాను. తరుణ్ ఇంటి తాళం నాకివ్వు. ముహూర్తం చెప్పేటప్పుడే వాటిని నీకు అందజేస్తాను" అంది సుమ.

కపిల్ ఆమెకు తాళమిచ్చాడు. ఆమె ముఖంలోని అసంతృప్తినీ, భయాన్నీగుర్తించి నిట్టూర్పువిడిచాడు.

కపిల్ రూమ్‌కెళ్ళిన అరగంటకి సుమనుంచి ఫోనొచ్చింది. "రేపు సాయంత్రం ఏడింటికి ముహూర్తం. ఆఫీసుకి సెలవేగా, సాయంత్రం నాలుగింటికి పార్కుకొస్తే, నీకు తాళం ఇస్తాను" అంది సుమ.

కపిల్‌కి ఒళ్ళు ఝల్లుమంది. అతడు రమేష్ చెప్పిందంతా మననం చేసుకుని, తీవ్రాలోచనలో పడ్డాడు. ఆత్మహత్య చేసుకున్న తరుణ్ రమేష్‌కి కలలో కనిపించి బెదిరించడమేమిటి? రమేష్‌కి ఏదో చెప్పడమేమిటి? ఆ వివరాలున్న డైరీని వేరెవ్వరిచేతనో తెప్పించమనడమేమిటి?

ఈ కథలో ఏదో తిరకాసుంది.

రమేష్‌కి తరుణ్ డైరీ కావాలి. అందులో తరుణ్ వ్యాపారానికి సంబంధించిన రహస్యాలేవో ఉండవచ్చు. డైరీ విషయంలో తన జోక్యమున్నట్లు బయటపడకూడదని ఓ దయ్యం కథ అల్లాడు.

డైరీకోసం తనకి మూడులక్షలిచ్చాడు.అంటే ఆ డైరీలోని సమాచారం విలువ అంతకు చాలా రెట్లు ఉండాలి. తనా డైరీ తేగలడా? తేవడంలో ప్రమాదముందా? వస్తే డైరీ వస్తుంది, పోతే కపిల్ పోతాడనుకున్నాడా? అతడిలో కొంచెం భయం మొదలైంది. తనకేదైనా ఐతే అనుకుంటూ కళ్ళు మూసుకుని ప్రయత్నిస్తే కాసేపటికి నిద్ర పట్టింది.

లేచేసరికి ఏడైపోయింది. మొబైల్లో చూస్తే వాటిలో చాలా అలర్ట్స్ ఉన్నాయి. ముఖ్యమైన మెసేజ్ ఒకే ఒక్కటి సుమనుంచి "మెయిల్‌చూసుకో.రమేష్ చిట్ ఫండ్ కంపెనీ వివరాలు సేకరించి పంపాను.

సాయంత్రం పార్కులో కలుసుకుంటాను. అంత వరకూ నన్ను కాంటాక్ట్ చెయ్యొద్దు" అని వుంది.

మెయిల్ చూస్తే చిట్‌ఫండ్ కంపెనీ నిజం. తరుణ్ ఆత్మహత్య చేసుకున్నమాట నిజం. రమేష్, తరుణ్ వ్యాపారానికి వారసుడవడం నిజం.

"తరుణ్ కంపెనీ వివరాలు నాకు దొరకలేదు.

ముఖచిత్రం

“'ఆకతాయ్' అమ్మాయి రుక్షర్ తన తెలుగు సినీ ప్రయాణం బావుందంటూ మల్లెపువ్వు మాదిరినవ్వులు రువ్వింది.

"నాని సరసన 'కృష్ణార్జున యుద్ధం'లో నటించడం చాలా బావుంది.

ఈ సహజ నటుడితో కలిసి పనిచేస్తూ చాలా విషయాలు నేర్చుకున్నాను. తెలుగు పరిశ్రమకు మంచి నటి లభించిందంటూ నాని నన్ను ప్రశంసించడాన్ని మరువలేను. తను చాలా కామ్‌గా వుంటాడు.

తనతో కలిసి పనిచేయడానికి నేనుఅస్సలు యాంగ్జయిటీగా ఫీలవలేదు. భాష నాకు సమస్య కాలేదు. స్క్రిప్టు తీసుకుని ముందు గానే హోమ్‌వర్క్ చేసుకోవడంతో ఇబ్బంది అన్పించలేదు" అని తెలిపింది.”



రమేష్‌ఫోటో మాత్రం దొరికింది. అది అటాచ్‌మెంట్‌గా ఉంచాను" అని చివర్లో రాసింది.

కపిల్ ఆత్రుతగా ఫోటో డౌన్‌లోడ్ చేశాడు. తీరా చూస్తే ఆ ఫోటో తనింటికి వచ్చినవ్యక్తిది కాదు. కానీ మిగతా వివరాలన్నీ రమేష్‌కి అతికినట్లు సరిపోతున్నాయి. సుమ తప్పు ఫోటో పంపిందా?లేక తనవద్దకు వచ్చినవ్యక్తి రమేష్ కాడా? కాకపోతే మరెవరు?

కపిల్ అదేపనిగా ఆలోచిస్తే తను నిజంగానే ఏదైనా ప్రమాదంలో ఇరుక్కున్నానా అనిపించింది.

సాయంత్రం నాలుగుకి సుమని అతడుపార్కులో కలుసుకున్నాడు. సుమ అతడికి తాళంచెవి అందించింది. కపిల్ చేతులు వణికాయి."నాకు దేవుడిపై నమ్మకంలేదు.నేననుకున్నది సాధించాలని దేవుడికి దణ్ణం పెట్టుకో" నెమ్మదిగా అన్నాడు.

సుమ నవ్వి "నాకు దేవుడిపై నమ్మకముంది కానీ నావల్ల కానిపనికే ఆయనకి మ్రొక్కుకుంటాను" అంటూ తన హ్యాండ్‌బ్యాగ్‌లోంచి ఓ చిన్న పుస్తకంతీసి కపిల్‌కి అందించి, "ఇది తరుణ్ డైరీ" అంది.

కపిల్ తెల్లబోయి ఏదో అనబోతే,"ఔను, ఈరోజు ఉదయం తరుణ్ ఇంటికెళ్ళాను. ఎవరూ అడ్డురాలేదు. తాళం తీసి లోపలికెళ్ళాను. బెడ్రూమ్‌లో ఓ బీరువాలో ఉంది.అందులో ఈ డైరీ దొరికింది"అంది సుమ.

కపిల్ ఉద్వేగంగా, "నువ్వెందుకెళ్ళావ్! నీకేదైనా అయితే?" అన్నాడు.

"అదే భయం నీ గురించి నాకూఉంది మరి. అదికాక ఈ సాహసం నువ్వు చేస్తే, మా నాన్నతో నేను మాట్లాడాల్సి ఉంటుంది. ఆ అవకాశం నీకివ్వాలన్నది నా పట్టుదల!" అంది సుమ.

"అసలా ఇంట్లోకెలా వెళ్ళావ్?ఎవరూ ఏమనలేదా?" ఆత్రుతగా అడిగాడు కపిల్. "ఆ ఇంట్లో అద్దెకు వస్తున్నాననీ, ఇంటివాళ్ళు ఇల్లు చూసుకోమని తాళం ఇచ్చారనీ చెప్పాను. నా రూపం, ఆ తాళం అనుమానానికి ఆస్కారం లేకుండా చేశాయి. ఈ మాత్రందానికి ఆ రమేష్ మూడు లక్షలు ఎందుకు ఖర్చుపెట్టాడో తెలియలేదు" అంది సుమ. "ఇంతకీ ఆ డైరీలో ఏముందో చూశావా?" అన్నాడు కపిల్.

"ఓసారి తిరగేశాను. అంతా కోడ్ లాంగ్వేజ్. డీకోడింగుకి ప్రయత్నించలేదు. అంతా పెద్దవాళ్ళతో వ్యవహారం. గీత దాటకూడదు" అంది సుమ.

"మంచిపనిచేశావు. నువ్వు నాకు పంపిన ఫోటో రమేష్‌ది కాదు, తెలుసా?" అన్నాడు కపిల్.

"ఔనా?" అంది సుమ ఆశ్చర్యంగా.

ఇద్దరూ విషయాన్ని చర్చించాక "ఇదేదో ప్రమాదకరమైన వ్యవహారమే! మనం దీన్ని ఇంతటితో వదిలేద్దాం. నువ్వు వెంటనే డైరీని అందజెయ్యవలసిన వాళ్ళకి అందజెయ్యి" అందామె.

ఆ రాత్రి ఎనిమిదింటికి నకిలీ రమేష్ మళ్ళీ కపిల్ గదికి వెళ్ళాడు. ఈసారి ఒక్కడే వచ్చాడు.

కపిల్ ఇచ్చిన డైరీ తీసుకుని ఓసారి తిరగేసి, "థాంక్యూ! ఇదే నాక్కావలసింది" అన్నాడు.

వెనక్కి తిరిగి వెళ్ళిపోతూ,"ఈ డైరీ దొరికిన విషయం మనిద్దరి మధ్యే ఉండాలి. మూడో మనిషికి తెలియకూడదు" అన్నాడు.



హైదరాబాద్‌లో వసూలయ్యే పన్నుల్లో 40 శాతం ఆంధ్రులు కడుతున్నదే. -రాజీవ్‌కుమార్, నీతి ఆయోగ్ ఉపాధ్యక్షుడు

డైరీ సరైనదే కావడం కపిల్‌కి సంతోషాన్నిచ్చింది. "ఆ విషయం, ఈసారి మీరొక్కరే వచ్చినప్పుడే అర్థమైంది" అన్నాడు కపిల్.

"ఈసారేమిటి? క్రితం సారీ నేనొక్కణ్ణే వచ్చాను" అన్నాడు నకిలీ రమేష్ ఆశ్చర్యంగా.

"లేదు. అప్పుడిద్దరు వచ్చారు. చెరోకుర్చీలోనూ కూర్చున్నారు" అంటూ జరిగింది గుర్తు చేశాడు కపిల్. నకిలీ రమేష్‌కి అతడు చెప్పేది అర్థమవడానికి కాసేపు పట్టింది. ఉన్నట్లుండి తన మొబైల్ తీసి అందులో ఓ ఫోటో చూపించి,"నువ్వు చూసింది వీణ్ణి కానీ కాదు కదా!" అన్నాడు.

"ఔను, ఈయనే ఆరోజు మీతో వచ్చింది,చూశారా ఈయన మీకు బాగా తెలుసు" అన్నాడు కపిల్.

"నాతో వీడెలా వస్తాడు? అప్పటికి వీడు చచ్చి నెల దాటింది" అన్నాడు నకిలీ రమేష్.

ఉలిక్కిపడ్డాడు కపిల్. అంటే ఆ రోజు నకిలీ రమేష్‌తో వచ్చినవ్యక్తి తరుణ్. కానీ అదెలా సాధ్యం? ఆలోచిస్తుంటే... తరుణ్‌ని తను చూశాడు కానీ ఈ నకిలీ రమేష్ తనతో వేరేవ్యక్తి వచ్చినట్లు ప్రవర్తించలేదు. ఇద్దరూ వానలో వచ్చారు.

నకిలీ రమేష్ బాగా తడిశాడు కానీ, తరుణ్ తడవలేదు. వాళ్ళు వెళ్ళాక కూడా ఈ రమేష్ కుర్చీ బాగా తడిసుంది కానీ, తరుణ్ కుర్చీ పొడిగా ఉంది. అంటే... "ఇప్పుడు నాతో ఎవరూ లేరన్నావ్ కదూ!" అన్నాడా రమేష్ ఆత్రంగా.

"ఔను"

"ఐతే ఓకే" అని హడావుడిగా వెళ్ళిపోయాడు నకిలీ రమేష్.

కపిల్‌కి కాసేపు బుర్ర పనిచెయ్యలేదు. తర్వాత సుమకి ఫోన్ చేసి జరిగింది చెప్పాడు.

"చాలా థ్రిల్లింగ్‌గా ఉంది. అంటే ఏ కారణం వల్లనో తరుణ్ నీ ఇంటికొచ్చిన ఆ రమేష్‌ని వెంటాడాడు. ఎందుకో మరి డైరీ దొరకగానే వదిలేశాడు. ఏదేమైనా నువ్వు దయ్యాన్నిచూశావు"అంది సుమ.

"ఔను. నేను దయ్యాన్ని చూడ్డమే కాదు. దాంతో కాసేపు గడిపాను కూడా.

ఇది సాహసం. కాబట్టి మన విషయం నువ్వే మీ నాన్నకి చెప్పాలి" అన్నాడు కపిల్.

మర్నాడు సాయంత్రం ఏడింటికి పార్కుకి వెడితే సుమ అతణ్ణి చూసి"నిన్నొక్కణ్ణే రమ్మన్నానా?, ఇంకెవర్నీ కూడా ఎందుకు తీసుకొచ్చావ్!" అంది.

కపిల్ ఉలిక్కిపడి పక్కనచూస్తే ఎవరూ లేరు.

అతడి మనసులో ఇప్పుడు రకరకాల భయాలు.. ఆలోచనలు... తరుణ్ ఇప్పుడు నకిలీ రమేష్‌ని వదిలి తనని వెంటాడుతున్నాడా? లేక లేని దయ్యాన్ని తన పక్కన సృష్టించి తనూ దెయ్యంతో గడిపి సాహసం చేశానని సుమ అలా దబాయిస్తోందా? ఏదేమైనా సుమ తండ్రికి వాళ్ళ ప్రేమవిషయం తెలిసేదాకా,

తరుణ్ దయ్యం అతణ్ణి వెంటాడుతూనే ఉంటుందేమో!

# ఇంటిపని సులువుగా, శుభ్రంగా



ఇంటిపనుల్ని వాయిదావేయడం అనేది ఒక నైపుణ్యం మరియు కళ. ఈ కళ కాలం గడిచేకొలదీ జీవితాన్ని కఠినతరం చేస్తుంది. ఒక పనిని వాయిదావేసేకొలదీ కాలం గడచిపోయి, చేయాల్సిన పనుల చిట్టా పెరిగిపోయి, ఒత్తిడికి గురై ఏ పనీ చేయలేని పరిస్థితి వస్తుంది.

ఇంటిపనుల్ని ఏరోజుకారోజు చేద్దామనేవుంటుంది. కాని రేపుచేద్దా, ఖాళీవున్నప్పుడు చేద్దాంలే అని ఇలా వాయిదాలమీద వాయిదాలు వేస్తుంటారు చాలా మంది. 'వచ్చేవారం' మన గది, గదిలోని అల్మరాలు ఇతర అన్ని వస్తువులు శుభ్రంచేసుకోవడం దగ్గర్నుంచి, 'వచ్చే నెలలో' మన వంటగదిని శుభ్రంచేసుకోవాలన్న నిర్ణయం వరకు- అన్నిటినీ వాయిదావేయాలన్న గుణం మనల్ని ప్రభావితం చేస్తుంది.

ఇంటిపనులు చేయడం అంత సులువు కాదు. అవి చేయడం సరదాకూడా కాదు.కాని అవి పూర్తి చేసినప్పుడు మనసెంతో తేలికగా ఉంటుంది. ఏదో సాధించిన అనుభూతి మనకు కలుగుతుంది.

ఇంటిపనులను పూర్తిచేయడం మనకెంత మంచిదో, అవి మన ఊహాశక్తిని ఎంత ప్రభావితం చేయగలవో గమనిద్దాం రండి.



## ఒంటరిగా గడిపే సమయం

ఇంట్లో మీరొక్కరే ఉండి, ఉత్సాహకరమైన పాటలు పెట్టుకుని, నృత్యంచేస్తూ ఇంటిపనులు చేసుకునే అలవాటు మీకుందా?

ఈ అలవాటు చాలామందికి ఉంటుంది. అలా చేయడం చాలా సరదాగా ఉంటుంది కూడా! ఇంటి పనులు చేసే సమయాన్నీ మీరు ఉత్తేజితులు అయ్యే సమయంగా మార్చుకోండి.

ఆ సమయం మీదే. మీకు నచ్చిన పాట పెట్టుకుని, ఆ పాట మీరుకూడా పాడుతూ, నృత్యంచేస్తూ ఇంటిని శుభ్రపరచుకోండి. ఒంటరిగా చేసే ఏ పనైనా- అది రోజూ చేసే పనైనాగాని, మన జీవితాలకు ఎంతో మేలుచేసి మనల్ని మనలో చూసుకునేలా చేస్తుంది. అది ఒక ధ్యానప్రక్రియలాగా మనల్నెంతో ఉల్లాసంగా ఉంచి జీవితంలోనికి నడిపిస్తుంది. ఆ ఇంటిపని పూర్తి అయినప్పుడు, ఏదో సాధించిన తృప్తి మనకు కలుగుతుంది.

స్వీయ గౌరవం ఇనుమడిస్తుంది. ఈ డిజిటల్ యుగంలో స్మార్ట్‌ఫోనులు ఇతర ఎలక్ట్రానిక్ వస్తువులు సంపాదించిపెట్టిన యాంత్రిక జీవితానికి కొద్దిసేపైనా దూరంగా ఉండగలిగే అవకాశాన్ని ఈ ఇంటి పని మనకు కల్పిస్తుంది.

అంటే మీకు విశ్రాంతి దొరికినట్లే. ఆ సమయాన్ని ఆనందంగా గడపడం తెలివిగలవారి లక్షణం.

## ప్రాజెక్టులతో కొత్తకోణం

డి.ఐ.వై. 'డూ-ఇట్-యువర్‌సెల్ఫ్' ప్రాజెక్ట్‌లంటే మనకు మనమే చేసుకునే చిన్నచిన్న ప్రాజెక్టులు. అవి ఇంటిలోని గదుల్ని కొత్తగా అలంకరించుకునే పద్ధతులు కావచ్చు లేదా ఇంటికి అవసరమైన వస్తువుల్ని వేరేవారి దగ్గరనుంచి కొనుక్కోకుండా మనకు తయారుచేసుకోవడం కావచ్చు.

అంతర్జాలంలో తరచి చూస్తే, ఇలాంటి మనకు మనమే తయారుచేసుకునే ప్రాజెక్టులు చాలా మనకు దొరుకుతాయి.

మీ ఇంటికి కొత్తశోభ తీసుకువచ్చే కొత్త సాధనాలు, గృహోపకరణాలు, గృహసౌందర్యాన్ని పెంచే

Courtesy : B+VE



చిన్నచిన్న అలంకరణవస్తువులు ఎలా తయారు చేయవచ్చో మనకు బోల్డెన్ని వీడియోలలో కనిపిస్తాయి. వాటినుండి మనం ప్రేరణ పొందకుండా ఉండలేం. ఇంట్లో ఏదో ఒకమూల పనికిరాకుండా పడివున్న అనవసరమైన వస్తువులు మనకు బోల్డెన్ని కనిపిస్తాయి. వాటినేమి చేయవచ్చో ఈ వీడియోలు మనకు నేర్పుతాయి.

పాత సీసాలు, కూజాలు ఉపయోగించి, టూత్ బ్రెష్‌లు పెట్టుకునే వస్తువు తయారుచేయడం, సాక్స్ మరియు చేతి రుమాలు దాచుకోవడానికి ఏదైనా డబ్బాలాంటిది తయారుచేయడం, పాత వైన్ సీసాలతో దీపం తయారుచేయడం కార్డ్‌బోర్డ్‌ను ఉపయోగించి గాజులు పెట్టుకునే డబ్బా తయారుచేయడం-ఇలాంటివెన్నో చాలా సులువుగా కొత్తగా, వెరైటీగా తయారుచేసుకోవచ్చు.

వీటిని తయారుచేయటంలో మీకున్న విషయ పరిజ్ఞానానికి మీ సృజనాత్మకతను జోడించి మీ వ్యక్తిగత ఇష్టాయిష్టాలకు తగ్గట్లు ఆ వస్తువులను అందంగా తయారుచేసుకోవచ్చు.అది మీలోని కళకు అభిరుచికి నిదర్శనంగా నిలిచే అవకాశం ఉంది.

మీ ఈ 'డూ-ఇట్-యువర్‌సెల్ఫ్' ప్రయాణం మీ వ్యక్తిత్వాన్ని ఎంతో ఉన్నతంగా నిలబెడుతుంది, జీవితంపట్ల సానుకూల దృక్పథాన్ని అలవరుస్తుంది.





Courtesy : VANITHA

అందుకే ఈ ప్రయాణాన్ని మొదలుపెట్టడం అభిలషణీయం, స్ఫూర్తిదాయకం. సాధారణంగా మనం పనికిరానివి అని వదిలేయడానికి సిద్ధపడే ఎన్నో వస్తువులు కొత్త రూపు సంతరించుకుని మీ వ్యక్తిత్వాన్ని ప్రతిబింబిస్తాయి. మరెందుకాలస్యం ఆ పని మీదే ఉండండి మరి!

## ఇంటిని, మనస్సును శుభ్రంచేసుకోవడం

నిజాలు నిర్భయంగా మాట్లాడుకుందాం రండి. ఈ-కామర్స్ రంగం మనల్ని ఎంత తీవ్రంగా ప్రభావితం చేస్తుందో మనకు తెలిసిందే.

మన 'కొనుగోలుశక్తి' పెరిగిపోయి 'వినియోగ శక్తి'ని మించిపోయింది.

మన ఇంట్లో ఏమేమి వస్తువులు ఉన్నాయో కూడా మనలో చాలామందికి తెలియని స్థితి మనది. ఆన్‌లైన్ షాపింగ్ క్రెడిట్ కార్డుల కొనుగోలు శక్తి మాయలో పడి కొత్తబట్టలు కొనేస్తున్నాం.

రెండు, మూడుసార్లు వేసుకుని అవి పక్కన పడేస్తున్నాం.ప్రస్తుతానికి 'అవసరం'లేని చాలా వస్తువులు, ఆఫర్లు ఉన్నాయి కదా అని, డిస్కౌంట్‌లు ఇస్తున్నారు కదా అని కొనేస్తున్నాం, తర్వాత వాటిని పక్కన పడేస్తున్నాం. ఇలా ఆన్‌లైన్ షాపింగ్ మాయాజాలంలో ఇరుక్కుపోతున్నాం.

కొన్నిసార్లు మన ఇంటిగదిలో ఏయే వస్తువులు ఉన్నాయో కూడా మనకు తెలియదు. రెండు, మూడు రోజులుగా ఏమి కూర వండామో, వాటిలో ఎన్ని 'మిగిలిన' కూరలు ఫ్రిజ్‌లో 'ఇరికించ'బడ్డాయో కూడా మనకు అవగాహన ఉండడంలేదు.

వాటికి ఎప్పుడోగాని మోక్షం రాదు. ఇంటిని పరిశుభ్రంచేయడం అంటే వ్యర్థంగా నిరుపయోగంగా పడి ఉన్న ఎన్నో వస్తువులను ఏరిపారెయ్యడం.

మన ఇంటిలో ఎన్ని వస్తువులున్నాయి, ఏమేమి వస్తువులున్నాయి, వాటిలో మనకు ఉపయోగపడేవెన్ని, నిరుపయోగంగా ఉన్న వస్తువులెన్ని- ఇలాంటి ప్రశ్నలు మనకు ఉపయోగపడతాయి.

ఉన్నవాటితోనే సంతృప్తిపడడం ఎలాగో, వాటిని ఉపయోగించడం ఎలాగో అన్నీ మనకు అర్థం అవుతాయి.

సంతృప్తిపడడం నేర్చుకోగలిగినప్పుడు, మన సమయం మరియు డబ్బుని సక్రమంగా వాడుకోవడం కూడా మనం నేర్చుకుంటాం.

దీనివలన కృతజ్ఞులమై ఉండడమెలాగో మనం తెలుసుకుంటాం. ఈ క్రమంలో చాలా 'తక్కువ' వస్తువులతోనే ఎంత ఉన్నతంగా బ్రతకవచ్చో గ్రహించి 'కన్స్యూమరిజమ్' అనే మాయనుంచి బయటపడుతూ, అప్పుడు వస్తువులు వస్తువులుగానూ, వ్యక్తులు వ్యక్తులుగానూ కనిపిస్తారు.

ఇంటిపనుల్ని వాయిదావేయడం అనే ఆలోచనని ఇలా ఒక విభిన్నకోణంలో ఆలోచిస్తే, మనకెంతో ఇబ్బంది అనిపించే ఏ పనికూడా ఇబ్బంది కాబోదు. ఇబ్బంది స్థానే బోల్డంత ఉత్సాహం, ఏదో సాధించిన ఆనందం మిగులుతుంది.

కావున స్నేహితులారా, మీకు నచ్చిన టీషర్ట్ ధరించి ఇంటిపని 'పని' పట్టేయండి. ఇంకెందు కాలస్యం. డూ ఇట్ యువర్‌సెల్ఫ్-డూ ఇట్ నౌ!

ఆల్ ది బెస్ట్!

డాక్టర్ అశోక్‌వర్ధన్ గరికిముక్కు




"నాకూ ఈ శాస్త్రాన్ని నేర్పండి" రాకుమారుడు ఆజ్ఞ ఇచ్చాడు.

యువరాజు కోరికమీద జ్యోతిష్యశాస్త్రాన్ని కొద్ది మాసాల్లో క్షుణ్ణంగా నేర్చాడు. ఒకరోజున వృద్ధ జ్యోతిష్కుడు "యువరాజా! నేటితో విద్య పూర్తయింది. కానీ ఇన్ని రోజులుగా గమనిస్తున్నాను రాకుమారుడు వినటమేకాని ఒక్క రోజు కూడా నోరు విప్పటంలేదు" అని అడిగాడు.

సముద్రగుప్తుడు "ఈ శాస్త్రం సత్యాసత్యాలు ఎంతవరకు చెప్పగలదో నని కుతూహలం కలిగింది. కానీ నేటితో అది కూడా తీరిపోయింది"

"రాకుమారులు మరింత వివరణ ఇస్తే కృతజ్ఞుడిని"

"నా తండ్రిలాగే నేనుకూడా ఈ శాస్త్రాన్ని నమ్మటంలేదు" అన్నాడు.

ఆ మాటలు పిడుగుపాటులా తోచాయ్ ఆ వృద్ధుడికి. ఆ పండితుడికి భయం వేసి చిరుచెమటలు పట్టాయ్! 'తనను దండించడు కదా!'

సముద్రగుప్తుడు దయగా నవ్వి "మీకు హాని కల్గించను. మీ శాస్త్రమేదో మీరు చెప్పారు. కాని నా ప్రవృత్తిలో లేని విషయాన్ని జ్యోతిషచక్రం సృష్టించడం అసంభవమని నా విశ్వాసం.

నా జ్యోతిష చక్రం ప్రకారం మీరు చెప్పినవి నిజమే. పంచ గ్రహాలు ఉచ్ఛ-



అందులో విక్రమస్థానంలో శని ఉచ్ఛ.

భాగ్య రాజ్యాధిపతులు ఉచ్ఛ, గురు చంద్రులు ఉచ్ఛ అలా ఉన్నప్పుడు శాస్త్రం ఏ వివరణలు ఇస్తుందో అవే నాకు చెప్పారు. కానీ నాలో రాజ్యమంటే ఏవగింపు, రాజ్యపాలనకు అవసరమైన లక్షణాలు లేవు. అంతేకాదు మీకొక విషయాన్ని చెపుతాను"

"..........."

"ఏ కారణంగానైనా రాజ్యపాలన నానెత్తిమీద పడితే నేను ఈ రాజ్యాన్ని త్యజించివేస్తాను. అవసరమైతే అడవులకు వలసవెళ్ళిపోతానుకానీ ఈ రాజ్యభారాన్ని నానెత్తిమీద వేసుకోను. ఈ రక్తపుకూడు నాకు అక్కరలేదు. ఇది నా అంతరంగంలోని విషయం.

ఇంత దృఢంగా ఆఖరకు సామ్రాట్‌తోకూడా నేను అనలేదు. కానీ మీతో అంటున్నాను.

అమాయకంగా ఒక నిస్సారశాస్త్రాన్ని ఇన్ని సంవత్సరాలు అధ్యయనం చేసి జీవితమంతా వృధాపరిచారు"

వృద్ధ జ్యోతిష్కుడు అలా దిక్కులు చూసి తనలో తాను ఏదో గొణుక్కుని ఆ తరువాత తలదించుకున్నాడు.

సముద్రగుప్తుడు ఆ వృద్ధుడికి మరి కొన్ని బంగారునాణాలు ఇవ్వబోయాడు దయగా, జాలిగా.

వృద్ధుడు మృదువుగా తిరస్కరించి తన దారిన తానుబోయాడు. వెడుతూ వెడుతూ అన్నాడు "రాకుమారా! ఒకానొక రోజున నేను తీవ్రంగా గుర్తుకు వస్తాను. అపుడేంచేస్తావు యువరాజా!" సముద్రగుప్తుడు అదోలా నవ్వి-

"నా సింహాసనంమీద కూర్చోపెట్టుకుని సత్కరిస్తాను" అన్నాడు.

అపుడా జ్యోతిష్కుడు "నేను అంత వరకు జీవించివుండను. రాకుమారా! ఈలోగానే నేను మరణిస్తాను. నా మరణం తర్వాత నా కుటుంబం తీవ్ర దారిద్ర్యానికి గురవుతుంది. ప్రభువులు ఆదుకొనగలరని నా విన్నపం"

సముద్రగుప్తుడు తల ఊపాడు. ఆ తర్వాత ఈ సంఘటన రాకుమారుడి మనోపథంనుంచి పూర్తిగా తుడిచి వేయబడింది. ఆ రోజు నుంచి ఈ రోజువరకు సముద్రగుప్తుడు జ్యోతిష శాస్త్రాన్ని, జ్యోతిష్కులను దూరంగా ఉంచేవాడు.

కానీ ఇన్నాళ్ళ తర్వాత ఈరోజున తన మరణాన్ని ముందుగా తెలుసుకోగలిగి తన చేతుల్లో మరణించిన వృద్ధుడంటే అమిత కుతూహలం ఏర్పడింది. అతడు సామాన్యుడు కాడని,

### జ.రిగిన కథ

3 కాపాలికుడివలన మనకు ఏమీ నష్టంలేదని మహారాణికి చెబుతాడు చంద్రగుప్తుడు. భద్రకాళి పాదాలముందు తనువుంచిన ఖడ్గం మాయమయ్యేసరికి ఆశ్చర్యపోతాడు చంద్రగుప్తుడు.

అది తిరిగి ప్రత్యక్షం కావడంతో మహారాజా, రాణి ఇద్దరూ మరోసారి ఆశ్చర్యానికి గురవుతారు.

మరో భద్రకాళి ఆలయంలోకిప్రవేశించిన మహారాజుకు తిరిగి కాపాలికుడు కనబడి మాయమవుతాడు. ఓ వృద్ధుడు సముద్రగుప్తుడి వద్దకు వచ్చి రేపటి గురించిన నీ జీవిత పుస్తకం ఇందులో దొరుకుతుందని చెప్పి తాళపత్రాలిచ్చి అతని చేతిలో చనిపోతాడు. ఆ తాళపత్రాలు విచిత్రంగా మాయమవుతాయి.

ఓ రాత్రి చంద్రగుప్తుడి వద్ద ప్రత్యక్షమవుతాడు కాపాలికుడు. నీ పెద్దకుమారుడ్ని మహారాజుని చేయాలంటే నీలో భయ సందేహాలు, రెండో కుమారుడిని మహారాజును చేయాలంటే అతను శృంగార పిపాసి.

ఎవరికి రాజ్యభారం అప్పచెప్పాలా అనే ఆలోచనలో నీవు సతమతమౌతున్నావని చెబుతాడు. వచ్చే అమావాస్యరోజు భద్రకాళి ఆలయానికి రమ్మని కోరతాడు కాపాలికుడు. తర్వాత జరగబోయేది చదవండి.

## రూటు మార్చిందా?

**చే**సింది తక్కువ చిత్రాలే అయినా ఎక్కువ క్రేజ్ కొట్టేసి పాపులర్ అయింది నిత్యామీనన్. ప్రతి సినిమాలోనూ తనదైన పంథాలో గ్లామర్‌కు హద్దులు విధిస్తూ వస్తోంది. నటనకు ప్రాధాన్యం ఉండాల్సిందే.

ఇన్ని నిబంధనలతో తనదైన బాణీలో సాగుతున్న నిత్య లెస్బియన్‌గా కన్పించనున్నదని వినికిడి.

ఇద్దరమ్మాయిల నడుమ నడిచే ఈ ప్రేమకథ విన్నాక నిత్య ఓకే చెప్పేసిందట. లిప్‌లాక్ సన్నివేశాలూ వుంటాయట. ఈ రకం సినిమాకు అనుమతి లభిస్తుందో లేదో కాని నిత్యామీనన్ రూటు మార్చిందన్న సంగతిమాత్రం గుర్తించాలేమో!



మహా తపశ్శక్తిసంపన్నుడని ఒకవిశ్వాసం ఏర్పడింది. 'కానీ ఇంతకూ ఆ తాళపత్రాలు ఏమయ్యాయ్! అందులో నిక్షిప్తమయిన విషయాలు ఏమిటి? ఆ తాళపత్రాలు తనకు ఏ విధంగా ఉపకరించబడుతున్నాయ్!'

సముద్రగుప్తుడిలో తీరని భావసంచలనం. తాళపత్రాలు మాయమవటం అతడిలో ఎంతో బాధ కలిగిస్తోంది.

చేటి వచ్చింది రాజకుమారుడి ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ.

"యువరాజులకు జయము జయము. తమ సందర్శనాభిలాషియై, తమ ఆశ్రయాన్ని కోరుతూ ఒక సుందరి బయట ప్రాకారంలో మీకోసం వేచియుంది"

"సుందరా" సముద్రగుప్తుడు ఉలిక్కిపడ్డాడు. ఆ తర్వాత నివ్వెరబోయాడు. "ఏమిటి ఈ సమయంలోనా... ఇప్పుడు రాత్రి ఏ ఝామైందో తెలుసా..."

"ఆ విషయాన్ని ఆమెకు వివరించాను. రేపు సూర్యోదయం అయ్యాక రాకుమారులను కలవమని కోరాను. కానీ ఆమె మంకుపట్టింది ప్రభూ! ఆపదలో ఉన్నదట.

తక్షణమే రాజాశ్రయాన్ని కోరుకుంటున్నానని అన్నది.

ఇది పూర్తి అసమయమని తెలిసినా రాకుమారులు ఈరోజు మెలకువగా ఉన్నారని తెలిసి, ఈ సమాచారాన్ని ఈ సమయంలో తమకు విన్నవించేందుకు సాహసం చేశాను" అన్నది.

సముద్రగుప్తుడు ఒక్కక్షణం ఆలోచించి "ప్రవేశపెట్టు" అనుజ్ఞ ఇచ్చాడు. రాకుమారుడికి ఎందుకనో విస్మయముగా ఉంది. కొన్ని ఘడియల క్రితం వృద్ధుడి మరణం. ఇప్పుడు ఈసుందరి ఆగమనం. 'పైగా ఆపదలో ఉన్నదిట'

మరికొద్దిక్షణాల్లో ఆ ప్రక్కనే ఉన్న మరో మందిరంలోకి ఆ సుందరి ప్రవేశించింది. ఆసీనుడయిన రాకుమారుడి ఎదురుగా ఆ సుందరి మేలిముసుగులో నిల్చునివున్నది. సుందరిని ప్రవేశపెట్టి చేటి వెళ్ళిపోయింది. ఇపుడు ఆ మందిరంలో ఆ ఇద్దరే ఉన్నారు.

"రాకుమారుడికి అభివాదం" తలవంచి వినయంగా నమస్కరించింది ఆ సుందరి. ఒక్కక్షణం అవాక్కయిపోయాడు సముద్రగుప్తుడు.

సప్తస్వరాలు మేళవించిన వీణాగానంలా ఉంది ఆమె కంఠస్వరం. సముద్రగుప్తుడిలో తీరని పరితాపం.

'ఒక్కసారి ఆ మేలిముసుగును తొలగిస్తే' ఆ ఇద్దరిమధ్యా అనేక క్షణాలు మౌనం. అలా కొంతసేపు అయ్యాక సముద్రగుప్తుడు "సుందరీ నాకో సంశయం" అడిగాడు.

సుందరి "అడగండి రాకుమారా!"

సముద్రగుప్తుడు "ప్రకృతిలో తీయని స్వరం కోకిలకు ఉంటుంది. నీవు రాజహంసవా లేక కోకిలవా"

మళ్ళీ కొన్నిక్షణాల నిశ్శబ్దం. ఆ తర్వాత ఆమె మంద్రంగా మేలిముసుగును తొలగించింది.

సముద్రగుప్తుడి కళ్ళలో ఒక్కసారిగా కోటిసూర్యమండలాలు వెలిగాయ్! శతకోటి చంద్రోదయాలు విరిశాయ్! ఆమె అద్భుత సౌందర్యరాశి. ఇంతటి సౌందర్యాన్ని జీవితంలో రాకుమారుడు ఇంతకుమున్నెన్నడూ చూడలేదు.

'మానవరూపంలో వచ్చిన దేవాంగన కాదుకదా!' సముద్రగుప్తుడిలో నిర్వచించలేనిభావసంచలనం. ఇద్దరి మధ్య ఘడియ కాలం గడిచింది.

సముద్రగుప్తుడు అలాగే రెప్ప వాల్చకుండా చూస్తూనే ఉన్నాడు. "ఏ దేశం సుందరీ!"

"ఇంద్రప్రస్థం" అంది.

"తల్లిదండ్రులు" అడిగాడు.

"తల్లిమెగయిరా గ్రీకుసుందరి. తండ్రి మహాశిల్పి అయిన ఒక రాజపుత్రుడు" చెప్పిందామె.

"నీ నామధేయం"

"లావినియా"

సముద్రగుప్తుడు తనలో తాను రెండు మూడుసార్లు ఉచ్చరించాడు "లావినియా... లావినియా...' అని.

ఆ తర్వాత తలపైకెత్తి "లావినియా... లావణ్యా" అన్నాడు.

లావినియా మనోహరంగా నవ్వింది. ఆమె దరహాసచంద్రికలకు ఆకాశంలో పున్నమి చంద్రుడు వెలవెలబోయేట్టుగా. "ఈ క్షణం నుంచి నేను లావణ్యను రాకుమారా!"

సముద్రగుప్తుడిలో తెరలుతెరలుగా ఆనందం. "చెప్పు లావణ్యా! నీకొచ్చిన ఆపద ఏమిటి?" లావినియా - లావణ్య చెప్పటం మొదలుపెట్టింది.

**క**శ్యపబ్రహ్మ మంత్రాంగ మందిరంలో కూర్చొనివున్నాడు.

అతడికి ఎదురుగా కచగుప్తుడు ఆసీనుడయి ఉన్నాడు. కచగుప్తుడు ఈ మధ్య రాజధానీనగరంలోలేడు.

తన పరివారంతో కలసి అడవిలో వేటకోసమని గత పదిరోజులు వెళ్ళి ఉన్నాడు. వేటనుంచి తిరిగివచ్చిన కచగుప్తుడికి తీరని ఆశాభంగం ఎదురైంది. అది సామ్రాట్ తన వారసుడ్ని ప్రకటించకపోవడం. అయితే సామ్రాట్ చర్య ఒక్క కచగుప్తుడికే కాదు. యావత్ దేశాన్నీ నిరుత్సాహపరచింది.

కశ్యపబ్రహ్మకు రాజు వైఖరి అంతు పట్టడంలేదు. సామ్రాట్ చక్కటి నిర్ణయాలను తీసుకుంటాడని ఒక ప్రతీక. అంతేకాదు, ఒకసారి తీసుకున్న నిర్ణయాలను పదేపదే మార్చటం, లేదా వాయిదా వేయటం అనేవి సామ్రాట్ నిఘంటువులో లేని విషయాలు.

కచుడు కశ్యపబ్రహ్మను మరోసారి నిలదీశాడు "మహామంత్రులు కథను తారుమారుచేశారు. రాజధాని నగరానికి తిరిగివచ్చే సమయానికి కాబోయే ప్రభువుగా నన్ను అఖండసన్మానంతో ఎదురువస్తారని మాట ఇచ్చారు"

కశ్యపబ్రహ్మ "యువరాజులు మన్నించగలరు. అంతా సజావుగా సాగిపోతుందని ఎంతో ఆశించాను. నిజానికి జరిగివుండేదే. కానీ కాపాలికుడు అడ్డుపడ్డాడు యువరాజా!"



ఈ ఏడాదిని చిరుధాన్యాల సంవత్సరంగా జరపాలని పప్పుధాన్యాల ఉత్పత్తి పెంచాలన్నది కేంద్రం లక్ష్యం.

-సదానంద గౌడ, కేంద్రమంత్రి

కచుడు పళ్ళు పటపటమని నూరాడు "ఎవరీ కాపాలికుడు? ఈ చిన్న కీట కాన్ని మీరంతా ఇంతకాలం ఎందుకు ఉపేక్షించారు"

కశ్యపబ్రహ్మ "అతను కీటకమే అయితే ఇంత ఆలస్యం దేనికి యువ రాజా! ఏనాడో పిప్పిని చేసేవాళ్ళం.కానీ అతడంత సులభమైనవాడు కాదు"

కశ్యపుడు ఆ పాడుబడ్డ దేవాల యంలో ఆ రోజున అక్కడ గుడిలో మాయమై మళ్ళీ హఠాత్తుగా ఆ కాపాలి కుడు దర్శనమిచ్చిన వైనాన్ని వివరిం చాడు. అంతేకాదు... రాజు విచిత్ర వైఖరిని, ముఖ్యంగా కాపాలికుడ్ని కలి సినతర్వాత అతడిలో వచ్చినమార్పు, గర్భగుడిలో రాజఖడ్గాన్ని 'మరచి పోయిన' వైనాన్ని మరోసారి గుచ్చి గుచ్చి చెప్పాడు.

కచుడిలో తీరని విస్మయం "ప్రభు వులు రాజఖడ్గాన్ని గర్భగుడిలో మరచి పోయారా! ఇది అసంభవం. ప్రభువులకు ఏమరుపాటు అన్నది ఏ కోశానా లేదు. సామ్రాట్ నిత్య అప్రమత్తులు.ఇందులో ఏదో మెలిక ఉన్నది"

"అంతేకాదు యువరాజా! మరొక అద్భుత విషయం. మరో రహస్యం"

"ఏమిటది మహామంత్రీ!"

"గర్భగుడిలో గంటలు మ్రోగాయ్! తలుపులు మూసివున్నా శబ్దం బయట లీలగా విన్పడింది! ఎంతో సూక్ష్మంగా, జాగరూకతతో వింటేగాని ఈ గంటలు విన్పడవ్! నేనొక్కడినే విన్నాను"

"ఇందులో వింత ఏముంది కశ్యపా! దేవాలయంలో గంటలు మోగుతాయ్!"

"అదికాదుయువరాజా! ఈ గంటలు కాళీవిగ్రహానికి పైన తొమ్మిది అడు గుల ఎత్తులో ఉన్నాయ్!

ఏదయినాబలిఇచ్చినప్పుడుమాత్రమే ఈ గంటలను మ్రోగిస్తారు, అదీ ఒక తాడును ఆ గంటలకు కట్టి"



## సురభి ఇష్టాలు

"

ఢిల్లీలో పెరిగిన మరాఠీ మగువ 'దీరువా' అమ్మాయి సురభి తన ఇష్టాల జాబితాను వివరించింది. "ఢిల్లీలో స్ట్రీట్‌ఫుడ్ పాపులర్. మంచి పదార్థాలు దొరుకుతాయి. అమ్మానాన్నలంటే నాకెంతో ఇష్టం. అమ్మ వంట ఇష్టం. అమ్మతో పావ్‌భాజీచేయించుకుంటుంటా. తెలుగు వంటకాలు నాకెంతో నచ్చాయి. శాకాహారిని.

వెజ్‌బిర్యానీ, తాలింపుపెట్టిన పెరుగన్నం నచ్చాయి. గోవా బీచ్‌లో షికార్లు ఇష్టం. సమయం చిక్కితే స్నేహి తులతో షాపింగ్ చేస్తా. బ్రైట్ కలర్స్ నచ్చుతాయి. సముద్రతీర ప్రాంతాలు, పర్వతప్రాంతాల్లో విహారం ఇష్టం. 'బాహుబలి' సినిమా బాగా నచ్చింది. 'ఆరాధ్య' హీరో హృతిక్‌రోషన్. ఫేవరెట్ నటి అనుష్కాశెట్టి" అంటూ చెంతాడంత జాబితా చెప్పుకొచ్చింది.

"

కచుడిలో విస్మయం. "ఆ తాడును బలిహరణంరోజునే బిగిస్తారు. మిగి లిన రోజుల్లో తీసివేస్తారు. ఆ రోజున సామ్రాట్ ఆలయాన్ని సందర్శించిన నాడు ఆ గంటలకు తాడు లేదు. అలాగే అంత ఎత్తున, అదీ కాళీవిగ్రహం నడినెత్తిన ఉన్న గంటలు సామ్రాట్ చేతికి అందడం అసంభవం.

ఈ విషయాలన్నీ మరోసారి ఆల యాన్ని సందర్శించి శోధించి ధృవీ కరించుకున్నాను. సరిగ్గా ఇదే సమ యంలో సామ్రాట్‌లో మారిన వైఖరి. రాజఖడ్గాన్ని మరచిన వైనం..."

ప్రశంసగా చూశాడు కచగుప్తుడు. "ఇక సందేహం దేనికి మహామంత్రీ! మీరన్నట్టుగా రాజు గర్భగుడిలో ఉన్న పుడు ఏదో విచిత్ర సంఘటనలు జరిగి ఉండాలి"

"అంతేకాదు యువరాజా! రాజు గర్భ గుడి నుంచి బయటకు వచ్చినప్పుడు తన రాజఖడ్గాన్ని మరచిపోయారని గుర్తుచేస్తే సామ్రాట్‌లో ఎటువంటి స్పందనా బహిర్గతం కాలేదు. అంతే కాదు లోపల నుండి రాజఖడ్గాన్ని వెలికి తీసుకువచ్చినప్పుడు సామ్రాట్‌లో అణుచుకోలేని ఆశ్చర్యం.

'మహారాణి' మహ రాజులు కళ్ళు మార్చి మార్చి చూసుకోవటం సామ్రాట్ మహారాణిని కళ్ళతో వారించి కను సైగ చేయడం నేను సూక్ష్మంగా గమనిం చాను" కశ్యపబ్రహ్మ.

"అయితే సామ్రాట్‌ను గుడి బయ టకు వచ్చినప్పుడు తన ఖడ్గం తన వద్ద లేదని ముందుగానే తెలుసం టారా మహామంత్రీ!"

కశ్యపబ్రహ్మ సాలోచనగా చూసి "అలా... అలా... అని నా మనసుకు తోచింది. లోపల గుడిలో ఏదో జరిగిం దని నా నమ్మిక యువరాజా!

సైగా అంతకుముందే కాపాలికుడు ఆ గర్భగుడిలో మాయమయ్యాడు.

మేమందరం ఎంత వారిస్తున్నా సామ్రాట్ ఖాతరు చేయలేదు"

కచగుప్తుడికి మహామంత్రి వివ రణ, విశ్లేషణలో ఏదో అంతరార్థం తోచింది. అనేక సంవత్సరాలుగాతనకు తెల్సివున్న కశ్యపుడు,పొరపాట్లు ఎపుడో తప్ప చేయని అనుభవం తనకున్నది. అంతేకాదు కశ్యపుడి భయసందేహాలు ఎప్పుడూ నిజమవుతుంటాయ్. దీనికి కారణం తెలియకపోయినా ఇది మరో అనుభవైక విషయం.

కచగుప్తుడు మరోసారి ఆలోచించి "అయితే కాపాలికుడు రాజు ఆలోచన లను తారుమారుచేసుండాలి. ఔనా!"

"అని నేను నమ్ముతున్నాను యువ రాజా!" కశ్యపబ్రహ్మ అన్నాడు.

కచుడు సుదీర్ఘమయిన ఆలోచనలో జారుకున్నాడు. కశ్యపబ్రహ్మ కూడా కచుడ్ని నిశితంగా గమనిస్తున్నాడు.

"ఇపుడేం చేయాలి కశ్యపా!"

"........."

"కాపాలికుడ్ని మట్టుపెట్టవచ్చా!"

"వద్దు యువరాజా! మహిమలు కలిగిన కాపాలికుడు తన జుట్టునుమన కందచేయడం కల్ల.అతడితో శత్రుత్వం వహించటంకంటే మిత్రత్వమే మనకు ఆచరణీయం. అతడి అండదండలు భవిష్యత్తులో మనకు ఉపయోగపడ వచ్చు అని నా అభిప్రాయం"

కశ్యపబ్రహ్మ ఆలోచన సరి అయిం దని కచుడికి అన్పించింది. "ఇంతకీ కాపాలికుడు చేయబోయిన ఆ హెచ్చ రిక ఏమయివుంటుంది?

'చంద్రగుప్తా! ఇది సమయం కాదు' అని సామ్రాట్‌ను వారించాడు అని అంటున్నారు. దేనికి సమయం కాదు కశ్యపా!"

"బహుశా రాజ్యానికి వారసుడెవరో! ప్రకటించబోయే తరుణం ఆసన్నంకాలే దని కాపాలికుడి అభిప్రాయం"

"అలా అన్నాడా!"

"అనకపోవచ్చు... తాత్పర్యం అదే యువరాజా!"



విభజనలో జరిగిన అన్యాయం పట్ల ఆంధ్రులకు బాధ వుంది... కాని అభివృద్ధిపై భయం లేదు. -సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డి

ఏ.పి. మంత్రి

కచుడికి ఒక్కక్షణం ఆక్రోశంవచ్చింది. 'నోటిదాకా వచ్చిన విందుభోజనాన్ని లాగిపారేశాడీ కాపాలికుడు"

"ఇంతకీ ప్రభువుల నిర్ణయం ఏమై ఉంటుంది?"

"జ్యేష్ఠ రాకుమారుడే నిజమైన వారసుడు, అవునా యువరాజా!"

"అలా అని నాతో సామ్రాట్ ఏనాడూ అనలేదు"

"ఇది ధర్మశాస్త్రం. సామ్రాట్ ధర్మాన్ని ఆచరించే బుద్ధివున్నవారు. పైగా ప్రజల మన్ననను పొందినవారు మీరే యువరాజే! ఇది ప్రజల అభిప్రాయం. ఈ అభిప్రాయంప్రకారం యువరాజు కచగుప్తుడే, ఈ రాజ్యానికి నిజమైన వారసుడు. రాజార్హత వున్నవాడు"

"కలియుగం ఇది. ధర్మాధర్మాలకు తావెక్కడ ఉంటుంది. అయినా అన్ని యుగాల్లోనూ నడిచిన ఒక ధర్మ సూత్రం ఉంది"

కచగుప్తుడివైపు చూశాడు 'ఏమిటన్నట్లుగా' కశ్యపుడు.

"మరేమీలేదు కశ్యపా! ఎవడు బలవంతుడో వాడే రాజు. ఇది అనాదిగా నడుస్తోన్న ధర్మసూత్రం"

"బలమొక్కటేచాలదు యువరాజా! మనిషిబలానికి ధర్మం తోడయినపుడే బహుజనశ్రేయస్సుకు దారితీస్తుంది. ధర్మాచరణ లేని బలవంతుడికి అతడి బలమే అతడికి శత్రువవుతుంది"

"చెప్పానుకదా కశ్యపా! ఈసూత్రం కలిలో వర్తించదు. రాబోయే కాలంలో మృగబలం, ఆటవిక బలానికే పట్టం కడతారు. ఇవి నేనన్న మాటలు కాదు, వ్యాసుడు భారతకాలంలోనే కలియుగంలోని ప్రజల దురవస్థకు పరితపించిపోతూ అన్న భావాలు"

కశ్యపబ్రహ్మ "కానీ కలి ప్రథమ పాదంలోనే ఉన్నాం కదా! ఐనా యువరాజు అన్నది పొల్లుపోకుండా జరుగుతుంది, అది కలియుగ అంత్యదశ సమీపించినపుడు.

ఆ రోజు ఈ భూమ్మీద మనుషులందరూ పూర్తిగా మృగధర్మంతో జీవిస్తారు. అపుడు మానవసంఘం నిజమైన జనారణ్యం అవుతుంది"

"ఎపుడో ఎందుకు కశ్యపబ్రహ్మ! మీరన్న మాటలు అపుడపుడూ ఈ కాలంలో కూడా జరుగుతున్నాయి. ఈ యుద్ధాలు ఏమిటి? ఈ బందిపోట్లు, పిండారీలు, విదేశీయ శత్రువులు

## చిలిపి ?

| | |
|---|---|
| ప్రతిరోజూ చెవిలో పువ్వు పెట్టుకునేదెవరు?<br>గుడిలోని పూజారి. | టైలరంటే?<br>కొత్త బట్టలు చింపేవాడు. |
| మన గోడమీద కాకి అరిస్తే?<br>లీటరు పాలు ఎక్కువే పోయించుకో అని అర్థం. | చట్టాలు ఎందుకు?<br>చుట్టాలను జైళ్ళనుండి తప్పించేందుకు. |
| మనకు ఇష్టమైనప్పుడు మాట్లాడే ఫ్రెండ్?<br>రేడియో. | ఇన్విజిలేటర్లెందుకు?<br>స్క్వాడ్ వచ్చే సంగతి విద్యార్థులకు ఇన్‌ఫామ్ చేయటానికి. |
| నెల తప్పిందంటే?<br>'జూన్' జూలై అవడమేగా. | మీ కలంపేరు చెబుతారా?<br>'కామ్లిన్!' |

చేసిన మారణహోమాలు ఏమిటి?"

కశ్యపుడు "అందుకనే రాజ్యానికి బలవంతుడైన రాజు, నిర్దాక్షిణ్యంగా దండనీతిని ఆచరించేవాడు ఉండాలని నా అభిప్రాయం.

కచుడు "అందుకనేగదా! నేను కంకణం కట్టుకున్నాను. అంతేకాదు పటిష్ఠమయిన సువిశాల రాజ్యం కూడా అవసరం. రాజ్యం విశాలం సుస్థిరమూ అయినపుడూ శత్రువులకు స్వేచ్ఛను అరికట్టవచ్చు. అందువల్ల రాజ్యవిస్తరణ చేయాల్సివుంటుంది"

కశ్యపుడు ఈ మాటలకు మౌనంగా ఉండిపోయాడు. కచుడికి ఎందుకనో గాని, తీవ్రమైన రాజ్య విస్తరణ ఆకాంక్ష ఉన్నది. అలాగే కచుడు అన్నదానిలో కొంత సత్యమూ లేకపోలేదు.

ఈసారి కచగుప్తుడు కూడా ఆలోచనలో ఉండిపోయాడు. ఆ తరువాత కొంతసేపయ్యాక కచుడు ఇద్దరి మధ్యా నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ 'సముద్రుడి ప్రాసాదంలో జరిగిన ఆ వృద్ధుడి మరణం గురించి మీ వ్యాఖ్య?"

కశ్యపుడు "ఎవరో తపస్వి ఆట. యువరాజు చేతిలో మరణించాడట"

కచుడు "సుందరాంగులను తప్ప చేరదీయని సముద్రుడ్ని ఈ వృద్ధుడు ఎలా ఆకర్షించాడు కశ్యపా!"

కశ్యపుడు ఏదో ఆలోచిస్తున్నాడు సమాధానం చెప్పకుండా. కచుడు గమనించి "మహామంత్రులేదో దీర్ఘాలోచనలో మునిగిపోయారు" అడిగాడు.

కశ్యపుడు తలవిదిల్చి "ఔను యువరాజా! నాకో సందేహం" అన్నాడు.

"ఏమిటి?"

"వారిద్దరి మధ్యా జరిగిన సంభాషణ ఏమిటి? ఏ విషయంగురించి మాట్లాడుకున్నారు. వృద్ధుడి రాక కాకతాళీయమా లేక దీనిలో ఏదైనా ఆంతర్యం ఉన్నదా?" అని అడిగాడు.

అభివృద్ధి విషయంలో నవ్యాంధ్రతో మా రాష్ట్రానికి పోలికే లేదు. అసలు ఆ పోలికే తీసుకురావద్దు.

-కె.సి.ఆర్., తెలంగాణ సి.ఎమ్.



కచుడు "తెలియదు.

సముద్రుడు ఆ వృద్ధుడు ఏకాంత మందిరంలో మాట్లాడుకున్నారని తెలుసు. వాళ్ళు అలా మాట్లాడుతున్న తరుణంలో సముద్రుడు తనకు వింజామరలు వీస్తోన్న చేటీలను కూడా పంపించివేశాడుట"

"ఆ తర్వాత ఎవరూ యువరాజును రహస్యంగా గమనించలేదా!"

"ఆస్కారంలేకపోయింది కశ్యపా"

ఈసారి కశ్యపుడు సంతృప్తిగా ఊపిరిపీల్చాడు "అయితే కచగుప్తుడికి పూర్తి వివరాలు తెలియదు. విషయసేకరణలో తనదే పైచేయి"

కశ్యపుడు 'చెపుదామా! వద్దా!' అని కాసేపు తటపటాయించాడు. తర్వాత 'చెప్పవద్దు' అని నిర్ణయించుకున్నాడు. 'చెపితే తను చిక్కుల్లో పడవచ్చు' అని కశ్యపుడు మనసు వారించింది.

కచుడు ఉన్నట్టుండి "ఇంకా ఏమయినా జరిగాయా! మీకు ఏమయినా తెలుసా!" అడిగాడు.

కశ్యపుడు నిండుకుండలా తొణకకుండా, ఏ భావాన్నీ బహిర్గతం చేయకుండా "తెలియదు యువరాజా! కనీసం వారిద్దరూ మాట్లాడుకున్న తరుణంలో చేటీలను బయటకు పంపిన ఉదంతం కూడా తెలియదు. అంతఃపురాల్లో యువరాజుల రాజాప్రాసాదాల్లో జరిగే విషయాలు వారికే పరిమితి. వారి నాల్గు గోడలకే తెలియాలి" అన్నాడు.

మహామంత్రి కశ్యపుడు చెప్పింది నూటికినూరుపాళ్ళూ అబద్ధం. అంతఃపుర, రాజప్రాసాదాల్లో కశ్యపబ్రహ్మకు 'తన మనుషులు' ఎందరో గుప్తంగా ఉండి సమాచారాన్ని సేకరించి తెలియజేస్తుంటారు. ఇక్కడే కాదు, దేశంలో ఏ మారుమూల ఏం జరిగినా కశ్యపుడి చెవిలోపడవలసిందే! అయితే కశ్యపుడు అచంచలరాజభక్తి ఉన్నవాడు.

ఈ విషయ సేకరణలోని అతడి ఆంతర్యం, రాజును, రాజ్యాన్ని రక్షించడమే. ఈ సమాచార సేకరణను అద్భుతంగా విశ్లేషించి రాజ్యక్షేమం కోసమే తాపత్రయపడతాడు కశ్యపబ్రహ్మ.

ఈసారి కచుడు సంతృప్తిగా తల ఆడించాడు "అయితే వృద్ధుడి మధ్యా సముద్రుడి మధ్యా జరిగిన కొన్ని విషయాలు మహామంత్రిదాకా చేరలేదు. వారిద్దరి మధ్య జరిగినటువంటి సంభాషణ ఏమిటో కూడా మహామంత్రికి తెలియదు"

**ఇంకా ఉంది**

# నేనెవరో తెలుసా

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 10 ఫిబ్రవరి 2018 తేదీలోగా పంపించండి.
కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగా ఎంపికచేసి
₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

26.1.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :
1. కొప్పరపు వేంకట సుబ్బారాయ కవి, కొప్పరపు వెంకటరమణ కవి.
విజేత : టి.వింధ్యారాణి, 64, పద్మావతీ కాలనీ, నల్లగొండ 508 001, తెలంగాణ.

కొందరు పదవుల వెంటపడతారు. కొందరిని పదవులు వెతుక్కుంటూ వచ్చి వరిస్తాయి. మహిళలకు అంతగా అవకాశాలు ఇవ్వని సమాజంలో, మహిళల సమర్థతమీద అంతగా నమ్మకం ఏర్పడని కాలంలో ఒక మహిళను పలు రకాల కీలకపదవులు వెతుక్కుంటూ వచ్చాయంటే తప్పనిసరిగా ఆమె చాలా టాలెంటెడ్ అయి వుండాల్సిందే. అందులో ఎటువంటి సందేహం లేదు.

ఇప్పటికికూడా మహిళలకు కొన్ని రకాల పదవులు అప్పగించేందుకు సంశయముంది. అవి వారు సరిగా, సమర్థతతో నిర్వహించగలరా! లేరా! అనే సందేహం వారిది. అనవసరంగా ఆడవారికి ఇచ్చి ఆ తర్వాత వారి తప్పులకు తాము బాధ్యత వహిస్తుందనుకునే పెద్దలు వున్నారు.

మహిళలకు ఒకసారి కీలక పదవి కట్టబెడితే కదా వారు ఎలా పని చేస్తారో తెలిసేది. అటువంటి అవకాశం అందివచ్చినప్పుడు మహిళలు ఎప్పుడూ వెనకడుగువెయ్యలేదు. తమ సంపూర్ణ సమర్థతతో ఆ పదవులకు వన్నె తెచ్చారు. అలా తాను నిర్వహించిన ప్రతి బాధ్యతలో తన ప్రత్యేక ముద్రవేసి శభాష్ అనిపించుకున్న తెలుగు మహిళ ఒకరున్నారు.

భారతదేశంలో ఎన్నికలు నిర్వహించటమనేది నెత్తిమీద సామువంటిది. రాజకీయపక్షాలు తెచ్చే ఒత్తిడులు, ఎన్నికల సమయంలో జరిగే ఆగడాలు ఒక రకమైన ఇబ్బందికరంగా వుంటాయి. అటువంటి ఒత్తిడులను, ఇరకాట పరిస్థితులను తట్టుకుని పనులను చక్కబెట్టాలంటే చాలా చాలా చమత్కారం అవసరం.

నిబద్ధతతో వ్యవహరించి, ఎవరినీ నొప్పించక, ఎవరో ఒకరివైపు మొగ్గారన్న అపప్రథ మూటకట్టుకోకుండా ముందుకు నడవాలి.

అటువంటి ఎన్నికల సంఘాన్ని నడిపించే అవకాశం దక్కిన ఏకైక మహిళ ఆ తెలుగు ఆమె.

ఆమె ఎన్నికల సంఘానికి కమీషనర్‌గా వున్న కాలం బహుతక్కువ. ఆ సమయంలో గట్టిగా ఎన్నికలు జరిగింది లేదు. కాబట్టి తను ముద్ర ఎన్నికల నిర్వహణమీద వేసే అవకాశం రాలేదు.

అయితే ఎన్నికల కమీషనర్‌గా ఒక నిండుతనం ఆ పదవికి తెచ్చింది.

చాలా హుందాగా కనిపించే ఒక అధికారిని చూడగలిగామని నాడు చాలామంది అనుకున్నారు.

హఠాత్తుగా ఎన్నికల కమీషనర్‌గా బాధ్యతలు చేపట్టినది ఎవరీమె! అంటూ వెనక్కి వెళ్ళి వెతి కారు. సాధారణంగా ప్రభుత్వంలోని ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. అధికారులకు లభించినంత గుర్తింపు ఇతర క్లాస్ ఒన్ ఆఫీసర్లకు లభించదు. కీలకమైన పదవులను నిర్వహించినా విషయం పెద్దగా బయటకురాదు.

అటువంటి గ్రూప్ ఒన్ ఆఫీసర్‌గా పనిచేసి పలు విధాల గుర్తింపు తెచ్చుకున్న మహిళ ఆమె.

గోదావరి తీరంలో పుట్టిన ఆ ఆంధ్రుల ఆడపడుచు జిల్లాలో ఆపైన రాజధాని హైదరాబాద్‌లో విద్యాభ్యాసం పూర్తిచేసిన తర్వాత న్యాయవాద వృత్తితో జీవితం మొదలుపెట్టారు.

మహిళలు న్యాయవాదులుగా అప్పుడప్పుడే గుర్తింపు తెచ్చుకుంటున్న సమయం. ఆ దశలో అదే వృత్తిలో కొనసాగితే బహుశా హైకోర్టు, ఆపైన సుప్రీమ్ కోర్టు న్యాయమూర్తిగా ఎదిగివుండేదేమో ఆమె.

కాని ప్రతిదశలో ఒక మార్పును కోరుకున్న ఆమె కేంద్రసర్వీసుల్లోకి వెళ్ళేందుకు ఉత్సాహం చూపి గ్రూప్ 1 స్థాయి అధికారిగా సేవలు అందించారు. చిత్తశుద్ధితో బాధ్యతలు నిర్వహిస్తే గుర్తింపు వచ్చి తీరుతుంది. బాధ్యతాయుతమైన పదవులు అవే వస్తాయి. అందుకు సాక్ష్యం ఆమె జీవితం.

కేంద్రంలో మహిళా కమిషన్‌లో మెంబర్ సెక్రెటరీగా పనిచేసినప్పుడు మహిళల సమస్యలు, ఆ సమస్యలు చక్కదిద్దేందుకు అవసరమైన చట్టాలగురించి ఆలోచించారు. ఆ తర్వాత లా కమిషన్ గౌరవ సలహాదారుగా కూడా వ్యవహరించారు.

తొలి మహిళా ఎన్నికల కమిషనర్‌గా రికార్డు సృష్టించడమే కాదు రాజ్యసభకు తొలి మహిళా సెక్రటరీ జనరల్‌గా పనిచేసిన రికార్డు ఆమెకుంది. నేటి వరకు ఆ పదవిలోకి మరో మహిళ రాలేదు.

కీలక పదవులలోకి వెళ్ళకముందునుండే ఆమెకు సాహిత్య పరిచయముంది. వారపత్రికలో కాలమ్స్ రాసిన అనుభవముంది. అంతకుముందు కథలు రాసింది ఆమె. నవలలను తీర్చిదిద్దింది.

ఇవన్నీ ఆఫీసరుగా బాగా బిజీగా వున్నా, గృహిణిగా బాధ్యతలు చక్కదిద్దుతున్నా వదలకుండా కొనసాగించినవే. తాను చుట్టూ చూసిన సంఘటనలను నవలలోకి ఎక్కించి, సహజత్వం అద్ది అందరినీ మెప్పించేలా కథనం తీసుకువెళ్ళటం ఆమె ప్రత్యేకత.

తాను పలురకాలుగా బాధ్యతలు వహించిన వైనం అక్కడి అనుభవాలు ఆ నవలల్లోని పాత్రల ద్వారా చెప్పించింది ఆమె.

రెడ్‌క్రాస్ అధ్యక్షుడిగా పనిచేసిన పాత్ర అచ్చు ఆమెలాగానే వుంటుంది. ఆమె నవలల్లో ఒక మహిళ జోడు బాధ్యతలను ఎలా సమర్థవంతంగా నిర్వహించవచ్చో చూపించింది. అదే సమయంలో ఒంటరిగా జీవించినా జీవితాన్ని విజయపథంవైపు ఎలా తీసుకువెళ్ళవచ్చో పాత్రద్వారా చెప్పింది.

బ్రతికినంతకాలం జీవితాన్ని జాగ్రత్తగా మలచుకోవటమే చెయ్యాల్సినది అని ఆమె ఒక పాత్రద్వారా అందించిన సందేశం మరవలేనిది. అందుకే అటువంటి మహిళా కేంద్రబిందువు నవలలు ఇతర భాషలలోకి అనువదించబడి మెప్పు పొందాయి.

పదవులు ఆమెను వెతుక్కుంటూ వచ్చాయి. ఎన్నికల ప్రధాన కమిషనర్ బాధ్యత అవుతూనే ఆమెను గవర్నర్ పదవి వరించింది.

ఒక రాష్ట్రంలో నియమితురాలై మరో రాష్ట్రానికి బదిలీ అయి రెండు రాష్ట్రాలలోని భిన్న రాజకీయ పార్టీలను మెప్పించగలిగింది. రెండు రాష్ట్రాల ప్రభుత్వాలకు మార్గదర్శనం చెయ్యగలిగింది.

గవర్నర్ అంటే అలంకారప్రాయమయిన పోస్ట్. ప్రభుత్వంవారికి అతిథిగా రాజ్‌భవన్‌లో నివాస జీవితం గడపటం అనుకుంటారు. కాని ఆమె ఆ అభిప్రాయానికి భిన్నంగా ప్రజలకు, ప్రభుత్వాలకు మధ్య వారధిగా బాధ్యతలు నిర్వహించింది.

సాధారణంగా గవర్నర్ పదవులు వివాదమవుతుంటాయి. గవర్నర్‌గాపనిచేసేవారు వివాదాస్పద వ్యక్తులవుతుంటారు. అటువంటిరెండింటికీఆమె విషయంలో తావు లేదు. రాజకీయాలకు అతీతమైన వ్యక్తి రాజకీయాలను దూరంగాపెట్టి గవర్నర్‌గా పని చేసిన వ్యక్తిగా ఆమెకు మంచి గుర్తింపు వచ్చింది.

బాలసాహిత్యంలో, నాటక రచనలో, కథ, నవల ప్రక్రియల్లో, అధికారిక యంత్రాంగంలో మంచి పేరుండటంవల్ల ఆమెను మరోమారు గవర్నర్ పదవి స్వీకరించమని కోరినా సున్నితంగా తిరస్కరించి శేషజీవితం ప్రశాంతంగా గడిపి, సంపాదించుకున్న మంచి పేరును కాపాడుకోగలిగిన మహిళగా గుర్తింపు పొందిన ఇంతకీ...

*1. ఆ మహిళ పేరేమిటి?*

*2. ఆమె గవర్నర్‌గా పనిచేసిన రాష్ట్రాలు ఏవి?*

# శిరోజ సౌందర్యం



శిరోజాలకు సంబంధించి చేయడానికి ఎంతో ఉంటుంది. వాటికి పోషణ ఇస్తుంటే మృదువుగా, అందంగా, ఒత్తుగా నిగనిగలాడుతూ పెరుగుతాయి.

ఎన్ని జాగ్రత్తలు తీసుకుంటున్నా, పడుకునేముందు తగిన చర్యలు తప్పక చేపట్టాల్సివుంటుంది. అప్పుడే ఉదయం నిద్రలేస్తూనే అందాల జుట్టు కనపడుతుంది.

## దువ్వుకోవడాన్ని మరవవద్దు

పడుకునేముందు పళ్ళు తోముకోవాలన్న విషయం స్ఫురణలో ఉంటుందికాని, చిక్కులుపడ్డ జుట్టుదువ్వుకోవాలన్న ఆలోచన అస్సలురాదు. ఐతే, పడుకునేముందు తలదువ్వుకోవడం సరైన ఆలోచన. ప్రతిరోజా కాకపోయినా వివిధ కారణాలను పరిగణనలోకి తీసుకుంటూ తలదువ్వుకోవాలి. ఆరోగ్యవంతమైన జుట్టు గలవారికి పడుకునేముందు ప్రతిరోజా తలదువ్వుకోవడం పెద్ద విషయంకాదు. ఫైన్ హెయిర్ ఉన్నా జుట్టు కుదుళ్ళవద్ద తెగిపోయే అవకాశాలు ఉన్నా ప్రతి రెండుమూడురోజులకు ఒకసారి పడుకునేముందు తలదువ్వుకుంటుండాలి. అలాగే బ్రెష్ స్ట్రోక్స్ ఎన్ని ఇస్తున్నారనేది కూడా ముఖ్యం. వందసార్లు దువ్వాలన్న సాధారణ అభిప్రాయానికి స్వస్తిచెప్పి, అవసరం ఉన్నంతవరకే క్లుప్తంగా బ్రెష్ చేసుకోవాలి.

## నూనె రాయాలి

నూనె రాసి, మాడును మసాజ్ చేసుకోవడంవల్ల జుట్టు ఎదుగుదల తీరు బావుంటుందని భావిస్తుంటారు. కాని ప్రతిరోజా అంత తీరిగ్గా మసాజ్ చేసుకోవడం కుదరని పని. పడుకునేముందు కొద్దిగా నూనె రాసుకుని కుదుళ్ళకు పట్టేవిధంగా రబ్ చేయడమే కాకుండా, కొసలు చివరిదాకా అప్లయ్ చేయాలి. ఇలా చేయడంవల్ల కొసళ్ళు చిట్లవు. మరునాటి ఉదయం తలస్నానం చేయాలి. సువాసనతో కూడిన నూనె రాయడంవల్ల మంచి నిద్రకూడా పడుతుంది. అయితే ప్రతిరోజా ఇలా నూనె పెట్టుకోనక్కర్లేదు. మరునాడు తలస్నానం చేయాలనుకున్నప్పుడుమాత్రం రాస్తే చాలు.

## రాత్రివేళ చికిత్సలు

హెయిర్ మాస్క్‌లు వేసుకునే చాలామంది చేసే ఫిర్యాదు అందుకుతమకు అసలు టైమ్ ఉండడంలేదనేది. ఇంటివెలుపలే ఎక్కువ గంటలు గడుపుతూ, ఇంట్లో తక్కువ సమయం ఉంటుందికాబట్టి హెయిర్ మాస్క్‌లకు తగినంత సమయం ఉండదు. అయితే నిద్రించే సమయం ఓవర్ నైట్ హెయిర్ చికిత్సలకు అనువైనది. యాంటీ డాండ్రఫ్ చికిత్సల నుంచి, కుదుళ్ళను దృఢపరిచే మాస్క్‌లదాకా ఇంట్లో తయారు చేసుకునే ఆయిల్ బ్లెండ్స్, లీవ్-ఇన్ కండిషనర్లకు నిద్రించే సమయం చాలు. ఇందుకోసం ప్రత్యేకంగా సమయాన్ని కేటాయించనవసరంలేదు. మాస్క్‌వేసుకుని, హెడ్‌క్యాప్ పెట్టేసి ఎంచక్కా నిద్రపోవచ్చు. హాయిగా నిద్రలేచేసరికి ఓవర్ నైట్ మ్యాజిక్ శిరోజాలపై ఇట్టే కనపడుతుంది.

## శిరోజాల సెక్యూర్

రాత్రంతా జుట్టును లూజ్‌గా వదిలేసి ఉంచడం సరైన చర్య కాదు. ముఖ్యంగా పొడవాటి జుట్టు ఉన్నప్పుడు అస్సలు వదిలేయకూడదు. సులువుగా పాటించే టెక్నిక్స్ అనుసరిస్తుండాలి. ఉదాహరణకు లూజ్, బౌన్సి కర్ల్స్ కావాలనుకుంటే సింపుల్‌గా ఫ్రెంచ్ బ్రెయిడ్ (లూజ్‌గా) వేసి వదిలేయాలి. సహజంగా ఉంగరాలు జుట్టు అయితే, నడినెత్తిపైన అల్లుకుని పడుకోవాలి. మరీ పొడవు జుట్టు కానట్లయితే ట్రై చేసుకోవచ్చు. స్లీప్ క్యాప్ లేదా సిల్క్ లేదా నైలాన్ స్కార్ఫ్ కట్టుకోవచ్చు.

## సిల్క్ పిల్లోకేస్

కాటన్ దిండుకవర్లు తీసేసి సిల్కు రకాలు ఎంచుకోవాలి. సిల్కు టెక్చర్ అందరికీ నచ్చకపోవచ్చు. కాని, సిల్క్ దిండు కవర్లు శిరోజాలను పరిరక్షించగలవు. మిగతా మెటీరియల్స్‌తో పోల్చితే సహజంగా మృదువైన ఉపరితలంతో ఉండి, సిల్కు జుట్టు తెగిపోకుండా కాపాడుతుంది. ఉదయం లేచీ లేవగానే దిండుపై వెంట్రుకలు రాలి అతుక్కుపోయివుండడం కనపడదు. కాటన్ కవర్లు జుట్టు తెగడానికిమాత్రమే కాకుండా మిగతావాటితో పోల్చిచూస్తే, జుట్టు చిక్కుపడడానికి కూడా కారణమవుతాయి. ఈ విషయంలో సిల్కు కవర్లతో సమస్య లేదు.

Courtesy : HAIR

ఎస్.రాధిక

A little house well filled, a little land well tilled and a little wife well willed are great riches



Courtesy : BIRDHICHAND GHANSHYAMDAS JEWELLERS

## డిప్రెషన్‌కు విరుగుడు

దీర్ఘకాలిక ఫలితాలను ఇచ్చే వర్కవుట్లు డిప్రెషన్‌కు మంచి విరుగుడు అని నిపుణులు సూచిస్తున్నారు. వీటిలో రన్నింగ్ అనేది అత్యుత్తమ కార్డియో వాస్క్యులర్ వర్కవుట్.

ఫీల్‌గుడ్ హార్మోన్ల ప్రవాహానికి రన్నింగ్ బాగా ఉపకరిస్తుంది. మంచి కొలెస్ట్రాల్‌ను పెంచి, ఊపిరితిత్తుల సక్రమ పనితీరుకు సహకరిస్తుంది. రోగనిరోధకవ్యవస్థను బలోపేతం చేస్తుంది.

స్ట్రోక్, క్యాన్సర్, హార్ట్‌ఎటాక్ వంటిఎన్నో వ్యాధుల నుంచి రన్నింగ్ పరిరక్షిస్తుంది.

డయాబెటిస్, అధిక రక్తపోటు, ఆస్టియోపోరోసిస్ ఆరంభదశలోగలవారికి రన్నింగ్ ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది. బరువు తగ్గాలనుకునే వారికీ సత్ఫలితాలు ఉంటాయి. ◆

## మెరుగైన మెటాబాలిజం

బరువు తగ్గాలని భావించే చాలామంది ఎన్నో ప్రయత్నాలు చేస్తుంటారు కానీ, శారీరక జీవక్రియ గురించి విస్మరిస్తుంటారు. అత్యధిక మెటాబాలిజం గలవారు సహజంగానే ఎక్కువ క్యాలరీలు ఖర్చు చేస్తారు. ముఖ్యంగా గ్రీన్‌టీలోని కెటాచిన్లు మెటాబాలిజాన్ని మెరుగుపరుస్తాయి.

జీర్ణక్రియకు సహకరించడమే కాకుండా ఫ్యాట్ ఆక్సిడేషన్‌కు, జీర్ణ ప్రక్రియలో శక్తి ఉత్పత్తికి దోహదపడతాయి.కార్బోహైడ్రేట్లు తగ్గించి,ప్రొటీన్లు పెంచుకోవడంవల్ల మెటాబాలిజం చురుగ్గా వుంటుంది.

చాలినంత నిద్రపోవడం అత్యంత ముఖ్యం. దైనందిన రొటీన్‌లో చేసుకునే చిన్నచిన్న మార్పులు, సర్దుబాట్లు జీవక్రియను వేగవంతం చేస్తాయి. తద్వారా అనేక ఫలితాలు దక్కుతాయి. ◆

## మంచి ఆహారం

శనగలు తింటే కడుపుబ్బరం, గ్యాస్ అని అనేక మంది భావిస్తూ, వీలయినంతవరకు వీటికి దూరంగానే ఉండిపోతుంటారు. అయితే శనగలను ఉడికించి కాని, మొలకెత్తించి కాని తినడంవల్ల ఆరోగ్య ప్రయోజనాలు దక్కుతాయి.

కార్బోహైడ్రేట్స్, పొటాషియం, పీచు వీటిలో పుష్కలంగా లభిస్తాయి. మెగ్నీషియం, మాంగనీస్ లభిస్తాయి కాబట్టి రోగనిరోధకశక్తి పెరుగుతుంది. రక్తంలోని గ్లూకోజ్ స్థాయిలను నియంత్రిస్తాయి కనుక డయాబెటిస్‌గలవారికి మంచి ఆహారం.

పీచు ఉండడంవల్ల జీర్ణవ్యవస్థ సక్రమ పనితీరుకు దోహదపడుతుంది. ప్రతిరోజూ తినడంవల్ల ఐరన్ లభిస్తుంది. రక్తహీనత తగ్గుతుంది. గుండెకు రక్తసరఫరా మెరుగవుతుంది. కొవ్వును కరిగించగల గుణమూ శనగల్లో ఉంటుంది. ◆

## ఆరోగ్య చర్యలు

దురలవాట్లతో ఊపిరితిత్తులు ముప్పు తెచ్చుకున్నవారు సదరు అలవాట్లు మానేసి ఇతరత్రా ఆరోగ్య చర్యలు చేపడితే కొంత నష్టం భర్తీకాగలదని శాస్త్రవేత్తలు తమ పరిశోధనల్లో గుర్తించారు.

ఆహారంలో టొమేటోలు, పండ్లు, ముఖ్యంగా యాపిల్స్ ఎక్కువగా తీసుకుంటుంటే ఊపిరితిత్తులకు జరిగిన నష్టం కొంత తగ్గుతుందని వారు తమ అధ్యయనాల్లో గుర్తించారు.

రోజుకు రెండు టొమేటోలు చొప్పున లేదా మూడుకంటే ఎక్కువసార్లు పండ్లు తినేవారి ఊపిరితిత్తులు ఒకటి, అర తినేవారితో పోల్చితే ఆరోగ్యవంతంగా వుంటాయని, అలాగే పొగ తాగడంవల్ల కలిగిన నష్టాన్ని కొంతమేరకు సరిచేయడంలో ఉపయోగపడతాయని వివరించారు.

భోజనంలో ఎన్ని రకాలు వడ్డించినా, ఎంతగా తిన్నా చివరిగా పెరుగు పడకపోతే మన భోజనం పూర్తయినట్టనిపించదు. అంతగా మన జీవితంతో ముడిపడింది పెరుగు.

ఈ రోజుల్లో శాస్త్రవేత్తలు చెప్పే బయోటెక్నాలజీ అనేదానికి తొలి ప్రక్రియ పెరుగు తయారీనే.

ఈ బయోటెక్నాలజీ ప్రక్రియ ఏ ఆదిమ మానవుడు కనిపెట్టాడో తెలియదు. పాలను ఒక ప్రత్యేక ఉష్ణోగ్రత దగ్గర సూక్ష్మజీవులు పెరుగుగా మార్చగలవన్న గొప్ప విషయాన్ని నాడు కనుక్కోగా నేటికీ అదే ప్రక్రియను అలాగే ఉపయోగిస్తున్నాం.

ప్రత్యేకమైన లాక్టిక్ ఆమ్లం ఇవ్వగలిగిన లాక్టోబాసిల్లస్ ఎసిడోఫిలిస్, ఎంటెరోకోకస్ ఫేసియమ్, స్ట్రెప్టోకోకస్ థర్మోఫిలిస్ వంటి బ్యాక్టీరియమ్‌లను తోడు చేసినప్పుడు పాలలోని ప్రొటీన్ రసాయనికంగా మార్పు చెంది, చిక్కనైన రుచికరమైన పెరుగుగా మారుతుంది.



# హెల్త్ బెనిఫిట్స్

**కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తుంది :** పెరుగులో వుండే బ్యాక్టీరియ లాక్టొబేసిల్లస్ ఎసిడోఫిలిస్ మిగిలిన రెండు బ్యాక్టీరియ్‌లు ఎంటెరోకోకస్ ఫేసియమ్, స్ట్రెప్టోకోకస్ థర్మో ఫిలిస్‌లతో సంయుక్తంగా కొలెస్ట్రాల్‌పై ప్రభావం చూపుతుంది. పెరుగు మధ్యస్థాయి కొలెస్ట్రాల్‌ని తగ్గిస్తుంది. హానిచేసే కొలెస్ట్రాల్‌ని తగ్గిస్తుంది. అయితే మేలుచేసే కొలెస్ట్రాల్‌ని పెరుగు పెంచలేదు.

**రోగనిరోధకవ్యవస్థను మెరుగుపరుస్తుంది :** పెరుగు పేగులకు మంచిదన్నది చిరకాలంగా చెప్పుకునేమాట.అది నిజమే. పెరుగుప్రభావన శరీరంలో ఏర్పడే కొన్నిరకాల ఎలర్జీలను, వైరస్‌ల ఇన్ఫెక్షన్స్‌ని నిలువరించగలిగిన గామా ఇంటర్‌ఫెరాన్ ఉత్పత్తి జరుగుతుంది. కడుపులో చేరే పలురకాల సూక్ష్మజీవుల ప్రభావాన్ని అడ్డుకుంటుంది పెరుగు. పెరుగులోని సూక్ష్మజీవులు పేగులో ఉపయోగకర సూక్ష్మజీవుల సంఖ్యను వృద్ధిపరుస్తాయి.

**విరోచనాలను తగ్గిస్తుంది :** వైద్యులు ఇచ్చే యాంటీబయాటిక్స్ శరీరంలోని మేలుచేసే సూక్ష్మజీవులను సంహరిస్తుంది. దీనివలన యాంటీబయాటిక్స్ తీసుకున్నప్పుడు కడుపులో వికారంగా వుంటుంది. అటువంటి ఇబ్బందినుండి బయటపడవేయగలదు పెరుగు. పెరుగులోని లాక్టోబాసిల్లస్ ఎసిడోఫిలస్ మేలు చేసే బ్యాక్టీరియమ్‌ల సంఖ్యను పెంచటంతో సహాయపడుతుంది. విరోచనాలవుతున్నప్పుడు రోజులో రెండుమార్లు పెరుగు తీసుకుంటే యాంటీబయాటిక్స్ ప్రభావం తగ్గిపోతుంది.

**ఈస్ట్ ఇన్ఫెక్షన్స్ :** పెరుగులోని సూక్ష్మజీవుల ప్రభావం స్త్రీలలో యోని ప్రాంతంలో చేరే సూక్ష్మజీవులను నిరోధించగలదు. ఆ సూక్ష్మజీవుల సంఖ్యను తగ్గించగలిగిన శక్తి పెరుగుకి వుంది.

**కోలన్ క్యాన్సర్ :** వయసుమళ్ళుతున్నవేళ ఏర్పడే ఇబ్బందుల నుండి పెరుగుబయటపడేస్తుంది. బైఫిడస్‌బ్యాక్టీరియాల సంఖ్యను తగ్గిస్తుంది. పేగులోచేరే ఈ బ్యాక్టీరియమ్‌లు ఉత్పత్తిచేసే రసాయనాలు విషపూరితం. అటువంటి బ్యాక్టీరియమ్‌లు పేగుకు తెచ్చే క్యాన్సర్ ప్రమాదాన్ని పెరుగు వాడకంతో తగ్గించుకోవచ్చును.

ప్రొటీన్లు, క్యాల్షియమ్, మినరల్, విటమిన్‌లు, కార్బోహైడ్రేట్‌లు వుంటాయి. పెరుగు అనేది పిల్లలకు, వయసుమళ్ళినవారికికూడా మేలు చేస్తుంది. ఇళ్ళలో మిగిలిన పాలను తోడువేసి పెరుగు తయారుచేస్తారు. పెరుగుచిలికి మజ్జిగ, చిలుకుతున్న సమయంలో వచ్చే వెన్న, ఆ వెన్నను నెయ్యిగా కాచి వాడతారు.

ప్రతి ఇంటిలో పాడిపశువులు ఉన్న కాలంలో పెరుగు,మజ్జిగలను విరివిగా ఉపయోగించారు.

వేసవి వచ్చిందంటే మజ్జిగ తాగి వేసవి వ్యతిరేకతను తట్టుకునేవారు. రాత్రి అన్నంలో పాలుపోసి తోడు వేసి,ఉదయాన్నే పెరుగుగామారిన ఆ అన్నం తిని పనిలోకి వెళ్ళేవారు. ఆ పెరుగన్నం అంత సులభంగా ఆకలి-వెయ్యనిచ్చేది కాదు.

పొలం పనులకు అవసరమయిన శక్తినిచ్చేది. పెరుగు తీసుకోవటంతో ఎన్నెన్నో లాభాలు ఉన్నాయి.

**పాలు పడకపోవటం తగ్గిస్తుంది :** కొంతమంది పిల్లలకు పాలు పడవు. అటువంటివారికి పెరుగు ఇవ్వటం మంచిది. ఇది పాలకు కొంతమేర ప్రత్యామ్నాయం. పాలలోని లాక్టోజ్‌పడక ఇబ్బందిపడే పిల్లలు, పెద్దలకు పెరుగు ఎంతో మేలుచేస్తుంది. లాక్టోజ్‌ని గ్రహించేలా శరీరానికి సహాయపడుతుంది.

**రక్తపోటు నిరోధకం :** అధిక రక్తపోటు (హైపర్ టెన్షన్)ని తగ్గించేందుకు సహజమైన మార్గంగా పెరుగును చెపుతారు. పెరుగులోని పొటాషియమ్ శరీరంలో అధికంగా చేరిన సోడియమ్ లవణాలను బయటకు పంపటంలో సహాయపడుతుంది.

దీనితో మూత్రపిండాలు, గుండెలమధ్య సమతుల్యతను తెచ్చి, రక్తపోటును అదుపులో ఉంచుతుంది. కొవ్వు తక్కువగా వుండే పెరుగును మూడు పూట్లా తినగలిగితే పక్షవాత ప్రమాదం తగ్గుతుందని నిరూపణ అయింది. పెరుగును భోజనంలోనే తీసుకోవాలని లేదు. ఇతర విధాలుగా కూడా తీసుకోవచ్చు. కొందరు పెరుగును నేరుగా తీసుకుంటారు.

మజ్జిగ తాగే అలవాటు మరికొందరిది. పండ్లమీద కలుపుకుని, పచ్చికూరకాయలమీద పోసుకునితినటం చెయ్యగలరు. మార్కెట్‌లో వివిధరకాల పెరుగులు లభిస్తాయి. కొవ్వులు లేనిది, 2శాతం కొవ్వులు కలిగిన పెరుగును తక్కువస్థాయి కొవ్వుల పెరుగని, 4శాతం కొవ్వులు వుంటే ఎక్కువ శాతం కొవ్వు పెరుగని అంటారు. బయట కొనుక్కునేకన్నా ఇంటిలోనే పెరుగు తయారుచేసుకోవటం మంచిది.

పెరుగు తోడువేయటం ఒక కళ అంటారు. పెరుగు తయారీకి ఉష్ణోగ్రత కీలకం. సరైన ఉష్ణోగ్రత దగ్గర పాలను తోడువేయాలి.

తోడుకునేందుకు పెరుగువేసినతర్వాత పాలను కలియబెట్టాలి. ఆ తర్వాత తోడువేసిన పాలమీద మూతపెట్టి, ఆ పాత్రను కదల్చకుండా పక్కనుంచాలి. సాధారణంగా నాలుగుగంటలు గడిచేసరికి పెరుగు తయారవుతుంది. పైన తేలిన నీటిని ఒంపేసి పెరుగును తినవచ్చు. తాజా పెరుగు రుచే వేరు.

పెరుగు చట్నీ మన దేశంలో విశేష ఆదరణ కలిగినది. గోధుమ వంటకాలకు రైతా చక్కని కాంబినేషన్. ఎన్నో తరాలుగా పెరుగు వాడి ఆరోగ్యంగా జీవిస్తున్న జాతి మనది. ఆ సాంప్రదాయం కొనసాగిద్దాం! ఆరోగ్యం మెరుగుపరుచుకుందాం.

# స్కూల్లోనే ఎన్నో అనుభవాలు

'ప్రేమమ్'తో ప్రేక్షకుల్ని కట్టిపడేసింది అనుపమా పరమేశ్వరన్. తెలుగు, మలయాళ పరిశ్రమల్లో మంచి గుర్తింపు పొంది, సినిమాలను జాగ్రత్తగా ఎంచుకుంటున్నది.ఆమెతో ఇంటర్వ్యూ.

**మీకు చిన్నప్పటినుంచి సినిమా హీరోయిన్ కావాలన్న ఆలోచన ఉండేదా?**

లేదు. కనీసం స్కూలు నాటికల్లో పాల్గొనలేదు. మరే ఇతర పర్ఫార్మెన్సులూ ఇవ్వలేదు. అయితే, ఓ క్లాసికల్ డ్యాన్సర్‌గా నాకు నటిగా ఛాన్స్‌వస్తే బాగా చేయగలననిమాత్రం అనుకునేదాన్ని.

సినిమాపట్ల నాకుగల దృక్పథాన్ని మాత్రం నా కుటుంబసభ్యులు గుర్తించారు.

మిగతావారికి భిన్నంగా వుండేది. మిగతావారంతా వినోదంకోసం చూస్తే, నేను సినిమా చూస్తున్నప్పుడు ఆ యా సన్నివేశాల సంసిద్ధత ఏర్పాట్లగురించి ఆలోచించేదాన్ని. ఒకే షాట్‌ను విభిన్న యాంగిల్స్‌లో తీయడంపట్ల కూడా అబ్బురపడేదాన్ని.

**మరి సినిమాలపట్ల మీలో ఉన్న ఆసక్తిని ఎప్పుడు గమనించారు?**

సినిమా చూస్తున్నప్పుడు ఇటువంటి విశ్లేషణ రావడమే నాలోని నటిని బయటపెట్టేదేమో.

హైస్కూల్‌లో ఉన్నప్పుడు డ్రామా ట్రూప్‌పట్ల ఆకర్షితురాలిని కావడంతో రియలైజ్ అయ్యాను. విభిన్న స్టయిల్స్ నటన గురించి అభ్యసించడానికి అనేకరకాల సినిమాలు చూసేవాళ్ళం.

**మీ బాల్యం ఎలా ఉండేది?**

సాధారణ మిగతా అమ్మాయిల మాదిరే ఉండేది. మాది మధ్యతరగతి కుటుంబం. కళలకు బాగా ఎక్స్‌పోజర్‌గల ఇరింజలకుడలో జన్మించాను. అక్కడ జాతీయస్థాయి డ్యాన్సర్లు, సంగీతకారులు ఉండేవారు. డ్యాన్స్ క్లాసుల్లో చేరి, అనేక అదనపు కార్యకలాపాల్లో పాల్గొనడానికి అవకాశం లభించింది. అది మా ఇంటికి బాగా దగ్గరలో ఉండేది.

ఆర్ట్‌కు సంబంధించి మా స్కూల్ డాన్‌బాస్కోలో కూడా బాగా ప్రోత్సహించేవాళ్ళు. నేను మూడు స్కూల్స్ మారాను. మూడూ కూడా నా స్టేజ్ ఫియర్ పోవడానికి మంచి వేదిక అయ్యాయి.

**'ప్రేమమ్' సినిమాలోని మేరీ మాదిరి స్కూల్లో అభిమానులు ఏర్పడడం వాస్తవిక జీవితంలో అనుభవం అయిందా?**

(నవ్వేస్తూ) అటువంటి అనుభవాలు అనేకం. ఉత్తరాలు కూడా అందుకునేదాన్ని. సైకిల్‌పైన అనుసరించేవాళ్ళు అప్పుడూ ఉండేవారు. నిజానికి ఈ కారణంగానే మేరీ పాత్రకు దగ్గరయ్యానేమో.

**తొలి ఆడిషన్ అనుభూతులు ఎలా ఉన్నాయి?**

'ప్రేమమ్' ఆడిషన్ గురించి చెప్పుకోవాలి. కెమెరా ముందు తొలిసారి నిలబడ్డాను. చాలా భయంవేసింది. 'ప్రేమమ్' ఓ మ్యాజిక్ మాదిరి సంభవించింది. నేను కాలేజీలో ఉన్నప్పుడు నా ఫ్రెండ్స్ నివిన్‌పాలి తన ప్రొఫైల్‌లో లోడ్‌చేసిన కాస్టింగ్ కాల్ గురించి చెప్పారు. వేలాదిమంది అమ్మాయిలు వుంటారు కాబట్టి నాకు అవకాశం రాదన్నాను. కాని నా ఫ్రెండ్ బలవంతంగా నా పిక్చర్ పంపింది.













త్వరలో నన్ను షార్ట్‌లిస్ట్ చేశారు. ఫోన్‌కాల్‌వచ్చింది. కాని మా అమ్మానాన్నలు అంత సుముఖత చూప లేదు. మాది కన్సర్వేటివ్ మధ్యతరగతి కుటుంబం. నా ఫోటోలను తెలియనివారితో 'షేర్' చేయడం వారికి సంతోషాన్ని ఇవ్వలేదు.

అయితే, ఆడిషన్లకు తీసుకువెళ్ళారు. నా పార్ట్ చేసి ఇంటికి వచ్చాక నిరుత్సాహపడ్డాను.

**ఎందుకు నిరుత్సాహపడ్డారు?**

డెబ్బైశాతం బాగానే చేశాను. 30 శాతం డైలాగులు సరిగ్గా చెప్పలేకపోయాను. బాగా డైలాగ్స్ చెప్పడం ఆ రోజు కుదరలేదు. కాస్టింగ్‌సిబ్బంది నా రూపంతో సంతృప్తి చెందారు కాని, నా డైలాగ్స్ డెలివరీవాళ్ళకు నచ్చ లేదు. అప్పుడు అసిస్టెంట్ డైరెక్టర్ ఓ సలహా ఇచ్చారు.

కేవలం ఈ సినిమాకోసమే కాక, జీవితంలో ఏది సాధించ డానికైనా కాన్ఫిడెన్స్ కావాలని, ఏదయినా చెప్పదలుచుకున్నప్పుడు అద్దంలో చూసుకుంటూ ప్రాక్టీస్ చెయ్యమన్నారు. ఇక ఈ సినిమా ఆశ వది లేసుకున్నాను. తదుపరి రెండు వారాలు అప్‌సెట్ అయివున్నాను. అద్దంలో చూసుకుని, మాట్లాడుతూ ప్రాక్టీస్ చేయడాన్ని ఆరంభించాను.

**తర్వాత ఛాన్స్ దక్కించుకున్నారుగా?**

(మరోమారు నవ్వేస్తూ) అవును, 'ప్రేమమ్' టీమ్ నుంచి మళ్ళీ కాల్ వచ్చింది. నివిన్ పాలెను, మిగతా సిబ్బందిని చూడడానికి ఆడిషన్‌కు వెళ్ళా.

ఈసారి నేను చెప్పిన డైలాగులకు అక్కడ ఉన్న వారందరి ప్రశంసలూ దక్కాయి.

**మీరు నటి కాకపోయి వుంటే ఏమయ్యేవారు?**

అవకాశం వస్తే, నా మాస్ కమ్యూనికేషన్ గ్రాడ్యుయేషన్ పూర్తిచేసి ట్రావెలింగ్, యాంకరింగ్ లేదా ఏదైనా నన్ను సంతోషంగా, కాన్ఫిడెంట్‌గా ఉంచగల పనిచేసుకునేదాన్ని.

**మీకు నచ్చే తార,స్ఫూర్తి ఎవరు?**

నిత్యామీనన్ పని నాకు బాగా నచ్చుతుంది. తన కళ్ళు చాలా అందంగా ఉంటాయి. తనమాదిరి కళ్ళతో భావాలు పలికించడం నాకు ఎంతో ఇష్టం.

నయనతార ఓ నటిగా తనను తను మెయిన్‌టెయిన్ చేసుకోవడం చాలా బావుంటుంది.

ఎవరో ఒక నటి రోల్ మోడల్ అనికాకుండా ప్రతి నటీ చేసిన మంచిపాత్రనుంచి స్ఫూర్తిపొందుతా.

**ధనుష్‌తో నటించిన అనుభవం ఎలా ఉంది?**

గొప్ప నటుడు. డైలాగులు గుర్తుచేసుకోవాల్సిన అవసరం అతనికి ఉండదు. ఆయనకున్న అనుభవం వల్ల నేను కొంత నెర్వస్‌గా ఫీలయ్యాను. చాలా సపోర్టివ్. నాకెన్నో నేర్పించాడు. మొదట్లో లైటింగ్ గురించిన ఆలోచన నాకు ఉండేది కాదు.

దాన్నో సమస్యగా అనుకోలేదు. నా లక్ష్యం సెట్‌కు వెళ్ళడం,నటించడమన్నట్లు ఉండేది. కెమెరా ముందు పర్‌ఫార్మ్‌చేస్తున్నప్పుడు సరైన లైటింగ్ ఉండాల్సిన అవసరాన్ని అతను తెలియజెప్పాడు. నా పొజిషన్లు కరెక్ట్ చేసేవాడు. ధనుష్ గొప్ప పర్‌ఫార్మర్.

**స్క్రిప్టులో మీరేం చూస్తారు?**

మూడు విషయాలను ప్రధానంగా చూస్తాను.కథ బావుంటే చేస్తాను లేదా స్క్రిప్టులో కథకంటే నాపాత్ర స్ట్రాంగ్‌గా ఉండాలి.పర్‌ఫార్మెన్స్‌కు ప్రాధాన్యం ఉండాలంటూ ముగించింది అనుపమా పరమేశ్వరన్.

**అయినపూరి సుజాత**

"ఆ ఇల్లు ఎక్కడుంది.లొకేషన్ తెలుసా" గౌతమ్‌ని అడిగాడు ప్రకాష్
"నాకు తెలియదు. ప్రస్తుతం నా స్నేహితుడు బయటకు వెళ్ళాడు. రెండుగంటల తరువాత తిరిగివస్తాడు. అప్పుడు మళ్ళీ మీకు కాల్‌చేస్తాను. నా స్నేహితుడు అడ్రస్ చెప్తాడు" అన్నాడు గౌతమ్.

"అయితే రెండు గంటల తరువాత మళ్ళీ కాల్ చేస్తాను. నువ్వు జాగ్రత్తగా ఉండు. అసలే మావ్ జిత్తులమారి నక్క. ఉంటాను బై" అని గౌతమ్‌కి చెప్పి లైన్ కట్ చేశాడు ప్రకాశ్.

# జై భారత్

## చిత్తి వెంకటేష్



స్వాతి మళ్ళీ కళ్ళు తెరిచిచూసేసరికి తను ఒక గదిలో నేలమీద ఉన్నట్టు గ్రహించింది. తెలివి వచ్చింది కాని ఇంకా ఆమెలో మత్తు వీడలేదు.కళ్ళు ఇంకా మండుతున్నాయి ఆమెకు.

శరీరం వచ్చి పుండులా ఉంది. తను ఎంతసేపు ఇలా పడుకుందో ఆమెకు తెలియలేదు.మెల్లగా లేచి తలుపు దగ్గరికి వెళ్ళింది.

గట్టిగా లాగి చూసింది. బయట గడియవేసి వుంది. గట్టిగా తలుపులమీద బాదింది. ఎంతసేపు కొట్టినా తలుపులు మాత్రం తెరుచుకోలేదు. ఇక చేసేది లేక తిరిగి వెళ్ళి నేలమీద కూర్చుంది.

ఇంతలో తలుపు తెరుచుకుని లోపలికి వచ్చాడు ఒక వ్యక్తి. స్వాతి వెంటనే అతన్ని గుర్తుపట్టింది.రోజూ స్వాతిని నీడలా వెంటాడినవాడు అతను. అతన్నిచూడగానే భయంతో వణికిపోయింది స్వాతి. ఒక రాక్షసుడిని చూస్తున్నట్టుగా బెదిరిపోయింది. అతను తాపీగా వచ్చి స్వాతి ఎదురుగా నేలమీద కూర్చున్నాడు.

"ప్లీజ్ నన్నేం చెయ్యకు. నా జీవితాన్ని నాశనం చెయ్యకు" అంటూ రెండు చేతులు ఎత్తి ప్రార్థించింది స్వాతి. చిన్నగా నవ్వాడు అతను.

"నీ అందంతోకాని, నీ శరీరంతోకాని నాకు అవసరంలేదు. నాకు కొన్ని అనుమానాలున్నాయి. వాటిని తీరిస్తే నిన్ను పువ్వుల్లో పెట్టి మీ ఇంట్లో విడిచిపెడతాను. జన్మలో నీ జోలికి మళ్ళీ రాను" అన్నాడతను.

"ఏమిటి నీ అనుమానాలు" ధైర్యం కూడదీసుకుంటూ అడిగింది స్వాతి"ముందు నీ కుటుంబం గురించి వివరాలు చెప్పు"

"నా కుటుంబం గురించి ప్రత్యేకంగా చెప్పటానికి ఏముంది. మాది చాలా చిన్న కుటుంబం. నేను,అమ్మ, అన్నయ్య. ఇంతే మా కుటుంబం"

"మీ నాన్నగారు ఏం చేసేవారు"

"ఏమో నాకు తెలియదు. నా చిన్నతనంలోనే నాన్నగారు పోయారు.ఫోటోలోతప్ప ప్రత్యేకంగా ఒక్కసారి కూడా ఆయన్ని చూడలేదు" అంది స్వాతి.

### జరిగిన కథ

(11) క్యాంటీన్‌లో తనని కలిసిన ప్రద్యుమన్‌కి సిన్హా పంపిన ట్రాన్స్‌మీటర్‌ని రహస్యంగా అందిస్తాడు సింగ్. భారత్ నుంచి వచ్చిన అండర్ కరెంట్ ఏజెంట్‌ని వెదికి పట్టుకోమని మావ్ నాకు అప్పజెప్పాడని ప్రద్యుమన్‌తో చెబుతాడు 'లీ'.

సిన్హాతో ట్రాన్స్‌మీటర్ ద్వారా రహస్యంగా తన ఎస్సైన్‌మెంట్ వివరాలు చెబుతాడు ప్రద్యుమన్.తనని ఇండియన్ స్పైగా సుజి గుర్తించిందని తెలిసి అదిరిపడతాడు గౌతమ్.

ఎవరో దుండగులు కాలేజీ నుంచి వస్తున్న స్వాతిని కిడ్నాప్ చేస్తారు.

రెండు రోజుల ముందు మందుకొట్టి నీతో అఫీషియల్ విషయాలు మాట్లాడాను. అవేమిటో చెప్పమని ప్రద్యుమన్‌ని నిలదీస్తాడు లీ. నాతో అఫీషియల్ విషయాలేం మాట్లాడలేదని బుకాయిస్తాడు ప్రద్యుమన్.

'తన కూతురు స్వాతి కనపడడం లేదని విశాలాక్షి ప్రద్యుమన్ ఇచ్చిన నెంబరుని ఇన్‌స్పెక్టర్‌కి ఇస్తుంది. ఇక జరిగేది చదవండి.



"మీ సొంత ఊరు ఎక్కడ"

"హైదరాబాదుకు దగ్గరగా ఉన్న పావురాలపల్లి అనే గ్రామం. అక్కడే నేను పుట్టానని అమ్మ తరుచు చెపుతుండేది" అంది స్వాతి.

"మీ అన్నయ్య ఎక్కడ ఉన్నాడు"

"చైనాలో. అక్కడ ఇంగ్లీష్ ట్యూటర్‌గా పనిచేస్తున్నాడు. ఈ మధ్యనే వెళ్ళాడు. అయినా ఈ వివరాలన్నీ ఎందుకు అడుగుతున్నావు. ఇంతకీ ఎవరు నువ్వు" చిరాకుగా అంది స్వాతి.

"ప్రశ్నకు ప్రశ్న జవాబు కాదు. నేను అడిగే ప్రశ్నలకు మర్యాదగా జవాబు చెప్పు. లేకపోతే నాకు విపరీతమైన కోపం వస్తుంది. కోపం వస్తే నేను మనిషిని కాను" అన్నాడు అతను కోపంగా.

అలాగే అని భయంగా తలూపింది స్వాతి.

"ఇంతకుముందు మీ అన్నయ్య ఎక్కడ ఉద్యోగం చేసేవాడు" అడిగాడతను.

"ఒక ఇంట్లో నైట్‌వాచ్‌మెన్ ఉద్యోగం చేసేవాడు. సాయంత్రం ఆరుగంటలకు వెళ్ళి మరుసటిరోజు ఉదయం ఆరుగంటలకు తిరిగివచ్చేవాడు. జీతం మాత్రం చాలా తక్కువగా ఉండేది. అందుకే ఆ ఉద్యోగం విడిచిపెట్టి చైనా వెళ్ళాడు"

"అంతకుముందు ఏ ఉద్యోగం చేసేవాడు"

"ఏవో చిన్న చిన్న ఉద్యోగాలు చేసేవాడు. అవి నచ్చక మానేశాడు" అంది స్వాతి.

"మీ అన్నయ్య ఎప్పుడైనా ఊరు విడిచివెళ్ళాడా"

"తెలియదు. అంతగా గుర్తులేదు"

"బాగా గుర్తుచేసుకో. ఇది నాకు చాలా ముఖ్యమైన విషయం. కనుక బాగా ఆలోచించి జవాబుచెప్పు"

"ఒకసారి ఏదో ఊరికి వెళ్ళి ఆరునెలలు తిరిగి రాలేదు. కాని ప్రతి నెలా డబ్బు మాత్రం పంపించేవాడు. ఆ ఊరు పేరు గుర్తులేదు"

"మీ అన్నయ్య ఇంట్లో లేనప్పుడు ఎవరైనా ఇంటికి వచ్చేవాళ్ళా" అడిగాడతను.

"అప్పుడప్పుడు అన్నయ్య స్నేహితులు వచ్చేవాళ్ళు" అంది స్వాతి.

ఇక ప్రశ్నలపరంపర ముగిసినట్టు అతను లేచి నిలబడ్డాడు. స్వాతి వైపు ఒక్కక్షణం పాటు భావరహితంగా చూసి గదిలోంచి వెళ్ళిపోయాడు. హమ్మయ్య అనుకుని తేలిగ్గా నిట్టూర్చింది స్వాతి.

ఆ తరువాత అతను మళ్ళీ గదిలోకి రాలేదు. కాని వేళకు టిఫిన్, కాఫీ మాత్రం పంపించేవాడు.

"గౌతమ్ కాని వచ్చాడా" అడిగాడు మావ్."లేదు కామ్రేడ్. మన మనిషి ఇరవై నాలుగు గంటలు అపార్ట్‌మెంట్ దగ్గర కాపలా కాస్తున్నాడు. కాని ఇంతవరకు అతని జాడ తెలియలేదు. ఎక్కడికి వెళ్ళాడో అర్థం కావటం లేదు. అతనికి బాగా కావల్సినవాళ్ళు, స్నేహితులు ఎవరూ లేరు.

ఈ విషయం మా దర్యాప్తులో తేలింది. ఇంకెక్కడికైనా అతను వెళ్ళే అవకాశం ఉందా అని మనవాళ్ళు తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు.మామూలుగా ఇలాంటి పరిస్థితిలో ఎవరైనా ఎంబసీకి వెళతారు.

ఎవరికైనా చెంతాడంత కోరికలు ఉండడం సహజమే. అదే కొండంత కోరిక అయితే తీరడం కాసింత కష్టమే కావచ్చు. గత ఏడాదంతా వెండితెరపై మెరుపులు వెదజల్లిన మెహరీన్‌కు అటువంటి భారీకోరిక ఉంది.

టాలీవుడ్‌లో ఓ ప్రత్యేక కాలాన్ని 'మెహరీన్ శకం'గా చెప్పుకోవాలన్నది ఈ పంజాబీ పోరి కోరిక. "నా కల, కోరిక ఇవే" అంటూ అందరికీ తరచూ చెప్తోంది ఒకనాటి ఈ బొద్దు బొమ్మ. తీరుతుందా... అత్యాశా...?



మనవాళ్ళు ఎంబసీని వెయ్యికళ్ళతో గమనిస్తున్నారు. కాని ఇంతవరకు గౌతమ్ అక్కడికి రాలేదు. ఈ విషయం ఖచ్చితంగా చెప్పగలను" అన్నాడు మావ్ జూనియర్ అధికారి.

"మీరేం చేస్తారో ఎలా చేస్తారో నాకు అనవసరం. ఆరునూరైనా నాకు గౌతమ్ కావాలి. అది ప్రాణాలతో. మనవాళ్ళకు అతని సెల్‌ఫోన్ అపార్ట్‌మెంట్‌లో దొరికింది. కాని లాక్ చేసి ఉంది.

మన టెక్నీషియన్స్ దాన్ని ఓపెన్ చెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు. ఈలోగా మీ ప్రయత్నాలు మీరు చెయ్యండి. అతనికి ఎక్కడ దాక్కునే అవకాశం ఉందో తెలుసుకోండి. ఈ విషయంలో అతనికి ఎవరు సహాయం చేస్తున్నారో కూడా తెలుసుకోండి. ఆ వ్యక్తిని అదుపులోకి తీసుకోండి. ఇది నా ఆర్డర్ వెళ్ళండి" అన్నాడు మావ్.

ఆఫీసర్ స్టిఫ్‌గా సెల్యూట్ చేసి అక్కడనుంచి నిష్క్రమించాడు. అది మావ్ పర్సనల్ చాంబర్. ఆ గదిలో అతనితోపాటు సుజి కూడా ఉంది. ఒక గంటకుముందే ఆమె ఆఫీసుకు వచ్చింది.

జరుగుతున్న డ్రామా అంతా ఆమె జాగ్రత్తగా గమనిస్తోంది. ఉద్వేగంతో ఆమె శరీరం సన్నగా కంపిస్తోంది. ఏ క్షణంలో ఏం జరుగుతుందో అని విపరీతంగా భయపడుతోంది సుజి.

ముఖ్యంగా గౌతమ్ ఆచూకీ తెలిసిపోతుందని లోపల తెగ టెన్షన్ పడుతోంది ఆమె. మావ్‌ను పలకరించాలంటే బెదిరిపోతోంది. అప్పుడే మావ్ సెల్‌ఫోన్ చప్పుడు చేసింది. అది ప్రకాశ్ చేసిన కాల్.

"ఎస్ ప్రకాశ్, గౌతమ్ గురించి ఏమైనా సమాచారం తెలిసిందా" అడిగాడు మావ్.

"తెలిసింది. అతను సిటీలోనే ఉన్నాడు. కాని ఎక్కడ ఉన్నాడో అతనికే ఖచ్చితంగా తెలియదు. అతని స్నేహితుడు ఒకడు గౌతమ్‌ను తన ఇంటికి తీసుకువెళ్ళి దాచాడు. నేను కాల్ చేసినప్పుడు ఆ స్నేహితుడు ఇంట్లో లేడు. అందుకే గౌతమ్ అడ్రస్ చెప్పలేకపోయాడు. రెండు గంటల తరువాత కాల్ చెయ్యమని చెప్పాడు. అలాగే చేశాను కాని రెస్పాన్స్ లేదు. ఇది జరిగింది" అన్నాడు ప్రకాశ్.

"ఎక్స్‌లెంట్ వర్క్. కాని నాకు ఎందుకో గౌతమ్ మీద అనుమానంగా ఉంది. అతను కావాలనే మీకు అడ్రస్సు చెప్పలేదని తోస్తుంది"

"కారణం"

"బహుశా నీమీద అతనికి అనుమానం కలిగి ఉండవచ్చు. కాని ఆ విషయం నీకు తెలియకుండా నాటకమాడుతున్నాడని నాకు అనుమానంగా ఉంది. ఇది నిజం కావచ్చు, కాకపోవచ్చు" ప్రకాశ్ ఏం మాట్లాడకుండా లైన్ కట్ చేశాడు. మావ్ కూడా సెల్ ఆఫ్‌చేసి సుజి వైపు విజయగర్వంతో చూశాడు.

"గౌతమ్ ఆచూకీ చూచాయిగా తెలిసింది. ఎంబసీలో ఉన్న మన ఇన్‌ఫార్మర్ ప్రకాశ్ చెప్పాడు. సిటీలోనే ఉన్నాడని అతను చెప్తున్నాడు.

కాని ఎక్కడున్నాడో మాత్రం గౌతమ్ అడ్రస్ చెప్పలేకపోతున్నాడు. ఐనా ఫర్వాలేదు. మనవాళ్ళందరినీ హౌస్ టూ హౌస్ స్వీప్ చెయ్యమని చెప్పాను. ఈరోజు కాకపోయినా రేపైనా దొరకకుండా పోడు. కాకపోతే ఓపికతో వేచి ఉండాలి" అన్నాడు మావ్.

మావ్ మాటలకు ఒక్కసారిగా అదిరిపాటుకులోనయింది సుజి. నిజంగా మావ్ చెప్పినట్టు చేస్తే గౌతమ్ ఆచూకీ కొన్ని గంటలలో తెలిసిపోతుంది.

అంతకంటే ముందు తను వెళ్ళి అతన్ని అక్కడ నుంచి వేరే చోటుకు షిఫ్ట్ చెయ్యాలి.

ఆ ఆలోచన రాగానే సుజి, మావ్ దగ్గరికి వెళ్ళి తనకు ఈ రోజు సెలవు కావాలని అడిగింది. మావ్ ఏ మూడ్‌లో ఉన్నాడో కాని వెంటనే లీవ్ శాంక్షన్ చేశాడు. కాని ఒక హెచ్చరిక చేశాడు. రేపు తప్పకుండా ఆఫీసుకు రావాలని చెప్పాడు. ఇంకో పదిహేనురోజుల వరకు సెలవు ఇవ్వటం కుదరదని కూడా చెప్పాడు. ఒక్కక్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా సుజి కారులో తన ఇంటికి చేరుకుంది.

ఒక ఎయిర్‌బ్యాగ్‌లో కొన్నిజతల బట్టలు ముఖ్యమైన సామానులు సర్దుకుంది. బీరువాలోంచి డబ్బు తీసి పర్స్‌లో పెట్టుకుంది. మావ్‌ను తప్పించుకుని ఎన్నిరోజులు ఉండవలసివస్తుందో తెలియదు. అందుకే ఏటిఎమ్‌లో కొంచెం డబ్బు డ్రా చేసుకుంది. తరువాత ఇంకా కొన్ని సామానులు తీసుకుని కారులో తన మేనత్త ఇంటికి చేరుకుంది.

ఆమె లోపలికి వెళ్ళేసరికి గౌతమ్ కాఫీ తాగుతూ మంచం మీద కూర్చుని ఉన్నాడు. కాఫీ కప్పు టీపాయ్ మీద పెట్టి చిరునవ్వుతో ఆమెను ఆప్యాయంగా దగ్గరికి తీసుకున్నాడు. ఆ స్పర్శలో ప్రేమ మాత్రమే ఉంది. సుజి ఉపోద్ఘాతం లేకుండా మావ్ ఆఫీసులో జరిగిన విషయం అంతా చెప్పింది.

"అసలు నువ్వు ప్రకాశ్‌కు ఎందుకు కాల్ చేసి మాట్లాడావు. నువ్వు అతనికి రింగ్‌చేసి ఉండకపోతే నీ గురించి మావ్‌కు తెలిసేది కాదు" అంది సుజి.

"నేను కావాలనే అలా చేశాను. ప్రకాశ్, మావ్ ఇన్‌ఫార్మర్ అని మా డైరెక్టర్ గారు నాకు మెసేజ్ చేశారు. ఇంతకాలం ప్రకాశ్ చాలా మంచివాడని దేశభక్తుడని నమ్మాను. కాని అతను నన్ను బాగా నమ్మించి ద్రోహం చేశాడు. ఆ బాధ తట్టుకోలేకపోయాను.

కావాలనే నేను ప్రకాశ్‌కు కాల్ చేసి నా ఆచూకీ చెప్పాను. కాని ఒక స్నేహితుడు నాకు సహాయం చేశాడని చిన్నఅబద్ధం చెప్పాను. అంతే" అన్నాడు ప్రకాశ్.

"కాని అదే అబద్ధం ఇప్పుడు మనని ఆపదలో పడేసింది. మావ్ మనుష్యులు ఇరవై గ్రూపులుగా విడిపోయి సిటీలో ఉన్న ప్రతి ఇంటినీ చెక్ చేస్తున్నారు. ఇక్కడ ఉండటం మనకు క్షేమం కాదు.

వెంటనే బయలుదేరు. ప్రతి నిమిషం మనకుచాలా విలువైంది" అంది సుజి. పది నిమిషాలలో ఇద్దరూ అవసరమైన సామానులు తీసుకుని రెడీ అయ్యారు.

విశాలాక్షి ఆటో దిగి లోపలికి వెళ్ళింది. తలుపు తాళం తియ్యబోతూ అప్రయత్నంగా ఆగి పోయింది. ఆమెకు ఎడంవైపు స్వాతి కనిపించింది. కాని ఆమె స్పృహలో లేదు. సంతోషం, ఆనందం ఆవిడను కలిసికట్టుగా కుదిపేసింది.



ప్రైవేట్‌రంగ సంస్థల తీరులో ప్రైవేట్‌రంగ వ్యవస్థలు సమర్థవంతంగా, చక్కని పనితీరును ఎందుకు చూపలేకపోతున్నాయో అర్థం కాదు. -జస్టిస్ చలమేశ్వర్, సుప్రీమ్‌కోర్ట్ న్యాయమూర్తి

వెంటనే తలుపులు తాళం తెరిచింది. స్వాతిని ఎత్తుకుని వెళ్ళి గదిలో మంచంమీద పడుకోపెట్టింది. గ్లాసులో నీళ్ళు తీసుకువచ్చి ఆమెమొహంమీద చిలకరించింది. మెల్లగా కళ్ళు తెరిచింది స్వాతి.

ఎదురుగా తల్లి కనిపించేసరికి ఒక్కసారిగా ఆవిడను చుట్టుకుపోయింది.

"ఇంతసేపు ఎక్కడికి వెళ్ళావమ్మా. నిన్నంతా నువ్వు కనిపించకపోయేసరికి చాలా భయపడ్డాను. నీ స్నేహితులందరికీ కాల్ చేశాను.

నిన్న కాలేజీకి సెలవు అని అందరూ చెప్పారు. అటు కాలేజీ లేక ఇటు ఇంటికి రాకుండా నువ్వు ఏమైపోయావో అని తల్లడిల్లిపోయాను. గత్యంతరం లేక పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి రిపోర్ట్ చేశాను.ఇంతకీ ఏం జరిగింది తల్లీ. నువ్వు ఎక్కడికి వెళ్ళావు.కనీసం కాల్ చేసి నాకు చెప్పిఉండవచ్చుగా" అంది విశాలాక్షి.

"నాకు నేనుగా ఎక్కడికీ వెళ్ళలేదమ్మా. ఎవరో నాకు మత్తుమందు ఇచ్చికారులో తీసుకువెళ్ళారు. అక్కడ నన్ను ఒక గదిలో పెట్టారు. నన్ను ఏం చెయ్యలేదు కాని మన కుటుంబం గురించి కొన్ని ప్రశ్నలు అడిగారు.

నాకు తెలిసినంతవరకు చెప్పాను. ముఖ్యంగా వాళ్ళు అన్నయ్య గురించి చాలా విషయాలు అడిగారు. అన్నయ్య ఇంతకుముందు ఎక్కడ ఉద్యోగం చేశాడు, ఇప్పుడు ఎక్కడ చేస్తున్నాడు ఇలా చాలా ప్రశ్నలు అడిగారు.

ముందు ఆ మనిషిని చూస్తే చాలా భయంవేసింది. నన్ను ఏదైనా చేస్తాడనుకుని బెదిరిపోయాను. కాని దేవుడి దయవల్ల అలాంటిది ఏం జరగలేదు. నన్ను చాలా మర్యాదగా చూసుకున్నాడు.

వేళకు అన్నీ అమర్చాడు. చివరిసారిగా నాకు టీ ఇచ్చాడు. అది తాగినవెంటనే నాకు అదోలాంటి మత్తు ఆవహించింది. తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు. తిరిగి కళ్ళు తెరిచేసరికి నువ్వు ఎదురుగా కనిపించావు" అంది స్వాతి.

"జరిగిందేదో జరిగింది. ఆ విషయం ఎవరికీ చెప్పకు పోలీసులకు తప్ప" అంది విశాలాక్షి.

"సారీ కామ్రేడ్ ప్రద్యుమన్ మీకు చాలా ఇబ్బంది కలిగించాను" అన్నాడు లీ అపాలజిటిక్‌గా.

"ఎందుకు? మీరేం తప్పు చేశారు కామ్రేడ్" ఆశ్చర్యంగా అడిగాడు ప్రద్యుమన్.

"అనవసరంగా మిమ్మల్ని అనుమానించి చాలా ఇబ్బందిపెట్టాను. పిచ్చిపిచ్చిగా ఆలోచించి ఒక పిచ్చివాడిలా ప్రవర్తించాను. అర్ధరాత్రి అని కూడా చూడకుండా మీ ఇంటిని సోదా చేయించాను.

## ఇదంతా నా అదృష్టం

కాటుకకన్నులను గుండ్రంగా తిప్పేస్తూ హావభావాలు అద్భుతంగా పలికించే అను ఇమ్మానుయేల్ కెరీర్ రేసులో జోరందుకున్నది. స్టార్ హీరోల సరసన అవకాశాలు దక్కించుకుంటూ ఇదంతా తనఅదృష్టం అని ఆనందపడుతోంది.

"నా కెరీర్ చాలా సంతోషంగా సాగుతోంది. పరిశ్రమలోకి వచ్చిన తక్కువ సమయంలోనే మంచిఅవకాశాలు రావడం నా అదృష్టం. పెద్ద హీరోలతో నటించగలుగుతున్నా"నంటున్న అనుఇమ్మానుయేల్ తెలుగు, తమిళం, మలయాళ భాషల్లో వరుగుమీదున్నది.



అప్పుడు ఏం చేస్తున్నానో నాకు ఏం తెలియలేదు. కానీ తీరికగా ఆలోచించిన తరువాత ఆవేశంలో నేను ఎంత పెద్ద తప్పుచేశానో తెలిసివచ్చింది. రాత్రి మీ దగ్గరకి వచ్చి అపాలజీ చెప్పాలని అనుకున్నాను. కాని అర్ధరాత్రి మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యటం ఇష్టంలేక మానుకున్నాను. అందుకే ఇప్పుడు సారి చెపుతున్నాను. ఇంకోసారి వెరీ సారీ. ఇంకెప్పుడు ఇలా జరగదు. నేను గ్యారంటీ" అన్నాడు లీ.

"ఆ విషయం నేను ఎప్పుడో మరచిపోయాను. ఒక్కొక్కసారి ఇలా జరగటం మామూలే.దానికి మీరు ఇంతగా స్పందించవలసిన పనిలేదు. నేను మరచిపోయాను. మీరూ మరిచిపోండి"

"మీ మంచితనం విశాలమైన మనస్సు నన్ను చాలా ఇంప్రెస్ చేసింది. తెలిసిచేసినా,తెలియకచేసినా తప్పు తప్పే.దానికి శిక్షతప్పదు.అందుకే నేనుచేసిన తప్పుకు మీకు చిన్నపార్టీ ఇవ్వాలని అనుకుంటున్నాను. మన మిద్దరం నా క్వార్టర్స్‌లో డ్రింక్స్ తీసుకుందాం, తప్పకుండా వస్తారు కదూ"

"మీరు ఇంతగా పిలిచిన తరువాత రాకుండా ఎలా ఉండగలను. తప్పకుండా వస్తాను" అన్నాడు ప్రద్యుమన్. లీ తృప్తిపడి వెళ్ళిపోయాడు. ప్రద్యుమన్ క్వార్టర్స్‌కు తాళం వేసి గబగబ సింగ్ క్యాంటిన్‌కి చేరుకున్నాడు. "నీ కోసమే ఎదురుచూస్తున్నాను బాయ్" అన్నాడు సింగ్ మెల్లగా.

"ఎందుకు, ఏదైనా ముఖ్యమైన విషయం చెప్పాలని అనుకుంటున్నావా, కాని నేను అంతకంటే ముఖ్యమైన విషయం చెప్తాను విను. నిన్న రాత్రి లీ మనుష్యులు వచ్చి నా అపార్ట్‌మెంట్ అంతా వెతికారు.

కాని వాళ్ళకు ఏం దొరకలేదు. ఒక బాత్‌రూమ్ తప్ప అన్నిచోట్లా వెతికారు. అదే బాత్‌రూమ్‌లో వెతికి ఉంటే వాళ్ళకు తప్పకుండా ట్రాన్స్‌మీటర్ కనిపించి తీరేది. కారణం తెలియదు కాని అక్కడ వెతకకుండా వెళ్ళిపోయారు" అన్నాడు ప్రద్యుమన్.

"అంతకంటే షాకింగ్ కలిగించే వార్త చెపుతాను విను. బ్లాక్ కోబ్రా ప్రాజెక్టులో పనిచేస్తున్న చాలామంది ఇక్కడికి తరుచువస్తుంటారు. ఆ ప్రాజెక్ట్ గురించి అన్ని విషయాలు చైనీస్ భాషలో మాట్లాడుకుంటూ ఉంటారు.

నాకు చైనీస్‌భాష రాదని వాళ్ళు ఏం మాట్లాడినా నాకు అర్థంకాదని వాళ్ళు అనుకుంటున్నారు. నిజం చెప్పాలంటే నాకు పూర్తిగా కాకపోయిన కొంచెం కొంచెం చైనీస్ భాష వస్తుంది.

ఒకవైపు నా వ్యాపారం చూసుకుంటూనే ఇంకో వైపు వాళ్ళ మాటలను ఆసక్తిగా వినేవాడిని.

నిన్న సాయంత్రం యధాప్రకారం కొంతమంది అధికారులు ఇక్కడికి వచ్చారు. అలవాటు ప్రకారం బ్లాక్ కోబ్రా ప్రాజెక్ట్ గురించి మాట్లాడుకోసాగారు. ప్రత్యేకమైన కారణం తెలియదు. కాని బ్లాక్ కోబ్రా ప్రాజెక్ట్ ఆపేయాలని అధికారులు నిర్ణయించినట్లు తెల్సింది. దానికి పొలిట్‌బ్యూరో సభ్యులు కూడా ఆమోదం తెలిపినట్టు తెలిసింది.

అదే నిజమైతే అంత పెద్ద ప్రాజెక్టుని ఎందుకు

- తెలుగు మాట్లాడే ప్రజలు, వారి చరిత్రపై జస్టిస్ చలమేశ్వర్ ఒక పుస్తకం రాసివుంటే ఆయనకు నోబెల్ పురస్కారం వచ్చివుండేది.
- నిజం, ధైర్యం తోడుగా, న్యాయస్థానంలో రాగ ద్వేషాలకు అతీతంగా వ్యవహరించే ఒక సన్యాసి జస్టిస్ చలమేశ్వర్.

-జస్టిస్ వెంకటాచలయ్య, రిటైర్డ్ సుప్రీమ్‌కోర్ట్ న్యాయమూర్తి



# సరసమైన కథల పోటీ ఫలితాలు

జీవ్వుమనే చలికాలంలో రివ్వున ఎగిరే మనసును, త్రుళ్ళిపడే వయసును ట్యూన్ చేసేందుకు సరసమైన కథల పోటీని పెట్టి సరస కథా చక్రవర్తులను ఆహ్వానిస్తే పోటీపడి మరీ రాశారు. శృంగారంలో నిర్లిప్తత, నిస్సత్తువ, నిస్సహాయతలను పారద్రోలే గొప్ప సెక్సాలజిస్ట్ సరసమైన కథే.వారంవారం సరసమైన కథ చదివితే శరీరంలోని నర నరాన, సర్రున ఉడుకురక్తం ప్రవహించి తీరాల్సిందే!! చదివినవారికి చదివినంత సరసం, శృంగారం, ఆనందం,ఆరోగ్యంతప్పక లభిస్తాయి. దాంపత్య జీవితాలను పండించే ఈ కథలు మీ బెడ్‌రూమ్‌లో రాసరాజ గుళికలు. వారానికి ఒక్కటి చాలు, వారమంతా మన్మథ సామ్రాజ్యంలో తేలియాడాల్సిందే. ఈ పోటీలో మేలైన 10 కథలకు ప్రకటించిన ప్రకారం ₹10,000 చొప్పున మొత్తం

**లక్ష రూపాయల నగదు బహుమతిని అందజేశాం**

**₹10,000 చొప్పున బహుమతి పొందిన 10 కథలు**

- భయం ➤ ముసునూరి సుబ్బయ్య చౌదరి
- టచ్‌మి టచ్‌మి టచ్‌మి ➤ పినిశెట్టి శ్రీనివాసరావు
- తెర తీయగ రాదా! ➤ గొర్లి శ్రీనివాసరావు
- అత్తఫలం ➤ డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు
- నిత్య రహస్య నోము ➤ గంటి రమాదేవి
- వెన్నెలసాక్షిగా... ➤ గంగుల నరసింహారెడ్డి
- అద్భుతమైన వరం ➤ శ్రీమతి కె.వాసవదత్త రమణ
- స్వర్ణ మంజీరాలు ➤ బలభద్రపాత్రుని ఉదయశంకర్
- నలగని మల్లెలు ➤ ఎమ్.వి.ఎల్.ఎస్.సరస్వతి
- థ్యాంక్యూ బేజో రెక్సియా ➤ శ్రీ ఉదయిని

బహుమతి పొందిన విజేతలకు అభినందనలు. పోటీలో పాల్గొన్న రచయిత(త్రు)లందరికీ కృతజ్ఞతలు. త్వరలో బహుమతి కథల ప్రచురణ ప్రారంభిస్తాం. సాధారణ ప్రచురణకు తీసుకున్న కథల గురించి ఆ యా రచయిత(త్రు)లకు వ్యక్తిగతంగా తెలియజేయడం జరిగింది. -ఎడిటర్

ఆపేస్తున్నారో అర్థంకావటం లేదు.

ఎంతో కష్టపడి ట్రయల్ రన్ వరకు తీసుకువచ్చారు. ఇప్పుడు అర్ధాంతరంగా ఎందుకు దానికి బ్రేక్ వేస్తున్నారో అర్థంకావటంలేదు" అన్నాడు సింగ్.

"ఈ వార్త విని నేను సంతోషించాలో బాధపడాలో తోచటంలేదు. మిషన్ ప్రకారం నేను బ్లాక్ కోబ్రాను హైజాక్ చేసి దాన్ని హిమాలయప్రాంతానికి తీసుకురావాలి.

అక్కడ ఎవరికీ కనిపించకుండా దాచాలి. వేడి అంతా తగ్గిన తరువాత దాన్ని తిరిగి ఢిల్లీకి సురక్షితంగా తీసుకురావాలి. ఇది నా ప్లాన్, ప్రాజెక్ట్‌ను ముందుకు నడిపించినా నడిపించకపోయినా దాంతో నాకు ఎలాంటి సంబంధం లేదు. నా పని బ్లాక్ కోబ్రాను హైజాక్ చేసి ఇక్కడ నుంచి తీసుకువెళ్ళటం" అన్నాడు ప్రద్యుమన్.

సింగ్ ఏదో చెప్పబోయాడు. అప్పుడే ఊహించని విచిత్ర మైన పరిణామం జరిగింది. అంతవరకు ట్రాన్స్‌మీటర్ల నుంచి వస్తున్న శబ్దాలు ఉన్నట్టుండి ఆగిపోయాయి.

ఒక్కసారిగా పరిసరాలలో నిశబ్దం నిండుకుంది, పిన్‌డ్రాప్ సైలెన్స్ అయిపోయింది. "చూశావా సింగ్‌బాయ్ ట్రాన్స్‌మీటర్ల శబ్దాలు ఆగిపోయాయి" అన్నాడు ప్రద్యుమన్ కంగారుగా.

"ఇందులో వింత ఏముంది. నెలకు ఒకసారి ఇలా జరుగుతూనే ఉంటుంది. ఇది ఇక్కడమామూలే" అన్నాడుసింగ్.

"అందరికీ రొటీన్ వర్క్ కావచ్చు. కానినాకు ప్రాణాంతకమైంది.నా కొంప మునిగింది. ప్రస్తుతం నా ట్రాన్స్‌మీటర్ ఆన్‌లోనే ఉంది. ఇన్నిరోజులు వాళ్ళ ట్రాన్స్‌మీటర్లతో నా ట్రాన్స్‌మీటర్‌కూడా కలిసిపోయింది. అందుకే ప్రత్యేకంగా నా ట్రాన్స్‌మీటర్ గురించి ఎవరూ పట్టించుకోలేదు.

గుంపులో గోవింద అన్నట్టుగాఇక్కడ ఉన్న చాలా ట్రాన్స్‌మీటర్లతో నా ట్రాన్స్ మీటరుకూడా కలిసిపోయింది. ఇప్పుడు వాళ్ళ ట్రాన్స్‌మీటర్స్ ఆఫ్‌లో ఉన్నాయి. కాని నా ట్రాన్స్‌మీటర్ ఇంకా పని చేస్తూనే ఉంది. ఈ విషయం అధికారులకు వెంటనే తెలిసిపోతుంది.

తమ ఏరియాలో రహస్యంగా ఒక ట్రాన్స్‌మీటర్ ఆపరేట్ అవుతుందని వాళ్ళు గ్రహిస్తారు. చుట్టూ వెతుకుతారు. ఇప్పుడు కాకపోయినా ఒక గంటలో నా ట్రాన్స్ మీటర్ ఎక్కడుందో తప్పకుండా తెలుసుకుంటారు.

ఈలోగా నేనిక్కడ నుంచి తప్పించుకోవాలి. లేకపోతే చైనీస్ అధికారులకు దొరికిపోతాను" అన్నాడు ప్రద్యుమన్.

అతని మొహం ఉద్వేగంతో ఎర్రగా అయింది. అనుకోని ఈ పరిణామానికి అతను నిజంగానే షాక్ తిన్నాడు. ఇంకో నాలుగురోజులలో సమయం చూసుకుని తన ప్లాన్ అమలులో పెట్టాలని అనుకున్నాడు. బ్లాక్‌కోబ్రాను హైజాక్ చెయ్యాలని స్కెచ్ వేస్తున్నాడు.

ఈలోగా అనుకోని అవాంతరం వచ్చింది. ఇప్పుడు బ్లాక్ కోబ్రాను హైజాక్ విషయం పూర్తిగా మరచిపోవాలి. ముందు చైనీస్ అధికారుల నుంచి తనని తాను కాపాడుకోవాలి.తర్వాత ఇక్కడ్నుంచి తప్పించుకోవాలి. తన ప్రాణాలకోసం భయపడటంలేదు ప్రద్యుమన్.

అనుకోకుండా మిషన్ ఫెయిలైందని బాధపడుతున్నాడు.

"నువ్వేం కంగారుపడకు బాయ్. ఇక్కడ్నుండి నిన్ను తప్పించే బాధ్యత నాది. నాతో రా" అంటూ బయటకు తీసుకువెళ్ళాడు సింగ్.

రెస్టారెంటు ముందు ఒక డెలివరీ వ్యాన్ పార్క్‌చేసిఉంది.మార్కెట్‌నుంచి వ్యాపారానికి సంబంధించిన సరుకులు తీసుకురావటానికి ఈ వ్యాన్ ఉపయోగిస్తాడు సింగ్. వ్యాన్ కింద ఒకపెద్ద అల్యూమినియం డబ్బా ఉంది. చాలా పొడవుగా ఉంది. ఒక మనిషి అందులో తేలికగా దూరిపోవచ్చు.

"ఈ వ్యాన్ తిన్నగా నా ఇంటికి వెళుతుంది. నేను ఇప్పుడే నా భార్యతో అన్నివిషయాలూమాట్లాడతాను.నువ్వు వెళ్ళి ఆ డబ్బాలో దాక్కో, ఎవరికీ అనుమానం రాదు" అన్నాడు.

వెంటనే ప్రద్యుమన్ ఆ డబ్బాలో సెటిలయ్యాడు. లోపల గాలిరావటానికి డబ్బామీద కొన్ని రంధ్రాలు ఉన్నాయి. ప్రద్యుమన్‌డబ్బాలో దాక్కున్న తర్వాత సింగ్ డ్రైవర్‌ను పిలిచి ఏదోచెప్పాడు. తర్వాత లోపలికొచ్చి నిలబడ్డాడు.

ప్రద్యుమన్ ఊహించింది నిజమైంది. ట్రాన్స్‌మీటర్‌నుంచి సిగ్నల్స్‌రావటంతో అధికారులకు అనుమానం కలిగింది. అది ఎక్కడనుంచి వస్తుందో తెలుసుకోవటానికి ప్రయత్నించారు. చివరకు అది ప్రద్యుమన్ క్వార్టర్స్‌నుంచివస్తున్నాయని తెలిసింది. **ఇంకా ఉంది**



- విలువ తగ్గిన వివాహబంధం
- కట్టుబాట్లకు విలువ తగ్గింది
- బంధాలు, బంధుత్వాలు ప్రశ్నార్థకం
- అన్ని సంబంధాలూ ఆర్థికపరమైనవే

# ఎవరికి వారవుతున్న ఈ రోజుల్లో



భారతీయులు గర్వంగా చెప్పుకునేది, విదేశీయులు విశేషంగా పేర్కొనేది భారతదేశపు కుటుంబవ్యవస్థ, వారు పాటించేటువంటి మానవ విలువలు గురించి.

కుటుంబ వ్యవస్థలో భార్యా, భర్త, వారి పిల్లలు మాత్రమే కాదు, అమ్మమ్మలు, తాతయ్యలు, పిన్ని, బాబాయి, మామయ్య, అత్తయ్య ఇలా ఎన్నోరకాల బంధువులు, బాంధవ్యాలు ఇమిడివుంటాయి.

ఉమ్మడికుటుంబ వ్యవస్థద్వారా ఈ బంధాలను, అనుబంధాలను ఒకప్పటి భారతీయ సమాజం ప్రపంచానికిఆదర్శంగానిలిచింది.భారతీయకుటుంబ వ్యవస్థలో పెద్దలంటేగౌరవం, ఒకరిపట్ల మరొకరికి ప్రేమ, బాధ్యత కలగలిసివున్నాయని అనేవారు. భారతీయ వ్యవస్థపాశ్చాత్య వ్యవస్థకన్నా భిన్నమైనది.

పాశ్చాత్య సమాజంలో వివాహమనేది ఇద్దరు వ్యక్తులకు సంబంధించినది.

కాని భారతదేశంలో వివాహమనేది రెండు కుటుంబాలకు సంబంధించినది. కాబట్టి ఇక్కడి కుటుంబ వ్యవస్థ దృఢంగా విలసిల్లిందని, గట్టి పునాదులను నిర్మించిందని సామాజిక శాస్త్రవేత్తలు చెపుతారు.

మనుషుల మధ్య సంబంధాలు సమాజ ప్రగతికి పునాదిగా నిలుస్తాయి. వ్యక్తి తన కుటుంబం,సమాజం ఆపైన జాతి- ఇలా ఒక వరుసతర్వాత మరొక వరుస నిర్మించబడివుంటుంది మానవ జీవితం.

ఈ కుటుంబ, సమాజ వ్యవస్థలో మనిషికి పలు రకాల సంబంధాలు, మానసిక అనుబంధాలు ఏర్పడతాయి. ఎవరితో ఎలా వ్యవహరించాలి, ఎవరిని గౌరవించాలి, ఏ వయసులోవారిని ఎలాచూసుకోవాలనేవన్నీ సమాజంలో పరోక్షంగా నిర్దేశించబడుంటాయి. ఏ సమాజానికి ఆ సమాజంలో ఈ సంబంధాలు, విలువలు పరిణమిస్తాయికూడా.

ఆ మానవ సంబంధాలు, కుటుంబ విలువల గురించి భారతదేశం గర్వంగా చెప్పుకునేది. అయితే ఇటీవలి కాలంలో భారతీయులలోని మానవ సంబంధాలు, పతనమవుతున్న కుటుంబవ్యవస్థ ఆందోళన కలిగిస్తున్నాయి. ఇవి పాశ్చాత్య దేశాలలోకన్నా ఘోరంగా తయారవుతున్నాయి.

## పెద్దలపట్ల నిర్లక్ష్యం

భారతీయుల గురించి తాము గతంలో విన్నది, ఊహించుకున్నది అంతా అబద్ధమేమోనన్న అనుమానం విదేశీయులలో కలుగుతున్నది. ఇది ఒకప్పుడు విలువలతో కూడిన సమాజమేమోకాని ఇప్పుడు అటువంటి విలువలున్న సమాజం కాదన్న సందేహం భారతీయులకి కలుగుతున్నది.

ఘనంగా చెప్పుకునే భారతీయ విలువలు క్షీణించినపుడు ఇక భారతీయత అనే పదానికి విలువ ఉండదేమో! అటువంటి పరిస్థితిలోకి క్రమంగా మన సమాజం వెళుతున్నదని ఇటీవల వరసగా జరుగుతున్న సంఘటనలు నిరూపిస్తున్నాయి.

మొన్నటికి మొన్న పూనాలోని ఒక అపార్ట్‌మెంట్‌లో ఒక యువకుడు తన తల్లిని చంపిన వైనం అక్కడి సి.సి.కెమెరాలలో నమోదైంది. వయసుమీదపడి అనారోగ్యంతో ఉన్న తల్లిని నెమ్మదిగా పట్టుకుని, నడిపించి, అపార్ట్‌మెంట్ పైఅంతస్థువరకు తీసుకువెళ్ళి అక్కడినుండి కిందికి నెట్టివేశాడు.

ఆ యువకుడు ఐ.టి. సంస్థ ఉద్యోగి. జీతం బాగానే ఉంది. ఆర్థిక సమస్య ఉందనలేం. కేవలం అనారోగ్యం ఎంతకాలానికీ సర్దుకోకపోవటం,ఆమెను భరించలేని పరిస్థితిలో అలా చేశానంటున్నాడు ఆ కుర్రాడు. దీనిని ఎలా అర్థంచేసుకోవాలి.

నిన్నటికి నిన్న బీహారులో ఒక కుర్రాడిని కిడ్నాప్ చేసి, తుపాకీ తలకి గురిపెట్టి తన కూతురితో వివాహం జరిపించాడు ఒక తండ్రి. ఆ అబ్బాయి, అమ్మాయి ప్రేమికులు కాదు, పరిచయమే లేదు.

ఆ కుర్రాడు ఇంజనీరు. మంచి జీతగాడు. అటువంటి సంబంధం తన కూతురు జీవితానికి బాగుంటుందనుకున్నాడు. అంతే, కిడ్నాప్ చేసి తీసుకువచ్చి, ఆ కుర్రాడు ఏడుస్తుండగా కొట్టి, చంపుతామని బెదిరించి వివాహతంతు జరిపించాడు.

ఆ వీడియోలో పెళ్ళికూతురు బిత్తరచూపులు చూస్తూ కూర్చునివుంది. ఆ తర్వాత ఆ రెండు కుటుంబాలూ కొట్లాడుకోవటం, దాడులు చేసుకోవటం వంటివి జరిగాయి. ఎంతో సంతోషంగా జరగాల్సిన వివాహతంతు అలా జరిపించి అమ్మాయి, అబ్బాయిలను దంపతులుగా జీవించమంటే అది జరిగేపనా!

పిల్లల్ని వదిలేసి ప్రియుడితో ఉడాయిస్తున్నవారున్నారు. ప్రియుడితో కలిసి చేసిన నేరంవల్ల పిల్లలకు



తండ్రి అండ కరువవుతోంది. తాను జైలుకు వెళ్ళి పిల్లలను అనాథలను చేస్తున్నారు తల్లులు.

నగరాలలో ఈ విలువలు మరింత దారుణంగా ఉంటున్నాయంటున్నది 'హెల్ప్ ఏజ్ ఇండియా' వారి సర్వే. పెద్దలను పట్టించుకోటం అనే బాధ్యతనుండి పిల్లలు పూర్తిగా తప్పుకుంటున్నారు. దాదాపు 60 శాతంమంది పెద్దలు పిల్లల చేతిలో తమ నిరాదరణ గురించి వాపోయారు ఆ సర్వేలో.

కోడళ్ళు తమని చాలా నీచంగా చూస్తున్నారని దాదాపు 65 శాతంమంది అత్తలు చెప్పారు.

కోడలు మరో ఇంటినుంచివచ్చినది, కొత్తకాపురం మీదమోజు, తన సంసారంమీద, తన పిల్లల భవిష్యత్తుమీద స్వార్థంతో అత్తమామలను నిర్లక్ష్యం చేస్తున్నదని సర్దిచెప్పుకోవచ్చు. కాని కడుపునపుట్టిన పిల్లలే తమను నిర్లక్ష్యంచెయ్యటాన్ని భరించలేకపోతున్నారు పెద్దలు. తండ్రిపట్ల కూతుళ్ళకు ప్రేమ ఎక్కువనేది చాలామంది నమ్మకం. తండ్రిని జాగ్రత్తగా చూసుకుంటారని, పెద్దవయసులో ఆదుకుంటారని భావిస్తారు.ఐతే పెద్దలను నిర్లక్ష్యంచెయ్యటంలో కూతుళ్ళు తక్కువ తినలేదని సర్వేలు నిరూపిస్తున్నారు.

## అన్నీ ఆర్థిక సంబంధాలే

తమమీద ప్రేమ,దయ అనేది ఏమాత్రంలేకుండా ప్రవర్తిస్తున్నారని కూతుళ్ళమీద ఫిర్యాదులు వస్తున్నాయి. కని, పెంచి ఎంతో ప్రేమగా చూసుకున్న కూతుళ్ళు ఏవేవో చిన్న చిన్న అంశాలను సాకుగా చూపిదూరంగా వెళ్ళిపోతున్నారు. ఆస్తిమీద కన్ను కూతుళ్ళకు ఎక్కు వగా ఉంటున్నది.

కూతుళ్ళు దూరమవటంలో ఆర్థిక అంశాలే అధికంగా ఉండటం కనిపిస్తున్నది. తాము అనుకున్న రీతిలో, అనుకున్న సమయంలో కుటుంబ ఆస్తిమీద పెత్తనం లేదా భాగం ఇవ్వకపోతే అమ్మాయిలు కసి పెంచుకుంటున్నారు తల్లిదండ్రులమీద. కూతురు ఒక్కతే సంతానం అయిన సందర్భంలో ఆస్తి మొత్తం తమకే దక్కుతుందని తెలిసినాగాని, పెత్తనం తనకు ఇవ్వలేదని బంధాలను తెంచుకుని దూరంగా వెళ్ళిపోయి పరోక్షంగా దాడులు చేసే తనయుల విషయాలు ఆ సర్వేలో బైటకు వచ్చాయి.



## పరువు హత్యలు

తమ మాట వినకుండా మరెవరినో పెళ్ళిచేసుకున్న అమ్మాయిలను సొంత తల్లిదండ్రులే హతమార్చే పరువు హత్యలు ఇప్పుడు దాదాపుగా అన్ని ప్రాంతాలలో జరుగుతున్నాయి. ఇటీవలే అటువంటి పరువుహత్య చేసిన ఒక తండ్రికి తమిళనాడులో జీవితఖైదు శిక్షపడింది కూడా.

తమ చేతులతో పెంచి పెద్దచేసిన పిల్లలను చంపేయటానికి ఆ తల్లిదండ్రులకు ఎలా చేతులు వస్తున్నాయో, మనసు ఎలా అంగీకరిస్తుందో అర్థమవ టంలేదు సామాజిక శాస్త్రవేత్తలకు.

ఇక మన రాష్ట్రాలలో వస్తున్న వార్తలు మానవ సంబంధాలు ఎంతగా దిగజారాయో చెపుతున్నాయి. భార్యాభర్తల బంధానికి విలువ లేదని తెలుస్తున్నాయి ఆ సంఘటనలు.

కన్నవారిని నడివీధిలో వదిలేసివెళ్ళిపోయిన పిల్లలు, ఆస్తికోసం తల్లిదండ్రులను హత్య చేసిన యువకుల కేసులు మీడియాలో వింటున్నాం. వివాహబంధానికి పూర్తిగా విలువపోయింది.

భార్యను చంపేస్తున్న భర్తల గురించి చాలా కాలం నుండి వింటున్నది మన సమాజం. ఇప్పుడు మగవారికి ఎందులో తీసిపోమంటున్నారు ఆడవారు. భర్తలను కడతేరుస్తున్న భార్యల వివరాలు

సోదరులు, అక్కాచెల్లెళ్ళు, స్నేహితులు... ఇలా ప్రతిదశలో ప్రతి ఒక్కరితో ఉండాల్సిన మానవసంబంధాలు, ఆత్మీయతలు క్రమంగా తగ్గిపోతున్నాయి. అన్ని సంబంధాలు ఆర్థిక సంబంధాలేనన్నమాటను నిజం చేస్తున్నది భారతీయ సమాజం.

ఒకసారి మానవ సంబంధాలు క్షీణిస్తే ఆ సమాజం బలహీనపడుతుంది. తద్వారా దేశ భవిష్యత్తుకే ముప్పు ఏర్పడుతుందనేది హెచ్చరిక.

మానవ సంబంధాలలో కీలకమైన నిజాయితీ, సహనం, దయ, కరుణ, గౌరవం, ఇచ్చిపుచ్చుకునే మర్యాదలువంటివి మన దేశంలో అతివేగంగా పడిపోతున్నాయి. వాటి స్థానంలో స్వార్థం, అసహనం, హింస, ప్రతీకారంవంటి వ్యతిరేక గుణాలు వస్తున్నాయి. ఎదుగుదలకు పోటీ అవసరమే.

అయితే ఆ పోటీ ఆరోగ్యకరమైన పోటీగా ఉండాలన్న విషయం మరచిపోతున్నారు.

పోటీలో గెలుపుకోసం సాటివాడిని సంహరించటానికి వెనకాడని మనస్తత్వం వస్తున్నది.

ప్రస్తుతం భారతీయులలో సంపద, పెత్తనం చెలాయింపు, సామాజిక హోదాపట్ల మక్కువ అత్యున్నత స్థాయికి చేరాయి. మానవత్వానికి విలువ తగ్గింది. అందువల్లనే సమాజంలో ఘర్షణ వాతావరణం పెరిగింది. సామాజిక విలువలు, మానవ సంబంధాలకు విలువ తగ్గినందునే ఇరుగుపొరుగువారితో సంబంధాలు అడుగంటాయి.

నేరాలు చేసేందుకు ఏమాత్రం సంశయించటం లేదు. శిక్షలంటే భయం లేదు. అడ్డదారిలో అయినా

బయటకు వస్తున్నాయి. భర్తపెట్టే వేధింపులు భరించలేక కొందరుభార్యలు అటువంటి హత్యలకు పాల్పడుతుంటే ఇటీవలి కాలంలో భర్త హత్యకు కుట్రపన్నిన మహిళల వెనకున్నది వివాహేతర సంబంధమన్నది స్పష్టం.

తన వివాహేతర సంబంధానికి అడ్డుగా ఉన్నాడని భర్తను ప్రియుడి సహకారంతో తుదముట్టిస్తున్నఘటనలు ఇటీవలికాలంలో వరసగావెలుగులోకి వచ్చాయి. పైగా ఆ హత్యకు పథకం, అమలు రెండింటిలోనూ భార్యదే ప్రధానపాత్ర కావటం గమనార్హం. గుట్టు చప్పుడుకాకుండా మొగుడిని వదిలించుకుంటే తాను కొత్తగా పెట్టుకున్న ప్రియుడితో హాయిగా జీవితం అనుభవించవచ్చని ఆలోచిస్తున్నారు ఆడవారు.

తాముచేస్తున్నది నేరం అనికాని, ఏదో ఒక రోజు ఆ నేరం బయటపడితే శిక్షపడి జైలుకు వెళ్ళాల్సి వస్తుందన్న భయంకానివారిలో కనిపించటం లేదు. పిల్లలకోసం తల్లి ఎంతటి త్యాగాన్నైనా చేస్తుంది అంటారు.

వారిని బతికించేందుకు ఎన్నోరకాల కష్టాలను పడిన తల్లులగురించి గతంలో విన్నారు. కాని ఇప్పుడు పిల్లలగురించి కూడా ఆలోచించటం లేదు. ప్రియుడి మోజులో కన్నకూతురిని వేడి వేడి పెనంమీద ఎక్కించిన తల్లి ఉన్నారు.



Courtesy : Woman's Era



అతివేగంగా పైస్థాయికి చేరటమే లక్ష్యం.

మన విద్యావ్యవస్థలో సిలబస్ మెరుగైంది. కాని మానవ విలువలకు స్థానం లేదు. ఉద్యోగపర సమర్థత ఉంటున్నది. కాని మనిషిగా బ్రతికేందుకు అవసరమైన పాఠాలు లేవు. విద్య మనిషికి మేలు చేస్తుందనేది ఒకప్పటి నమ్మకం. కాని విద్య స్వార్థం పెంచుతున్నది అనేది నేటి వాస్తవం.

## వ్యతిరేక భావాలు పోవాలి

భారతీయ విలువలుగా ఒకనాడు ప్రపంచం గుర్తించినవి సత్యం, ధర్మం, శాంతి, ప్రేమ, అహింసలు. వీటినే పంచప్రాణాలుగా పెద్దలు చెప్పారు. ఇవి శరీరంలో అణువణువుకీ చేరాలి. వ్యతిరేకభావాలు బయటకు పోవాలి. అందుకు అవసరమయిన మార్గాలను నిర్దేశించారు రుషులు. కాని కాలక్రమేణా విలువలు తగ్గటం మొదలైంది.

ఇప్పుడు క్షీణించిన సామాజిక విలువలు, మానవ సంబంధాలు మొత్తం భారతీయ సమాజ భవిష్యత్తును ప్రశ్నార్థకం చేస్తున్నాయి. ఒకప్పుడు కట్టుబాటు అనే పదం సమాజంలో వినిపించేది.

ఈ కట్టుబాటు కుటుంబస్థాయినుండి పైస్థాయి వరకు ఉండేది. కట్టుబాటనేది కనిపించని, విలువలతో కూడిన బంధనం. ఇప్పుడు ఆ కట్టుబాట్లకు విలువ లేదు.భౌతిక సుఖాలకే విలువ ఎక్కువ.సంపద మీదే మోజు. నైతిక విలువలనేవి పట్టటంలేదు.

లక్ష్యంమాత్రమే కాదు, ఆ లక్ష్యంకోసం పయనించే మార్గం కూడా ఉన్నతంగా ఉండాలనేది గాంధీజీ మాట. కాని ఇప్పుడు లక్ష్యానికి ముఖ్యం. విలువలు ముఖ్యం కాదు. అందుకే ప్రజలను నడిపించే నాయకుడు, ఆయనదగ్గర పనిచేసే ఉన్నతాధికారులందరి దృష్టీ సంపదమీదే.

కుటుంబంలో విలువలు బోధించటం తగ్గింది. పిల్లలమీద పర్యవేక్షణ లేదు. స్వేచ్ఛ పెరిగింది. సాహిత్యం, టి.వి. సినిమాలు అన్నీ బలహీనతలను రెచ్చగొట్టేవే. పెరిగిన కమ్యూనికేషన్ సౌకర్యాలు అయినవారిని దూరం చేసి, ఎక్కడో ఉన్నవారితో స్నేహాలను ప్రోత్సహిస్తున్నాయి.

సాంస్కృతికపరమైన వారసత్వాన్ని ప్రజలు మరచిపోతున్నారు. నైతిక విలువలను ప్రబోధించే సాహిత్యానికి దూరమవుతున్నారు. సామాజిక బాధ్యతలను కాదనుకుంటున్నారు.

తాత్కాలికమైన సుఖంకోసం దీర్ఘకాలిక సంబంధాలను చెడగొట్టుకుంటున్న పెడసరి ధోరణి భారతీయ సమాజంలోకి వచ్చింది. ప్రేమను పంచే కుటుంబ వాతావరణం కరువైంది నేడు.

## పెడసరి ధోరణి

పిల్లలతో గడిపే సమయం తగ్గిపోయింది.తమకు తోచిన రీతిలో ఎదగటంలో తప్పులేదన్న భావన పిల్లలలో కలుగుతున్నది. ఇటువంటి వాతావరణంలో పెరిగిన పిల్లలనుండి కట్టుబాట్లు, సామాజిక విలువలు, మానవ సంబంధాలు ఆశించగలదా భారతదేశం.

విదేశాలలో స్థిరపడేందుకు వెళ్ళిన భారతీయులను వింతగా చూస్తున్నారంటున్నది మరో నివేదిక. భారతీయులు స్వార్థపరులని, నలుగురితో కలవరని, స్థానిక, సామాజిక అంశాలలో కీలకమైనవాటిని గౌరవించటంలేదని వారు ఫిర్యాదు చేస్తున్నారు.

మనదేశంలో ఉండాల్సిన విలువలు పెంపొందించుకోలేని భారతీయులు విదేశాలకు వెళ్ళి వారి విలువలను వంటపట్టించుకోగలరని అనుకోగలమా!

భారతీయ సమాజం ఇప్పుడు క్లిష్టపరిస్థితుల్లో ఉంది. తనదైన విలువలను పరిరక్షించుకోలేకపోతున్నది. క్షీణిస్తున్న మానవ సంబంధాలను అడ్డుకోలేకపోతున్నది. భారతీయతను పెంపొందించాలన్న వినాదాన్ని ఉదారవాదం వ్యతిరేకిస్తున్నది.

ఇటువంటి పరిస్థితిలో కొత్త తరం గందరగోళానికి గురవటం సహజం.

డి.హర్షవర్ధన్

# కదిలే బొమ్మల కబుర్లు





## అష్టకష్టాలు

కోరిన కెరీర్ సాధించడంకోసం అష్టకష్టాలు పడ్డా నని షాలినీ పాండే అడపాదడపా గతాన్ని గుర్తు చేసుకుంటుంటుంది.

"అమ్మా నాన్న వద్దంటుంటే వినకుండా ముంబై వెళ్ళిపోయా. ఎన్నో కష్టాలు భరించాను. కొన్నిసార్ల యితే ఒంటిపూట భోజనంతో సరిపెట్టుకున్నా.

తప్పని పరిస్థితుల్లో ఇద్దరు అబ్బాయిలున్న ఇంటిని షేర్ చేసుకున్నా. అనుకున్నది సాధించాక, 'అర్జున్ రెడ్డి' విజయం తర్వాత కాని, నాన్నతో మాట కలప లేదు" అంటున్న షాలిని డైరీ ఆఫర్లతో ఫుల్. ◆





## గంతులు వేశా

మరువరానిరోజు గురించి అడిగితే కళ్యాణి ప్రియ దర్శన్ బోలెడన్ని కబుర్లు చెప్పింది "నటన నా చిన్ననాటి కల. అయితే నటిగా మెప్పిస్తానా, విమర్శలను స్వీక రించగలనా, విని తట్టుకోగలనా అన్న సంశయాలు బుర్రను తొలిచేసేవి.

అవన్నీ గత ఏడాదితో పటాపంచలైపోయాయి. అమ్మతో మాట్లాడుతూ కూర్చుంటే దర్శకుడు విక్రమ్ కె.కుమార్ నుంచి ఫోన్, అన్నపూర్ణ సెవెన్ ఏకర్స్‌కు రమ్మని. నన్ను కూర్చోబెట్టి టీజర్ ప్లే చేశారు.

తెరపై నన్ను నేను చూసుకున్న క్షణాలు జీవితంలో మరువలేను. కుర్చీలో కూర్చోలేకపోయాను. లేచి గంతులు వేశా. 'హలో' టీజర్ చూసిన క్షణాలు గ్రేట్. సూపర్" అంటూ మోములోనే ఆనందం చిందులు వేయించింది కళ్యాణి ప్రియదర్శన్. ◆

## రేంజ్‌లో రాజీలేదు

పర్సనాలిటీలో పిడికెడంతైనా మార్పులేకుండా ఇన్నేళ్ళుగా మెయిన్‌టెయిన్ చేసుకువస్తున్న కాజల్ అగర్వాల్ అవకాశాల రేంజ్ తగ్గినా రెమ్యునరేషన్ విషయంలో మాత్రం రాజీపడడంలేదు.

సినిమాకు సంతకాలు చెయ్యాలంటే కోటి రూపా యల పైచిలుకు పారితోషికం ఇవ్వాల్సిందేనన్నది టాక్. అదీ కూడా హీరోనుబట్టి రేటుమారుతుంటుం దట. సీనియర్ హీరోల సరసన ఇమేజ్ గల తారల కొరత వుండడం, కాజల్‌లో తరగని పరువాలు ఆమె డిమాండ్‌కు ఊతం ఇస్తున్నాయి.

తెరంతా కళకళలాడుతూ కనపడే కాజల్ అగ ర్వాల్ అంటే అటు ప్రేక్షకుల్లోనూ, ఇటు పరిశ్రమ లోనూ గల క్రేజ్ ఆమెకు మరో అదనపు ఎసెట్. ఎంతయినా లక్కీ గాళ్ కదా! ◆



## కొత్త వెన్నెలు 

తెలుగు చిత్రాల్లో నవతారలకు అవకాశం ఇవ్వడం షరా.మామూలే. 'శివ' తర్వాత అంటే ఇరవై ఎనిమిది సంవత్సరాలకు నాగార్జున, రామ్ గోపాల్‌వర్మల కాంబినేషన్‌లో తీస్తున్న సినిమాలో కొత్తమ్మాయి మైరా సరీన్ హీరోయిన్.

ఈ హాటెస్ట్, లేటెస్ట్ బ్యూటీకి ఇది మొదటి సినిమా. తొలిచిత్రంలోనే నాగార్జునవంటి సీనియర్, ఎవర్‌గ్రీన్ హీరోతో కలసినటించే అవకాశం రావడం అదృష్టం అంటూ సరీన్ సంతోషపడుతున్నది. ఇంతకుముందు హాట్ హాట్ పోజులతో ఉర్రూతలూగించిన సరీన్ వెండితెరపై ఎన్ని వెన్నెలు పోతుందో చూద్దాం. ◆



##  అందం, అభినయం

అందంతో అలరిస్తూ అభినయంతో ఆకట్టుకోవాలన్నది తన తొలి ప్రాధాన్యం అంటున్నది అమీరా దస్తర్. మొదటిసారిగా తెలుగులో 'మనస్సుకు నచ్చింది' సినిమాలో నటిస్తున్నది.

"సంప్రదాయ దుస్తుల్లో కనిపించే తెలుగమ్మాయి నిత్యగా నటిస్తున్నాను. పాటలకు పరిమితమయ్యే పాత్ర కాదు. కథకు ప్రాధాన్యం గల పాత్ర.

తెలుగు కొద్దికొద్దిగా అర్థం అవుతున్నది. ఇంకో రెండేళ్ళలో స్వంతంగా డబ్బింగ్ చెప్పుకోగల ప్రయత్నాలు చేస్తాను. బాలీవుడ్‌తో పాటు అన్ని దక్షిణాది భాషా చిత్రాల్లోనూ నటించాలన్న కోరిక ఉంది" అంటున్న అమీరా దస్తర్ రెండో తెలుగు సినిమా 'రాజాగాడు'లో నటిస్తున్నది.







## కనువిందుకే

చక్రాల్లాంటి కళ్ళతో కబుర్లు చెప్పే ప్రణీత లింగ వివక్షవంటి పెద్దపెద్ద అంశాలపై నోరువిప్పింది.

"లింగవివక్ష అనేది చిత్రపరిశ్రమలోనే కాదు ఏ రంగంలోనైనా స్త్రీ చిన్నచూపుకు గురవుతున్నది. సినిమాలో దాదాపుగా హీరోయిన్ల నిర్ణయాలకు విలువ వుండదు. తమ అభిప్రాయాలను ఖచ్చితంగా చెప్తే విమర్శలకు గురవుతారు.

చాలాసార్లు కమర్షియల్ చిత్రాల్లో బబ్లీగా, గ్లామరస్‌గా కనువిందు చేయడానికి మాత్రం పరిమితం కావాల్సివుంటుంది. అయితే ఇటువంటి సినిమాలలో పాపులారిటీ వచ్చే మాట నిజం" అంటూ పెద్ద కబుర్లే వల్లించింది. పిల్లకు ధైర్యం ఎక్కువలాగున్నది. ◆

## సన్నీ బొమ్మ



నిన్న మొన్నటిదాకా పోర్న్ స్టార్ ముద్రతోనే ముడుచుకుపోయిన సన్నీలియోన్ మైనపుబొమ్మను లండన్‌కు చెందిన మేడమ్ తుస్సాడ్స్ వ్యాక్స్ మ్యూజియం వాళ్ళు ఢిల్లీ మ్యూజియంలో ఏర్పాటు చేస్తుండడంతో సన్నీసంతోషంతో ఉబ్బితబ్బిబ్బవుతోంది.

ముంబయిలో ఇటీవల సన్నీ బొమ్మకు కావాల్సిన కొలతలు కూడా తీసుకున్నారు. ఇదంతా చాలా థ్రిల్లింగ్ అనుభవం. మేడమ్ తుస్సాడ్స్‌కు కృతజ్ఞురాలిని. కొలతలు తీసుకోవడం మరవలేని అనుభూతి. నన్ను నేను చూసుకోవడానికి ఎగ్జయిట్ అవుతున్నా. అలాగే నా అభిమానుల స్పందన కోసమూ ఎదురు చూస్తున్నా" అని పేర్కొన్నది. ◆



## భలే కోపం వస్తుంది

ఝాన్సీ లక్ష్మీభాయ్ జీవితకథతో రూపొందుతున్న హిందీ సినిమా 'మణికర్ణిక'లో టైటిల్ రోల్ పోషిస్తున్న కంగనా రనౌత్ సినిమాలు తీయడం గురించి ఎందుకోకాని, ఘాటుగా స్పందించింది.

'మిఖాసింగ్', 'మేరీకోమ్' కథలతో తీసిన సినిమాలు బాగా ఆడి వసూళ్ళు సాధించినప్పుడు 'మహారాణా ప్రతాప్', 'ఝాన్సీలక్ష్మీభాయ్', 'ఛత్రపతి శివాజీ'వంటి సినిమాలను ప్రేక్షకులు ఎందుకు చూడరంటూ లాజిక్ మాట్లాడుతోంది.

చరిత్రకు సంబంధించిన కథలతో చేయాలంటే "మనం తీసినా ఎవరుచూస్తారండి" అని కొందరు దర్శక నిర్మాతలు అంటుంటారు. అటువంటి సందర్భాల్లో భలే కోపం వస్తుంటుంది" అంటోంది. ఎందుకట? ◆



## ఎలా ఆడుతున్నాయి?

- బాక్సాఫీస్ దగ్గర సినిమాలు కళకళలాడుతున్నాయి తప్పు కాసులు కాదు. థియేటర్ల నిండా చాలా సినిమాలు ఉన్నాయి. ఏదో అలా అలా అంతంత మాత్రం షేర్‌తెచ్చుకుంటున్నాయి.
- 'అజ్ఞాతవాసి' మెయిన్ బిజినెస్ ఆల్‌మోస్ట్ క్లోజ్ అయినట్లే. అరవైకోట్ల దగ్గర క్లోజ్ కావడంతో, దాదాపు అంతకు అంతా నష్టపోయారు బయ్యర్లు.
- 'జైసింహా' సినిమా బ్రేక్ ఈవెన్ అయింది. 'గౌతమీపుత్ర శాతకర్ణి' సినిమాను పక్కనపెడితే చాలా అంటే చాలాకాలం తరువాత బ్రేక్ ఈవెన్ అయిన బాలయ్య సినిమా ఇది.
- 'గ్యాంగ్' సినిమా అయిదు కోట్ల రేంజ్‌లో బ్రేక్ ఈవెన్ అయింది.



# చివరి రోజుల్లో...

## అమ్రిత షేర్‌గిల్ (1913-1941)

ఇరవైయవ శతాబ్దపు అతిగొప్ప మహిళా చిత్రకారిణి ఎవరంటే ఎవరైనా చెప్పే పేరు అమ్రిత షేర్‌గిల్. నవ్యమైన భారతీయ చిత్రకళలో ప్రథమురాలు ఆమె. బాల్యంలోని చిత్రాలవైపు ఆకర్షితురాలైన అమ్రిత షేర్‌గిల్ ఎనిమిదవ ఏటనే కుంచెపట్టి శిక్షణా తరగతులకు వెళ్ళింది.

నాటినుండి ఆమె జీవితం పూర్తిగా చిత్రకళతోనే ముడిపడింది.కళ...చిత్రాలు అలా గడిచిన జీవితంలో అద్భుతమైన చిత్రాలు వచ్చాయి. అవన్నీ ప్రత్యేకంగా మ్యూజియంలో భద్రపరచ బడ్డాయి నేటికీ. ఆమె చిత్రాలకు ప్రత్యేకంగా ఒక గ్యాలరీ ఏర్పాటుచేశారు.

అయితే ఆమె బ్రతికింది 28 సంవత్సరాలే. అమ్రిత షేర్‌గిల్ తండ్రి సిక్కు మతస్తుడు. జమిందారీ వంశస్తుడు. యిరోపా ఖండంనుండి భారతదేశానికి వచ్చిన ఒక హంగెరీ దేశపు సంగీత, నృత్య బృందంలోని మేరీ ఆంటోనిఎట్టీ అనే ఆవిడ మీద మనసుపడి పెళ్ళాడి ఆమెతో యిరోపాఖండం వెళ్ళాడు.

మేరీ యూదు మతస్తురాలు. వారికి హంగెరీలో జనవరి 30న బుడాపెస్ట్‌లో పుట్టింది.

అప్పటినుండి భారతదేశానికి వచ్చి వెళుతుండేది. సిమ్లా, లాహోర్‌లలో పెరిగింది. 1921లో యిరోపాలో వారి కుటుంబానికి వచ్చిన ఆర్థిక ఇబ్బందులవల్ల భారతదేశానికి తిరిగి వచ్చింది.

సిమ్లాలో పెయింటింగ్ మొదలుపెట్టింది. దేవుడంటే నమ్మకంలేదని బాల్యంలో స్కూల్‌లో చెప్పినందున క్రైస్తవ స్కూల్‌లో నుండి బహిష్కరించారు.

దానితో ఆమె చదువు ఆగిపోయింది. జీవితం పూర్తిగా పెయింటింగ్‌తో ముడిపడింది.

తల్లితో మళ్ళీ యిరోపా వెళ్ళి తన 16వ ఏటనుండి ఒక క్రమపద్ధతిలో పెయింటింగ్‌లో శిక్షణ తీసుకుంది.

20 ఏళ్ళ వయసు రాకుండానే ఆమె గీసిన యంగ్ గర్ల్స్ పెయింటింగ్‌కి అంతర్జాతీయ గుర్తింపువచ్చింది. ఆ వయసులో ఫ్రాన్స్‌లోని గ్రాండ్ సెలూన్ ప్రవేశం లభించిన ఏకైక ఆర్టిస్ట్ అమ్రిత. కళాకారిణిగా ఆమె దక్షిణ, ఉత్తర భారతదేశాలన్నీ పర్యటించింది.

అమ్రిత షేర్‌గిల్‌కున్న ఏకైక బలహీనత సెక్స్. తనకు సెక్స్ కోర్కెలు అధికమని ఆమె ఒక సందర్భంలో చెప్పింది కూడా. ఒకసారి కోరిక కలిగితే దానిని ఆపుకోలేకపోయే పరిస్థితి అన్నది ఆమె మాట. అందువల్లనే అమ్రిత జీవితంలోకి చాలామంది మగాళ్ళు ప్రవేశించారు.

అయితే ఆ ప్రవేశమంతా శారీరకమైనదే కాని మానసికమైనది కాదు.ఒకసారి లైంగికంగా అనుభవం పూర్తి అయిన తర్వాత అతగాడి గురించిన గుర్తు కూడా ఆమెకు వుండేది కాదు.

తాను ఒక మగాడిని కోరుకుంటే అతను తనవెంట వచ్చితీరతాడన్నది ఆమె గర్వం. నిజంగానే అంత అందంగా వుండేది. పేరు పొందిన అమ్మాయి. మంచి వయసులో వుంది. తాను ఎలాగైనా కుష్వంత్‌సింగ్‌ని తన పక్కలోకి తెచ్చుకుంటానంటూ ఒక సందర్భంలో సవాలు విసిరింది.

అమ్మాయిలు తొలి కలయికను మరచిపోలేరు అంటారు. కాని అమ్రిత షేర్‌గిల్ మాత్రం నాకు ఏదీ గుర్తులేదంటుంది. ఎప్పటి అనుభవాన్ని అప్పుడు హాయిగా అనుభవించటమేగాని మళ్ళీ మళ్ళీ తలచుకుని ఆహా అనుకునేంతగా ఏముందనుకునేదామె.

మనసు ఎలా వున్నా శరీరంలో వచ్చే మార్పులు ఆగవు కదా. ఆమె ఎవరితో కలిసినప్పుడు గర్భం వచ్చిందో కూడా తెలియదనేది. ఆమెకు బావవరస అయ్యే డా॥ విక్టర్ ఇగాన్ ఆమెకు వచ్చిన గర్భాన్ని ఒకటికన్నా ఎక్కువసార్లే తొలగించానన్నాడు.

నీవున్నావనే ధైర్యమే నా జీవితం ఇలా నడిపిస్తోంది అని అమ్రిత జోక్ చేసిందట. ఇవన్నీ పాతికేళ్ళ వయసు వచ్చేసరికి జరిగినది. పాతికేళ్ళ వయసులో డా॥ విక్టర్ ఇగాన్‌ని పెళ్ళాడింది. తనకు గర్భవిచ్ఛిత్తిలు చేపట్టినవాడు తన గురించి అన్నీ తెలిసి స్వీకరించటం ఒక గొప్పగా భావించింది అమ్రిత. అయితే అమ్రిత సెక్సీ కోర్కెలు భర్తతో ఆగిపోలేదు. ఆ తర్వాతకూడా ఆమె ఇతరులతో రాత్రులు గడుపుతుండేది.

తాను ఒక మగాడిని కోరుకుంటే అతను తన వెంట వచ్చి తీరతాడన్నది ఆమె గర్వం. నిజంగానే అంత అందంగా వుండేది. పేరు పొందిన అమ్మాయి. మంచి వయసులో వుంది. తాను ఎలాగైనా కుష్వంత్ సింగ్‌ని తన పక్కలోకి తెచ్చుకుంటానంటూ ఒక సందర్భంలో సవాలు విసిరింది.

కుష్వంత్‌సింగ్ గురించి తెలిసినవారు అందుకు కష్టపడాల్సిన అవసరం ఏముందనుకున్నారు. కాని కుష్వంత్‌సింగ్ భార్య అమ్రితతో తప్ప ఎవరితోనైనా ఓ.కే. అన్నట్టుగా ప్రతిసవాలు విసిరిందట.

అలా దాదాపు ఆమె చాలామంది ప్రముఖులతో అతిదగ్గరగా వుంది. అందులో జవహర్‌లాల్ నెహ్రూ కూడా వున్నారు.వారిద్దరిమధ్య ఉత్తరాలను ఆమె తల్లిదండ్రులు అమ్రిత పెళ్ళి ముందు తగలబెట్టారు.

హిమాలయ పర్వత ప్రాంతాలలో తిరిగేటప్పుడు గీసిన బొమ్మలను 1937లో ఢిల్లీలో ప్రదర్శించింది. ఆ తర్వాత తన చిత్రాల ప్రదర్శన లాహోర్‌లో నిర్వహించాలనుకుంది. భర్తతో కలిసి లాహోర్‌లోని ఒక ఇంటిని తీసుకుంది. కింద భర్త ఆసుపత్రి, పైన తన పెయింటింగ్ స్టూడియోగా మార్చుకుంది.

లాహోర్‌లో తన చిత్రాల ప్రదర్శన తర్వాత తన జీవితాన్ని మార్చుకోవాలనుకుంది. ఒకవైపు పెయింటింగ్‌లు సిద్ధంచేస్తూ, డిశంబర్ 14న తన చిత్రప్రదర్శనకు తేదీని నిర్ణయించింది. ఆ ప్రదర్శనకు అవసరమైన హాల్‌ని తానే స్వయంగా దర్శించి,చిత్రాలు ఎలా నిలబెట్టాలి, వాటిమీద లైటింగ్ ఎలా ఏర్పాటుచేయాలి అనే విషయంలో సూచనలు ఇచ్చింది.

సిమ్లాలో వున్న తన 30 చిత్రాలను లాహోర్‌కి తెప్పించేందుకు ఏర్పాట్లు చేసింది. తన జీవితాన్ని మార్చే ప్రదర్శనగా భావించింది. ఆ ప్రదర్శన తర్వాత ఇక కొత్త జీవితం మొదలుపెట్టాలనుకుంది.

డిశంబర్ 2 వరకు ఎంతో చలాకీగా వ్యవహరించిన అమ్రిత షేర్‌గిల్ మరుసటి రోజు హఠాత్తుగా అనారోగ్యానికి గురైంది.

ఆమె అనారోగ్యానికి కారణం తెలియదు. భర్త వైద్యుడు కాబట్టి అమ్రిత ఆరోగ్యం గురించి ఆయనే చూసుకుంటాడనుకున్నారు మిగిలినవారు. అయితే హఠాత్తుగా డిశంబర్ 6న అమ్రిత షేర్‌గిల్ కన్ను మూసింది. ఆమె మరణంమీద పలు అనుమానాలు మొదలయ్యాయి. అమ్రిత మీద భర్తే విష ప్రయోగం చేశాడన్నది ఒక సందేహం.

లాహోర్‌లో ఆమె తిరిగి తన సెక్సీ కోర్కెలు మరెవరితోనో తీర్చుకున్నదని, ఫలితంగా గర్భవతి అయిందని భర్త డా॥ విక్టర్‌కి అనుమానం.

అమ్రిత కడుపులో పెరుగుతున్నది తన బిడ్డ కాదన్న ఆలోచన ఆమెకు గర్భస్రావం చేసేలా చేసింది భర్తను. డిశంబర్ 14న పెయింటింగ్ ఎగ్జిబిషన్‌కి ముందే అబార్షన్‌చేసే యత్నంచేసి అది వికటించి అమ్రిత మరణించింది.

డా॥ విక్టర్ ఆమెను చంపేశాడన్నది చాలామంది నమ్మకం. అసలు విషయం బయటకు రానివ్వకుండా డా॥ విక్టర్‌ని బ్రిటీష్ పోలీసులు చంపారు. అలా ఒక సౌందర్యరాశి, చక్కని కళాకారిణి ఆంక్షలులేని వ్యక్తిగతజీవితంతో ప్రాణంమీదికి తెచ్చుకుంది.

# ఈ శీర్షిక మీదే

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

- సన్నీకలగ, హైదరాబాద్

**నేటి విద్యార్థి?**

ప్రైవేటు చదువు చదివి గవర్నమెంటు ఉద్యోగం రావాలనుకునేవాడు.

- హిరణ్యమూర్తి, హైదరాబాద్

**రోజంతా పరిగెత్తుతున్నా అలసిపోనిది?**

నది.

- ఎల్.శ్రావణి, సింహాచలం

**పద్యానికీ, మద్యానికీ తేడా?**

పద్యంలో రాగం... మద్యంలో రోగం.

ఉత్తమ ప్రశ్నకు ₹ 500
ప్రతి ప్రశ్నకు ₹ 300 బహుమతి

## ఈ కార్టూన్ మీదే




- ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

**'విడాకులు' అని వాటికి ఎందుకు ఆ పేరు?**

విడి 'ఆకులు' మరొకరి జీవితాన్ని 'విస్తరి'స్తాయి కనుక.

- వి.ఎస్.కె.శ్రీనివాస్, సామర్లకోట

**అబద్ధం ఎందుకు ఆడతారు?**

తప్పించుకునే 'లైసెన్స్' ఉంది కనుక.

- పి.యోబు, ముదునూరు

**ఫోటో స్టూడియోవారి నినాదం?**

కెమేరా భారత్.

- ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

**ప్రపంచంలో రెండు 'అతి ప్రమాదకరమైన' మారణాయుధాలు?**

భార్య 'కన్నీరు', పక్కింటి అమ్మాయి 'చిరునవ్వు'.





"అమ్మా ఇవాళ్ళ ఒకమ్మాయి నన్ను ధైర్యవంతుడివని, సాహసి అని మెచ్చుకుందమ్మా కాలేజీలో"

"పెళ్ళికిముందు అమ్మాయిలంతా అలాగే మెచ్చుకుంటార్రా" అంది తల్లి.

"వెర్రినాగన్నా" అన్నాడు పక్కనే పేపర్ చదువుకుంటూ కూర్చున్న తండ్రి.

"మీ ఆయన రెండో పెళ్ళిచేసుకుంటానంటే ఒప్పుకున్నావా! అదేంటే!" అంది స్నేహితురాలు.

"ఏం చెయ్యను... మా అత్తను ఒక్కదానినే ఎదుర్కోలేకపోతున్నా" అంది ఆమె.

హిప్నాటిస్ట్‌ని చేసుకుంటున్నానని గర్వంగా చెప్పుకుని పెళ్ళిచేసుకున్న గంగ ఆరునెలలకే ఎందుకు చేసుకున్నానా అని దిగాలుపడి పుట్టింటికి వచ్చింది.

'ఏమైందే' అని తల్లి అడిగితే 'నన్ను హిప్నటైజ్ చేసి నా డబ్బులు ఎక్కడెక్కడ దాచుకుందీ చెప్పించి తీసుకెళ్ళిపోతున్నాడే...ఆయనంటూ భోరుమంది.

## B హ్యాపీ

మీకు మీ పుస్తకాలకు పబ్లిసిటీ పెంచాలనుకుంటున్నాం అంటూ ఒక పబ్లిషర్ విశ్వనాథ సత్యనారాయణగారిని అడిగితే...

"ఏమీ అక్కరలేదు" నా శత్రువులు చాలామంది వున్నారు ఆ పని చెయ్యటానికి... వారు చాలా పబ్లిసిటి ఉచితంగా ఇస్తున్నారు.

ఆత్రేయగారికి ఆరోగ్యం బాగోలేదని పలకరించేందుకు ఒక ప్రముఖ దర్శకుడు వెళ్ళితే "నేనింక అట్టే కాలం బ్రతికేలా లేనన్నాడు ఆత్రేయ"

అదేం లేదు... మీరు నిండునూరేళ్ళు హాయిగా బ్రతుకుతారు అని ఆ దర్శకుడు అంటే...

"సరే... ఆత్రేయ అన్న టైముకు రాడు, రాయడు అని యమధర్మరాజుకు తెలుసంటావా! అన్నది ఆత్రేయ ఛలోక్తి.

"మావారికి భయం, ఆదుర్దా పెరిగి గుండె దడ, బి.పి. వస్తోంది" అంది ఆమె.

"ఇవిగో మీరు ఈ మాత్రలు వేసుకుని పడుకోండి" అన్నాడు డాక్టర్.

"ఆయనకు బి.పి. అయితే నాకు మాత్రలు ఏంటి డాక్టర్" అన్నది ఆమె.

"ఆయన బి.పికి కారణం మీ అరుపులేనమ్మా"

"ఏమండీ నన్ను గాలిలో తేలిపోయేలా చేసే మూడు పదాలు నా చెవిలో చెప్పరా" అంటూ గోముగా అడిగింది కాంతం.

"వెంటనే నువ్వు పుట్టింటికి వెళ్ళిపో" చెవిలో చెప్పాడు రమణ.

"పనిమనిషి మానేసింది..." కోపంగా చెప్పింది మొగుడితో ఆమె.

"ఏమైందట..." అడిగాడు భర్త.

"నిన్న ఆఫీసునుండి ఫోన్‌చేసి మీరు చెడామడా తిట్టారటగా..." అంది భార్య.

"అరే... ఫోన్ ఎత్తింది నువ్వు కాదా..."

మీ వర్తమాన సమయాన్ని శ్రేష్ఠంగా మలచుకున్నట్లయితే భవిష్యత్తు ఉజ్జ్వలంగా వుంటుంది.

SWATI SAPARIVARA PATRIKA PRINTED AT ANIL SWATI PRESS AUTONAGAR VIJAYAWADA
RNI 38008 / 1984 REGD NO.VJ / 025 / 2018-20 L.NO.

# కాలుష్యం నుండి రక్షిస్తుంది మరియు చర్మ సహజ నిగారింపుని నిలిపి ఉంచుతుంది.

సమర్పిస్తున్నాం సంతూర్ గోల్డ్, శ్రేష్ఠమైన కాశ్మీరీ కుంకుమ పువ్వు మరియు చందనం యొక్క మిశ్రమాలతో. ఇవి మీ చర్మానికి కాలుష్యం వలన కలిగే హానినుంచి కాపాడి, మీ చర్మానికి యవ్వనపు నిగారింపునిస్తుంది. ఇక ఎటువంటి సంకోచమూ లేకుండా బయటకు వెళ్ళండి, ఇంకా తాజ్‌లాగా మెరిసిపోండి.



కాలుష్యం నుంచి రక్షిస్తుంది మరియు
చర్మం యొక్క సహజ నిగారింపుని కాపాడుతుంది




SANTOOR
GOLD